డిసెంబరు 1988

వెల. 3/-

# చతుర




The Largest Circulated

# 'కన్నీటి కెరటాల వెన్నెల'పై చతుర సమీక్షలు

అక్టోబర్ 'చతుర'లో ప్రచురితమైన ఓల్గా నవల 'కన్నీటి కెరటాల వెన్నెల'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.

## వినూత్న ప్రయోగం

**(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)**

ఓల్గా రాసిన 'కన్నీటి కెరటాలవెన్నెల' ఓ మంచి ఎక్స్‌పెరిమెంటల్ నవల. ఇది సామాన్య పాఠకుల సంగతేమోగానీ సినిమా అభిమానులకో కానుక. ఉత్తమ సినిమాల నేపథ్యంతో వచ్చిన మొదటి తెలుగు నవల ఇదేకావచ్చు. బాపిరాజుగారు 'రోమన్‌హాలీడే' చిత్రం గురించి, 'గ్రేటాగార్బో', 'సైగల్' వంటి నటుల గురించి తన రచనల్లో ఎక్కువగానే ప్రస్తావించారు. ఓల్గా మంచి సిన్మాలేమిటో, అవి ఎలా ఉంటాయో మన నగటు తెలుగు సినీప్రేక్షకులకు విడమరచి అద్భుతంగా చెప్పారు. ఇలాంటి ఉత్తమ నవలలు ఇంకా ఇంకా తెలుగులో వస్తే తెలుగు సినీమారంగం ఏమైనా బాగుపడుతుందేమో! ఇలాంటి వినూత్నమైన నేపథ్యంతో మున్ముందు ఇంకా చాలామంది రచయిత(త్రు)లు ప్రయత్నిస్తే ఆరోగ్యకరమేకాదు, ఆహ్లాదకరం కూడా.

ఇక ఈ నవలలో కథా వస్తువు పాతదే. ఇదే వస్తువుతో త్రివేణి 'హణ్ణెలె చిగురిదాగ' అనే నవల రాసింది. దీని అనువాదం 'చిగురు' పేర 'చతుర'లో వచ్చింది. పుట్టణ్ణ చిత్రంగా తీశాడు. నేపథ్యం, కథావస్తువు "తీర్థానికి తీర్థంగా" విడిపోతున్నాయి. పోతే తెలుగంటే మరీ అంత అభిమానం మార్క్సిస్ట్ దృక్పథం ఉన్న రచయిత్రికి భావ్యంకాదేమో. వారి కలంనుంచి రాలిన 'మరాఠీతిండి', 'మలయాళ మాంత్రికుడు', 'పూనా అమ్మాయిలొద్దు', 'మనదేశం (?) వెళ్లాక చూద్దురుగాని' వంటివి ప్రాంతీయ దురభిమానానికి చిహ్నాలు. ఉమ అలంకరణను ఎబ్బెట్టుగా భావించడమేగాదు, 'వెకిలిగా నవ్వింది'-లాంటి మాటలు ఆమెగుర్చి ప్రయోగించడం తన పాత్ర మీద తనే కసి పెంచుకున్నట్టు అనిపించింది. చలం స్వేచ్ఛాప్రణయం, మార్క్సిస్ట్ భావాలు ఓ కుదురులోకి వస్తాయా? తిండేకరువైన ఇండియాలో సెక్స్‌స్వేచ్ఛకోసం కలలుకనడం మధ్యతరగతి రచయిత్రుల మనస్తత్వానికి ప్రతిబింబం.

'ఐజన్‌స్టీన్ ది'మాన్టేజ్' పద్ధతి, 'ముంటాజ్' పద్ధతికాదు. ఇవి రచయిత్రి చేసిన తప్పులో ముద్రారాక్షసాలో? ఇందిర్ పాత్ర వేసిన 'చున్నీబాలాదేవి' గురించి విశేషాలు తెల్సుకోవాలంటే మేరీసెటాన్ రాసిన 'రే'పై పరిశోధనాత్మక గ్రంథం పోర్ట్రైట్ ఆఫ్ ఎ డైరెక్టర్' చాలా ఉపకరిస్తుంది. 'రావ్ సాహెబ్'లో బారిష్టర్‌కి అతని

కవర్ డిజైన్ : వాసు

పిన్నితో శారీరక సంబంధమున్నట్లు 'విజయ్ మెహతా' చూచాయగా చెప్తుంది. 'చనుబాలు తాగడం' అతనిలో ఈడిపస్ కాంప్లెక్స్‌కి చిహ్నం. అతను నాయికను పెళ్ళిచేసుకొనడానికి అతనివైపు నుంచీ తగిన కారణమే ఉంది. ఐనా తెలుగు సినిమా 'స్రవంతి'లో నాయిక అలిగి విధవ అయినట్లే విజయ్ మెహతా తమ చిత్రాంతంలో నాయికచేత కూడా ఓ మొగాడు కాదనగానే గుండుగీయించేయడం అన్యాయం. ఇది సాంప్రదాయాన్ని ధిక్కరిస్తూనే మరోవైపునుంచి మన్నించడంకాదా? ప్రేమా కారన్త్ తీసిన 'ఫణియమ్మ' చిత్రం అందుకుభిన్నం. సాంప్రదాయమార్గంలో నడుస్తున్నట్లు కన్పించే ఫణియమ్మ వాటిని ధిక్కరిస్తుంది. 'రావ్ సాహెబ్' చిత్రంలో ముగింపు ఫెమినిస్టైన ఓల్గాగారికెలా నచ్చింది?

—టి.యస్. జగన్మోహన్, సికిందరాబాద్

## ఆచరణలో ఆదర్శం

**(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)**

"నవలకి.. ఒక ప్రయోజనం.. ఆదర్శం వుండాలి" అంటే ఓల్గాగారి 'కన్నీటి కెరటాల వెన్నెల'లో అది సిద్ధించినట్లే. నవల ఇతివృత్తం పాతదే. అయినప్పటికీ నవల మలచిన తీరు అమోఘం. జీవితానికో ఆదర్శం, సార్ధకత వుండాలని చాలా బాగా తెలియచెప్పారు.

'రేణు' జీవితాన్ని మలచిన ఇద్దరు స్నేహితులు శిరీష, గమనల పాత్ర చిత్రణ బాగుంది. కష్టాల్లో వున్న మనిషి తోడు కోరుకుంటాడు. సానుభూతితో అర్ధంచేసుకుని సలహాలివ్వటమేకాకుండా శాసించి మరీ వాటిని ఆచరించేలా చెయ్యగలగటమే 'స్నేహ' ధర్మం. ఆ ధర్మాన్ని చక్కగా చిత్రించారు.

అసలు ఫిల్మ్ అప్రిషియేషన్ కోర్సు ఉందనే చాలామందికి తెలీదు. ఒక్కొక్క కథ- డైరెక్షన్ వేల్యూస్ చదువుతుంటే.. పూనాలో ఆ ఇన్‌స్టిట్యూట్‌లో వున్న అనుభూతి కలుగుతుంది. ఆ కోర్సు చెయ్యాలని కూడా అనిపిస్తుంది.

నవలలో నచ్చని అంశం 'మగవారికి 'ఎఫైర్' లుండగాలేంది.. ఆడవారికి వుంటేనేం?...' అనే ఆలోచన. స్త్రీ పురుషుల్లో పోలిక, పోటీ మంచివిషయాల్లోనేగానీ ఇలాంటి విషయాల్లో కాకూడదు. ఎవరికివాళ్ళు ఎఫైర్‌లు చూసుకుంటే.. అప్పుడది.. 'ఇల్లు- సంసారం' అవుతుందా? పిల్లలేమవ్వాలి? వాళ్ళ భవిష్యత్తేమిటి? వాళ్ళమీద ఈ ఎఫైర్‌ల ప్రభావం ఎంత దారుణంగా వుంటుంది? మానసికంగా సంఘర్షణ కలగవచ్చు. ఎఫైర్ ఏర్పరచుకోవాలి అనిపించవచ్చు.. కానీ.. బాధ్యత మర్చిపోతే ఎలా?

జీవితసత్యాల గురించిన సంభాషణలు చాలా వాస్తవ[illegible]న్నాయి. రచయిత్రి 'ఆచరణలో లేని ఆద[illegible].. అనవసరం.. అవి నిర్గంధ కుసుమాలు' అని చాలా బాగా తెలియజేశారు.

—డి.వి. రమణి, హైదరాబాద్

## మనస్తత్వ చిత్రీకరణ

**(తృతీయ బహుమతి రు. 50/-పొందిన సమీక్ష)**

మంచి సినిమాలోకి ఏ విషయమైనా ప్లానుప్రకారమే తప్ప ఏక్సిడెంటల్‌గా రాకూడదనే సూత్రంలాగానే మంచి రచనలో కల్పనలూ, సన్నివేశాలూ, పాత్రలూ ఒక ప్లానుప్రకారం, రచన యొక్క ప్రయోజనాన్ని సాధించేందుకే ఉండాలి. ఈ 'కన్నీటి కెరటాల వెన్నెల' సాధించవలసిన ప్రయోజనం, ఫిల్మ్ ఇన్‌స్టిట్యూట్ పోర్ట్రెయల్ లేకుండా కూడా సాధించవచ్చునేమోననిపిస్తుంది.

ఇల్లూ, ఆఫీసూ, అదే ఆఫీసులో కొలీగ్ అయిన భర్తా- అనే చిన్న ప్రపంచంలోంచి బయటకు వచ్చి, మామూలు ప్రపంచం గురించి తెలుసుకుంటున్న ఒక యువతి వెనకాలే హాస్టలూ, కాంటీనూ, క్లాసు రూమూ- ఇలా గుప్పించి నవల నడిపించారు రచయిత్రి. రవి లేకపోయినా 'మిస్సమ్మ' సినిమా ఆనందాన్నిస్తుందన్న సంఘటనలో గొప్ప మనస్తత్వశాస్త్రమర్మం చక్కగా వివరించారు.

[illegible]న్ని సాధించడానికయినా విల్పవర్ కావా[illegible] 'జోన్ ఆఫ్ ఆర్క్' సినిమా కలిగించిన [illegible]సాదంతో తనుమాత్రం మళ్ళీ మొదటిస్థితికి వెళ్లకూడదనే మాటల్లో ఆ మొదటిస్థితి బాగాలేదనే స్ఫురణ రేణుకి కలి

గిందని చెప్తూ, రవి మరణంతో కలిగిన దుఃఖా న్ని జయించాలనే కోరిక గాఢంగా ఉన్నట్లు సున్నితంగా సూచించారు రచయిత్రి.

సూర్యానికున్న విషయపరిజ్ఞానం చూసి ముగ్ధురాలవటం, అతడు స్టూడెంట్స్ దగ్గర సిగరెట్లు తీసుకోకూడదని శాసించటం, ఇద్ద రూ పూనా చూసి రావాలని తానే ప్రపోజ్‌చే యటం ద్వారా రేణులో సూర్యం పట్ల ఉన్న ఆకర్షణ క్రమాభివృద్ధినొందుతుండటం బాగా చూపించారు కాని సూర్యం తనపేరు గురించి రెండుసార్లు అడిగినా రేణు సమాధానం చెప్ప దు. గమనతో ఒకసారి వీలుకాదని చెప్పటం తప్ప, చివరి నిర్ణయం ఏ తర్కంతో తీసుకు న్నదీ, తనలో ఎలాంటి అంతర్మథనం అనుభ వించిందీ చూపకపోవటం రచయిత్రి లోపమా లేక న, గల మధ్యనుంచి కావాలని తీసేసిన 'రి' లాంటిదా? స్త్రీకి వేరే ఎఫైర్ అన్న చర్చ పాఠకులను ఆలోచింపజేస్తుంది.

—పి. భాస్కర్‌రావు, హైదరాబాద్

## చర్చావేదిక

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

ఫిల్మోత్సవాల పేరుతో ఎన్నో పండగలు జరుగుతున్నా కనీసం మన దేశంలో అవార్డులు పొందిన వివిధ భాషాచిత్రాలనికూడా చూసే అవకాశంలేని మాలాంటివాళ్ళకి, మంచి విదేశీ చిత్రాలని చూసే అవకాశం అసల్లేదు. ఈ నవల చదివాక సంక్షిప్తంగానైనాసరే వివిధ విదేశీ చిత్రాల గూర్చి ముఖ్యంగా అందులో విషయం గూర్చి తెల్సుకున్నామన్న తృప్తిక ల్గింది. అసలు నవలలో ఆ విషయాలను చర్చించడమే రచయిత్రి ఉద్దేశంగా కన్పించింది. అందుకే కథలో ఏమీ లేకపో యినా నవలంతా ఆసక్తికరంగా సాగింది. కథనం బాగుంది. అయితే కొన్నివిషయాల్లో ఖచ్చితంగా తన అభిప్రాయాన్ని పాత్రల ద్వారా చెప్పిన రచయిత్రి మరికొన్ని విషయా ల్లో స్పష్టంగా చెప్పలేకపోయారు. ఉదాహరణకి 'రజనీ ఎఫైర్' తీసుకోవచ్చు. 'రజనీ ఎఫైర్'ని 'సమర్థించడమో-ఖండించడమో' కాకుండా 'అర్థంచేసుకోమని' సూర్యం పాత్రద్వారా చెప్పి వదిలేశారు. అయితే రచయిత్రి పరోక్షంగా సమర్థించేరు అని చెప్పడానికి ఇంకో సంద ర్భంలో ఇంకోపాత్ర ద్వారా 'హ్యూమన్ కెమిస్ట్రీ' అంటూ చెప్పినవాటిని పరిగణనలోకి తీసుకోవ చ్చు. ఇక 'కళ-రాజకీయాలు' విషయంలో ఆనంద్ పాత్రద్వారా చెప్పిన మాటలు కుహనా మేధావులందరికీ చెంపదెబ్బలవుతాయి. మనం తీసే ఊపిరిలోనే రాజకీయాలు మిళిత మైనపుడు కళ ఒక లెక్కా. ఇక సిక్కులపై జరిగిన పైశాచిక హత్యాకాండగూర్చి ఎంత చదివినా మళ్ళీ గుర్తుచేసి మా హృదయాలను కదిలించేరు. "ప్రేమ, స్నేహం, ఆత్మీయత, మానవత్వం, కరుణ ఈ ముసుగులన్నీ తీసే సినతర్వాత జీవితపు నగ్నస్వరూపాన్ని చూస్తే మనకర్థమవుతుంది మనం భ్రమల్లో బతుకు తున్నామని" అంటూ గమనపాత్రద్వారా చె ప్పిన ఈ మాటలు నిజంగా ఆణిముత్యాలు. ఇది ఒక విభిన్నమైన నవల. ఇటువంటి నవలని రాసిన ఓల్గాగార్కి, ఈ నవలని ప్రచు రించి తన ప్రత్యేకతను నిరూపించుకున్న 'చతుర'కి అభినందనలు.

— అధికార్ల జగన్నాథశాస్త్రి, విశాఖపట్టణం

## స్ఫూర్తినిచ్చే నవల

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

భర్తను కోల్పోయిన స్త్రీలు జీవితమంతా అతని కోసం విలపిస్తూ కూర్చోక చనిపోయిన ఆ వ్యక్తి తమ అంతరంగంలో, ఆలోచనలలో, జ్ఞాపకా లలో సజీవంగా ఉన్నాడని భావిస్తూ అతని కోసం తాము సంతోషంగా ఉండాలని "కన్నీటి కెరటాల వెన్నెల" ఉద్బోధిస్తుంది.

సినిమా అన్నది కేవలం వినోదం కోసమే అన్న అభిప్రాయం ఉన్నవారికి ఈ నవల చదివిన తర్వాత అది కూడా ఒక శాస్త్రమే అని బోధపడుతుంది. అసలు పేరు కూడా వినని ఎన్నో దేశ విదేశ చిత్రాల గూర్చి రచయిత్రి చక్కగా వివరించారు. నవల చదువుతున్నంత సేపు పాఠకులు కూడా ఫిలిం ఇనిస్టిట్యూట్‌లో ఉండి ఆయా సినిమాలు చూస్తున్న అనుభూతి కలుగుతుంది. సినిమాలను ఏయే కోణాలలో చూడాలి. ఎలా విమర్శనా దృక్పథంతో పరిశీ




లించాలో తెలుస్తుంది. ఓల్గాగారి రచనల్లో ఉండే భావుకత ఈ నవలలో కూడా పాఠకుల హృదయాలను స్పందింపజేస్తుంది. పరిస్థితుల ప్రభావం వలన వ్యక్తులలోని సున్నితమైన భావాలు ఎలా తుంచివేయబడతాయో గమనపాత్ర ద్వారా మనకు అర్థమవుతుంది. ప్రజాస్వామ్యమనేది కేవలం రాజకీయ రంగంలోనే కాకుండా అది మన నిత్యజీవితానికి కూడా అన్వయించుకోవచ్చునని ఓ సందర్భంలో రేణు, సూర్యంల సంభాషణ ద్వారా తెలియబరచడం చాలా బాగుంది. పూనాలో ఉన్నప్పుడు రేణు, సూర్యంలు తెలుగు మాట్లాడటానికై పడే తహతహను చదువుతుంటే ఎంతో సంతోషంగా అనిపిస్తుంది. తెలుగులో 'చ'ను రెండురకాలుగా ఉచ్చరించాలని ఈ నవల చదివిన తరువాతే తెలిసింది.

మొత్తానికి ఓల్గాగారి ''కన్నీటికెరటాల వెన్నెల' స్త్రీలకు కావలసిన మనోధైర్యం, సినీపరిజ్ఞానం, స్నేహంలోని మాధుర్యం మొదలైన వివిధ విషయాలను తెలియజేసే చక్కని నవల.

— కె. సుమలత, భువనగిరి

## అన్యాయం

*(రు. 25/- బహుమతి పొందిన లేఖ)*

అక్టోబరు, 88 'చతుర'లో ప్రచురించిన 'మినీకతలు'లో పెందుర్తి మాష్టర్జీగారి 'అడటిక్కెట్టు' నా 'కూల్డబ్బులు' అనే మినీ కథకు పూర్తిగా నకలు అని తెలియజేయడానికి చింతిస్తున్నాను: 'అడటిక్కెట్టు' కథలో, కథపేరులోనూ, పాత్రల, ప్రదేశాల పేర్లలోనూ, కొద్దిగా భాషలోనూ తప్పతేడా ఏమీలేదు.

నా 'కూల్డబ్బులు' మినీకథగా 'ఆంధ్రభూమి' దినపత్రికలో జూలై 21, 1985లోనే అచ్చయింది. కాళీపట్నం రామారావుగారి సంపాదకత్వంలో రూపొందిన 'నేటికథ' అనే మినీకథల సంపుటిలో ఈ కథ కూడా ఉంది. ఆ పుస్తకాన్ని సమీక్షిస్తూ వివిధ పత్రికలు ప్రత్యేకించి 'కూల్డబ్బులు' కథను మంచి కథగా ప్రస్తావించడం జరిగింది. ఇలాంటి కథను పెందుర్తి మాష్టర్జీగారు స్వంతకథగా పత్రికా సంపాదకులను, పాఠకులను మభ్యపెట్టజూడటం అన్యాయం.

— పట్నాల ఈశ్వరరావు, జొన్నవలస

# చతుర సమీక్ష

ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర' లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరటావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో మొదటి మూడింటికి రు.100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనా శక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతుర ప్రపంచం, కథలు, ఫీచర్ల వంటి ఇతర అంశాల పట్లకూడా పాఠకులు తమ అభిప్రాయాలను విడిగా రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలిచాం.

## కూపన్

డిశంబర్ చతుర నవల: అగ్నివసంతం

సమీక్షకుని పేరు: ..............................

చిరునామా: ..............................

..............................

..............................

పల్లె పడుచు చూపుల్లో పరువాల పువ్వులు
'అన్నదాత' అండతో పొలాలన్నీ నవ్వులు!



రైతులోకం అభిమానించే పత్రిక

# అన్నదాత

అన్నదాత చందాదారులుగా చేరండి!
8 రూ॥ల లాభం పొందండి!!

నెలవిడిచి నెల బోనస్ బుక్ అందుకోండి

చందాపంపవలసిన చిరునామా!
'అన్నదాత' 'ఈనాడు కాంపౌండ్' హైదరాబాద్- 500 482



# చతుర ప్రపంచం

అక్కడ ఏటా ఇటువంటివి వందలాది శస్త్రచికిత్సలు జరుగుతుంటాయి.

## మైక్రో సర్జరీ మహాత్మ్యం

తెగిపోయిన శరీర భాగాలను అతికించే పని అత్యంత ఆసక్తికరమైనదేకాక అతిక్లిష్టంగా కూడా వుంటుంది. ఖండిత కండరాలలోని అతి సూక్ష్మమైన నరాలను, రక్తనాళాలను కనుగొనడానికి శస్త్రచికిత్సా నిపుణులు 'మైక్రోస్కోపిక్‌లెన్స్'లను ఉపయోగిస్తారు. 1920వ దశకంలో సర్జన్లు తొలిసారిగా మైక్రోస్కోపును ఉపయోగించి చెవిలోపలి భాగంలో శస్త్రచికిత్స జరిపారు. అయితే ఆపరేషన్లకు అవసరమైన ఒక అత్యవసర పరికరంగా ఈ 'సూక్ష్మదర్శిని'కి పూర్తిస్థాయి గుర్తింపు ఈమధ్యకాలంలో మాత్రమే లభించింది.

1962 లో అమెరికాలోని బోస్టన్‌కి చెందిన ఒక మైక్రోసర్జన్ తెగిపోయిన ఒక శరీరభాగాన్ని విజయవంతంగా మళ్లీ ఆ శరీరంలో అమర్చగలిగారు. ఆ ఏడాదిలో... ఒక కుర్రవాడు రైలు క్రింద పడటంతో అతడి చెయ్యి తెగిపోయింది.

బోస్టన్ వైద్యుడు దానిని తిరిగి ఆ బాలుని శరీరంలో అమర్చగలగడంతో అమెరికాలో ఈ తరహాలో మొట్టమొదటి ఆపరేషన్ విజయవంతమైంది. కాగా, ఖండిత అవయవాలను తిరిగి అతికించే ఈ 'లింబ్ ట్రాన్స్‌ప్లాంటేషన్ సర్జరీ' 1970 దశకంలో అధిక వ్యాప్తిని పొందింది. నేడు అమెరికాలోని పెద్ద నగరాలలో 'మైక్రోసర్జరీ' సర్వసాధారణమైపోయింది.

మిన్నెసోటాలోని మినేపోలిస్, సెయింట్ పాల్ జంటనగరాలలో - మిన్నెసోటా యూనివర్సిటీ ప్లాస్టిక్, రీకన్‌స్ట్రక్టివ్ సర్జరీ విభాగం అధిపతిగా వున్న డాక్టర్ బ్రూస్ కనింగ్‌హామ్ ఈమైక్రోసర్జరీ రంగంలో అగ్రశ్రేణిలో వున్నారు. ఆయన ఇలాంటి ఆపరేషన్లను రోజుకు రెండు మూడుచొప్పున చకచకా చేసెయ్యగలరు. ఆయన తన జీవితకాలంలో ఎక్కువ భాగాన్ని 'మైక్రోసర్జరీ' గదిలోనే గడిపేస్తుంటారు.

కేల్‌మెక్‌లాలిన్ అనే ఎనిమిదేళ్ల బాలుడికి రోడ్డు ప్రమాదంలో కుడిచెయ్యి నజ్జునజ్జయిపోయింది. ఆ బాలుడికి డాక్టర్ కనింగ్‌హామ్ వెంటనే శస్త్రచికిత్స జరిపి అతడి కుడి చేతి చూపుడు వ్రేలిని, మధ్యవ్రేలిని పునరుద్ధరించారు. అయితే బొటనవ్రేలు, చిటికెన వ్రేలు బాగా చితికి పోవడంతో వాటికి ఆయన 'మరమ్మతు' జరపలేకపోయారు.

చేతికి చిటికెన వ్రేలు లేకపోయినా ఫర్వాలేదు, కాని బొటనవ్రేలు కోల్పోతే చెయ్యి మొత్తం పనికిరాకుండా పోతుంది. అందువల్ల డాక్టర్ కనింగ్‌హామ్ ఒక ఏడాది తర్వాత అదే బాలునికి మరొక శస్త్రచికిత్స జరిపి - అతడి ఎడమ పాదంలో బొటనవ్రేలి ప్రక్కనగల వ్రేలిని కత్తిరించి, దానిని కుడిచేతి బొటనవ్రేలుగా అమర్చారు!

డాక్టర్ కనింగ్‌హామ్ జరిపే 'మైక్రోసర్జరీ' లో ఇది అతి క్లిష్టమైన ఆపరేషన్ అని చెప్పాలి. ఎందుకంటే - ఈ శస్త్రచికిత్సలో అటు కాలివ్రేలిని, ఇటు చేతి వ్రేలిని... రెండింటినీ కత్తిరించవలసి వుంటుంది. ఈ శరీర భాగాలలోని నరాలు, రక్తనాళాలు కూడా చాలా సన్నగా వుంటాయి. ఎంతో శ్రమతో కూడుకొని వున్న ఈ ఆపరేషన్‌లో కేవలం ఒక మిల్లీమీటర్ వ్యాసం







మాత్రమే కలిగి వుండే వ్రేలి నరాన్ని అతికించడానికి ఒక్కొక్కదానికి అర్థగంటకు పైగా వ్యవధి అవసరమవుతుంది. శస్త్రచికిత్సకై మైక్రోస్కోపు క్రింద నుంచి వినియోగించే పరికరాలలో కొన్నిటి పరిమాణం మనిషి తల వెంట్రుక కంటె సన్నగా వుంటుంది. దీనినిబట్టి ఈ ఆపరేషన్ ఎంతటి క్లిష్టమైనదనేది అవగతం చేసుకోవచ్చు.

అయితే ఈ రకం శస్త్రచికిత్సలలో ఆరితేరిన డాక్టర్ కనింగ్‌హామ్ వీటిని సునాయాసంగా చేస్తుంటారు. కాలివ్రేలిని చేతివ్రేలుగా అమర్చే ఆపరేషన్లను ఆయన ఇప్పటికి 10 కి పైగా విజయవంతంగా నిర్వహించారు.

## ఎనభైలో ఇరవై

"మా కాలంలో ఇలా కాదమ్మా- పిదపకాలం పిదప బుద్ధులూను" అని మన పెద్దలు వాపోతుంటే చాదస్తం లెమ్మని కొట్టి పారేస్తుంటాం. కాని గతించిన తరాల వారిలో ఉన్న బలం, ఏకాగ్రత, పట్టుదల, శక్తి రోజు రోజుకీ మనుమల్లో సన్నగిల్లుతున్న మాట మాత్రం నిజమేగదా!

ఎనభయ్యవపడి దాటినా ఇరవై ఏళ్లవారి కంటే చురుగ్గా, మెరుగ్గా, ఆశ్చర్యపరుస్తూ నర్తిస్తున్న మైసూర్ పాలెస్ ఆస్థాన నర్తకి లక్ష్మమ్మ భరత నాట్యంలో నిష్ణాతురాలు. 82 ఏళ్ల వయసులో కూడా ఆమె శరీర కదలికల్లో ఎక్కడా తేడా రాకుండా తాళ, లయ గతులు తప్పకుండా మనోహరంగా, మనోజ్ఞంగా భరత నాట్యం చేస్తుంది.

కర్నాటక రాష్ట్రంలోని చిక్కమగళూరు నుండి ఇందిరా గాంధీ పోటీ చేసి గెలిచిన విషయం మనకు తెలును. ఆ చిక్కమగళూర్‌కు చెందిన లక్ష్మమ్మ 'లంబని' తెగలో జన్మించింది. ఆమె స్వగ్రామం 'థంగి'. ఆ రోజుల్లో ఆమె కులస్తులు చాలా వెనుకబడిన తెగగా పరిగణింపబడేవారు. వారెంత తెలివైన వారైనా మహిళల్ని మాత్రం నృత్యం చేసేందుకు అనుమతించేవారు కాదు. అయితే అన్ని సాంప్రదాయాల్ని కాదనుకొని, వాటికి విరుద్ధంగా నర్తించేందుకు మైసూరుకు వెళ్లినందుకు తెగలోని పెద్దలు లక్ష్మమ్మనేగాక ఆమె కుటుంబాన్ని కూడా తమ జాతినుంచి వెలివేశారు.

లక్ష్మమ్మ బాల్యంలో స్కూల్లోని ఓ ప్రత్యేక కార్యక్రమంలో సరస్వతి పాత్రని అభినయించింది. ఎంతగా అందులో లీనమై నటించేదంటే ప్రేక్షకులు ఒక్కరు కూడా ఆమెని అభినందించకుండా వుండలేక పోయేవారు. ఆమెకి ఉజ్వలమైన భవిష్యత్తు ఉందని ఆనాడే అందరూ ఊహించారు. ఆ వెంటనే



కొందరు లక్ష్మమ్మ తల్లిదండ్రుల్ని కలుసుకుని యోగ్యుడైన గురువు చేత శిక్షణ ఇప్పిస్తే ఆమె గొప్ప కళాకారిణి అవుతుందని చెప్పారు. అందుకు సమ్మతించిన లక్ష్మమ్మ తల్లిదండ్రులు ఒక మంచి గురువు నెన్నుకొని నృత్యాభ్యాస నిమిత్తం లక్ష్మమ్మని పంపించారు.

**1914** నుండి లక్ష్మమ్మ శాస్త్రీయ నృత్యం ప్రారంభించారు. అది నేటికీ కొనసాగుతూనే ఉంది. భరతనాట్యమే గాక ఆమె గురువు బెట్టిల్లె కిట్టప్ప వద్ద గానం కూడా నేర్చుకోవటం జరిగింది. గురువుగారి ప్రోత్సాహంతో మైసూరుకు వెళ్లి మరింత క్షుణ్ణంగా, సరికొత్త మెళుకువలతో నృత్యం నేర్చుకొన్నారు. తల్లిదండ్రులే గాక తాతగారు రామనాయక్, మామ్మగారు రాంబాయి లక్ష్మమ్మకి చాలా ప్రోత్సాహం ఇచ్చారు. మైసూరులోని ఎస్టడి దయమ్మ డాన్సింగ్ స్కూల్లో **25** సంవత్సరాల పాటు నాట్యం నేర్చుకున్నారు లక్ష్మమ్మ. నాట్య సరస్వతి అనే బిరుదు పొందిన దయమ్మ **1945** లో మరణించింది. అప్పటి వరకూ దయమ్మ, లక్ష్మమ్మలు జంటగా దక్షిణ భారత దేశమంతా విస్తృతంగా పర్యటించి ఎన్నో ప్రదర్శనలిచ్చారు. ఆ రోజుల్లో మైసూరు మహారాజావారి వారసుడూ, వంశంలో నాలుగవ వాడైన మైసూరు మహారాజా కృష్ణరాజ వడియార్ పాలిస్తున్నాడు. గణపతి పూజోత్సవాలలో ఓసారి ఆయన లక్ష్మమ్మ నృత్య ప్రదర్శన చూసి ఆకర్షితులై దీపావళి సాంస్కృతిక ఉత్సవాలలో లక్ష్మమ్మ నృత్య ప్రదర్శన ఏర్పాటు చేశారు. ఆనాటి నృత్యం చూశాక ఆమెకు నెలకు **50** రూపాయల వేతనంతో తన ఆస్థాన నర్తకిగా నియమించారు.

మహారాజావారి దర్బారులో అన్ని ఉత్సవాల్లోనూ లక్ష్మమ్మ నృత్య ప్రదర్శన ప్రత్యేకాంశంగా ఉండేది. ప్రజలెంతో కుతూహలంగా తిలకించేవారు. ఆ రకంగా నాటి రాష్ట్రపతి సర్వేపల్లి రాధాకృష్ణన్ కూడా లక్ష్మమ్మ అభిమాని అయ్యారు. నాట్య సరస్వతి అనే బిరుదును లక్ష్మమ్మ గురువైన దయమ్మకిచ్చింది కూడా రాధాకృష్ణనే. ఆయనే ఒక సందర్భంలో లక్ష్మమ్మ దయమ్మకంటే బాగా నాట్యం చేస్తుందనీ, గురువును మించిన శిష్యురాలని లక్ష్మమ్మని అభినందించారు. "ఈ రోజుల్లో భరతనాట్యం ప్రేక్షకుల్ని రంజింపచేయడానికే చేస్తున్నారు తప్ప మెళుకువలు ప్రదర్శించటానికి, కొత్తవి కనిపెట్టటానికి కాదు. కళ కళ కోసమే. కళే భగవత్సాన్నిధ్యాన్ని ప్రసాదిస్తుంది..." అంటారు లక్ష్మమ్మ

★






## మతిమరుపు

ముత్యాలరావు కూనిరాగాలు తీస్తూ స్నానం చేస్తున్నాడు. స్నానం చేస్తూ ఆలోచిస్తున్నాడు. ఆలోచిస్తూ కూనిరాగాలు తీస్తున్నాడు. నిన్నటి నుండీ అలా ఆలోచిస్తూనే ఉన్నాడు.

ముత్యాలరావు కాస్త మతిమరుపు మనిషి. కాని ఎవరైనా ఆ మాట ఎదురుగా అంటే మాత్రం ఉడుక్కుంటాడు. నిన్న ఆఫీసులో ఆ విషయమై వాళ్ళ టైపిస్టు మాలతితో గొడవ పెట్టుకున్నాడు. 'తనకు మతిమరుపు లేదనీ, కావాలంటే పరీక్షించి చూడమనీ, సవాల్‌చేశాడు.

సరేనని ఆవిడ ఓ చిక్కు ప్రశ్నవేసి, దాన్ని సాల్వ్‌చేసి పేపరుమీద రాసుకోకుండా గుర్తుపెట్టుకుని వచ్చి మర్నాడు చెబితే తాను ఆ విషయం అంగీకరిస్తానని అన్నది.

ముత్యాలరావు అప్పటినుంచి ఆలోచించడం మొదలుపెట్టాడు. ఇంటికి వచ్చాకా, కాఫీ తాగుతూ, భోజనం చేస్తూ, అర్ధరాత్రిదాక నిద్రకాస్తూ ఆలోచించాడు. అయినా ఆన్సర్‌రాలేదు.

స్నానం, ముగించి వంటికి టవల్ కట్టుకుని బైటికి వచ్చి, వంటింట్లో కంచం ముందు కూర్చున్నాడు, తింటూ ఆలోచించాడు. అయినా తట్టలేదు.

మొహానికి పౌడర్ పట్టించి, తలదువ్వి, చొక్కా వేసుకుని అద్దంలో చూస్తూ కాలర్ సరిచేసుకుంటూ, ఆలోచిస్తున్నవాడల్లా ఒక్కసారిగా 'యురేకా' అంటూ అరిచాడు. ఆ చిక్కు ప్రశ్నకు సమాధానం వచ్చింది.

ఆ కేకవిని అతడి భార్య వచ్చింది కంగారు పడుతూ.

"ఏం లేదు వెళ్ళి నీ పనిచూసుకో" అంటూ విసుక్కున్నాడు ముత్యాలరావు, ఆమె లోపలికి వెళ్ళిపోయింది.

ఆలస్యం అవుతే మళ్ళీ ఆ జవాబు మరచిపోవచ్చని గోడకి తగిలించిన అద్దంలో మరోసారి మొహం చూసుకుని, జుట్టు, కాలర్ సర్దుకుని, ఒకసారి గర్వంగా నవ్వుకుని స్టాండు మీదున్న స్కూటర్ తాళాలు తీసుకుని బయటకు వచ్చాడు.

స్కూటర్ స్టార్ట్‌చేసీ, చేయగానే తలుపు దగ్గరికి అతడి భార్య వచ్చి, "ఏమండి ఓ సారిలా రండి" అని ఆదుర్దాగా పిలిచింది. వెనక్కు వెళ్ళితే పిచ్చిమొద్దు అవీ ఇవీ బజారు పన్లు చెబుతుంది. ఆ గొడవలో చిక్కు ప్రశ్న జవాబు మర్చిపోవచ్చని, గేరుమార్చి స్కూటర్ స్పీడుగా పోనిచ్చాడు.

వెనకనుంచి అతడి భార్య మరికాస్త గట్టిగా అరుస్తూ ఏదో చెప్పింది. కానీ, అది ముత్యాలరావు చెవిన బడలేదు.

తనకు మతిమరపులేదని ఈ రోజు మాలతి ఒప్పుకుని తీరాలి. ఆమె మరెన్నడూ తనను మతిమరుపు వాడంటూ ఎగతాళి చెయ్యదు.

ఆ సంగతి తెలుసుకోగానే ముత్యాలరావుకు గాలిలో తేలినట్లనిపించసాగింది.

రోడ్డుమీద అందరూ తనకేసి వింతగా చూడటం, కొందరు నవ్వుకోవడం ముత్యాలరావుకు కన్పించింది. వారెందుకలా వింతగా చూస్తున్నారో అతనికి అర్థంకాలేదు. ఒకసారి స్టైల్‌గా క్రాపును సర్దుకుని, చిక్కుప్రశ్న సమాధానాన్ని మరచి పోకుండా మననం చేసుకుంటూ స్కూటరు నడపసాగాడు.

ఆఫీస్‌గేట్‌లోంచి లోపలికి పోనిచ్చి, స్కూటర్ దిగుతూ అక్కడ అందరూ తననుచూసి నవ్వుకుంటుండడం చూసి ఆశ్చర్యపోయాడు. వాళ్ళందరూ ఎందుకలా నవ్వుతున్నారో. అర్థంగాక స్కూటర్‌ను లాక్‌చేసి, తాళాలను అలవాటు చొప్పున పేంట్ జేబులో వేసుకో బోయి, పిడుగుపడినట్లుగా అదిరిపోయాడు. ముత్యాలరావు.

ఆ హడావిడిలో పేంట్ వేసుకోవడం మరచి పోయి టవల్‌తోనే వచ్చేశాడు. స్నానం చేసింది మొదలు ఆఫీసుకు వెళ్ళేముందు బట్టలు వేసుకునే వరకు తుంటికి టవల్ కట్టుకుని ఉండటం ముత్యాలరావుకు అలవాటు.

—దాసరి వెంకటరమణ



## పార్టీ

బస్సుకోసం నిరీక్షిస్తున్న సుందరం ఏనాటి పూజలు ఫలించాయోగాని అప్పటికప్పుడే వచ్చింది బస్సు. దాని నిండా జనం కిటకిటలాడి పోతున్నారు. దూసుకుంటూ, కాళ్ళుతొక్కుతూ, సారీ చెబుతూ ఎలాగో మొత్తానికి బస్సెక్కేశాడు సుందరం. కూర్చున్న శాల్తీలకేసి కళ్ళు తిప్పేసరికి తన బెస్ట్‌ఫ్రెండ్ మూర్తి కనిపించేడు. సుందరానికి ప్రాణం లేచొచ్చినట్లనిపించి తన చేతుల్లోని పచారీ సామాన్ల సంచులు అతనికి జాగ్రత్తగా అందించాడు. "గురూ నిన్ను పార్టీ అడగటం ఇది నూటఒకటోసారి ఇంతకీ ఎప్పుడు ప్రోగ్రాం? కనీసం స్వీట్సైనా ఫర్లేదు సరిపెట్టుకుంటాన్లేవోయ్!" అంటూ ఆ లగేజి అందుకున్నాడు మూర్తి.

"వెధవన్నరెధవ! వీడికి ఎప్పుడూ తిండిగొడవే" అని మనసులోనే తిట్టుకున్నాడు సుందరం. ఆతర్వాతి స్టేజిలో ప్రవాహంలా దూసుకువచ్చారు జనం. వారంతా కలసి సుందరాన్ని మరో నాలుగడుగులు వెనక్కినెట్టి పారేశారు. సుందరం దిగే స్టేజీ వచ్చేసరికి ఓ

ముప్పావుగంట పట్టింది. మూర్తి స్టేజి రావాలంటే మరో పది నిముషాలు కావాలి. దిగేందుకు ఉద్యుక్తుడై మిత్రుని దగ్గరున్న తన సంచులు తీసుకున్నాడు సుందరం. ఇల్లు చేరగానే చిర్నవ్వుల్తో పిల్లలెదురయ్యేరు.

"ఆ! పిల్లలూ... మీకోసం ఏంతెచ్చానో చెప్పుకోండి చూద్దాం" అని ఊరించాడు పిల్లల్ని. వాళ్ళు దిక్కులు చూశారు "సర్లే... స్వీట్ బాక్సూ ద్రాక్షా తెచ్చాను చూడు" అంటూ భార్యకి సంచులు అందించి బాత్రూంకేసి నడిచాడు.

పిల్లలు ముగ్గురూ తలోప్లేటూ తెచ్చుకుని రెడీగా నిల్చున్నారు. తనకీ, భర్తకీ కూడా మరో రెండు ప్లేట్లు తెచ్చి బ్యాగు తెరిచింది భార్యామణి.

పిల్లలు ఇక ఆగలేమన్నట్లు తొందరపెట్టారు అమ్మని. పేస్టూ, సోపులూ, షేవింగ్‌క్రీమూ... లాంటి చిల్లర వస్తువులు నానారకాలూ బయట పడ్డాయి. కానీ భర్తగారు చెప్పిన సదరు స్వీట్లూ, ఫ్రూట్లూ మాత్రం మచ్చుకి కూడా లేవు. పిల్లలు గయ్‌మన్నారు. భార్యామణి భద్రకాళిగా మారింది. సరిగా అప్పుడే బాత్రూం నుండి వచ్చాడు సుందరం "ఏమిటబ్బా... వీరి స్వరాలలో అపశృతులు?" అనుకుంటూ. తక్షణం అతన్ని చుట్టుకున్నారు పరివారం.

సుందరానికి ఎక్కడలోపం జరిగిందో అర్థంకాలేదు. తను పిల్లలకి ఇష్టమైన స్వీట్లు రెండురకాలు కలిపి కిలోదాకా, ఓరెండు కిలోల పళ్ళూ కూడా కొన్నాడు. మరి అవేమయ్యాయి-

జుట్టుపీక్కున్నాడు-

ఎటూ పాలుపోలేదు-

ఒళ్ళుమండిన భార్యామణి సంచి బోర్లించింది. ఫోల్డు చేసిన ఓ కాగితం సుందరాన్ని ఆకర్షించింది.

విప్పిచదవేడు ఆత్రంగా-

"గురూ! నువ్వెలాగూ పార్టీ ఇవ్వవు... నేనే పుచ్చుకుంటున్నాను......"

– జ్యోతిరాణి

## సైకాలజీ

రమేష్‌కి పెళ్ళి కుదిరింది. కాబోయే భార్య శర్మిలతో ఏకాంతంగా మాట్లాడాలనిపించి వాళ్ళి



ంటికి వెళ్ళాడు. ఇంట్లో ఎవరూ లేరు. కారిడార్‌లో ఓ పాప ఏడుస్తోంది.

"ఏం పాపా... ఎందుకేడుస్తున్నావ్?" అడిగాడు ముద్దుముద్దుగా.

"నన్ను శర్మిలా ఆంటీ బజార్‌కి తీస్కెళ్ళలేదు" వచ్చీరాని మాటలతో చెప్పింది.

చిన్నపిల్లలకి కథలు ఇష్టమని ఎం.ఎ. సైకాలజీలో చదువుకున్నాడు రమేష్.

"మనం కథలు చెప్పుకుందామా పాపా!" తనూ చిన్నపిల్లాడిలా గొంతు మార్చి అడిగాడు ఓదారుస్తున్నట్లుగా.

పాప ఏడవటం మానలేదు.

కథలంటే ఎక్కువగా ఇష్టం లేదేమో! పోనీ పిల్లలకి నచ్చే అంశం ఏమిటా- అని ఆలోచించేడు రమేష్.

ఔనౌను... మిమిక్రీ అంటే పిల్లలకిష్టం. పైగా తన మిమిక్రీకి ఈ పిల్ల ఆనందపడిపోయి ఈ అంకులెంత మంచివాడు ఆంటీ అని శర్మిలకు రెకమెండ్ చేస్తుందేమో!

"ఆఁ... చూడు పాపా! నీకే జంతువు ఇష్టం" అడిగాడు.

"కోతి" చెప్పింది.

కోతిలా కిచకిచమంటూ కిటికీ ఎక్కాడు రమేష్. సోఫాల్లో, కుర్చీల్లో గంతులేస్తూ ఎగిరేడు. పాప విస్మయంగా చూస్తోంది.

ఓహో... కోతి చేష్టలు నచ్చలేదు కాబోలనుకుని పులిలా గాండ్రు గాండ్రుమన్నాడు.

కానీ, పాప సంతోషించలేదు.

"కూ... ఛుక్ ఛుక్ ఛుక్ ఛుక్... ఛూఛుక్... కూ..." ట్రెయిన్‌లా అభినయిస్తూ నోటికి అరచేయి నిలువుగా అడ్డుపెట్టుకుని పరుగెత్తసాగాడు హాలంతా.

పాప ఏడవటం మానేసి తెల్లబోయి చూస్తోందతనివైపు.

గ్లాసుడు మంచినీళ్ళు తాగి మళ్ళీ మిమిక్రీ ప్రారంభించేడు రమేష్.

ఈసారి కుక్క, నక్క, పిల్లి, కప్ప, గేదెలన్నిటి ధ్వనులనీ అనుకరించాడు.

ఇంతలో తోటలో పనిచేసుకుంటున్న తోట మాలీ, బయటికెళ్ళిన శర్మిలా ఇంట్లోకొచ్చారు. రమేష్ వైపు చూసి- "ఎంతసేపైంది వచ్చి" అడిగింది శర్మిల.

"గంటపైగా" చెప్పేడు.

పాప కల్పించుకుని, "శర్మిలా ఆంటీ... నువ్వీ అంకుల్ని అస్సలు పెళ్ళిచేసుకోవద్దు. ఈయనకి బాగా పిచ్చిముదిరింది. హాస్పిటల్లో చేర్పించాలి. వచ్చినప్పటినుండీ గెంతుతున్నాడు. పాడుతున్నాడు. నానా అల్లరీ చేస్తున్నాడనుకో" ఆరిందాలా చేతులు తిప్పుతూ చెబుతోంది. రమేష్ తల గిర్రున తిరిగిపోయింది.

—కొల్లిమల్ల అప్పారావు

చతుర సంపుటి: 11 డిశంబర్ 1988 సంచిక: 11

"నీచుడా... నువ్వు మనిషివా మృగానివా? డబ్బుని కొలబద్దగా, హోదాని, అంతస్తుని తూనికరాళ్ళుగా ఎంచుకునే నీకెలా తెలుస్తుంది మనను విలువ! డబ్బుతో కాపురంచేసి, డబ్బునే పిల్లల్నిగా కనే నీకెలా తెలుస్తుంది ప్రేమ విలువ! నా ఎదుటనుండి వెళ్ళిపో! నువ్వెంత అక్రమంగా తీర్పిస్తావో నాకు నేనిచ్చుకునే తీర్పుద్వారా నిరూపిస్తాను; న్యాయదేవత విలువ నిలబెడతాను... కళ్ళు తెరిపిస్తాను" అంటూ ఆక్రోశించిందామె.

కనిపెంచిన తండ్రినే దూషించే దుస్థితి ఆమెకెందుకు కలిగింది? ఎవరు దీనికి కారణం?? నేటి వ్యవస్థలో జరుగుతున్న అన్యాయాలకు అమాయకులు ఎలా బలవుతున్నారు? ఈ నగ్నసత్యాన్ని కళ్ళముందుంచుతున్న 'వేగావతి' రచన 'అగ్నివసంతం' ఈనెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్రనవల

# అగ్ని వసంతం

– వేగావతి

Vasu

"అక్కా..."! పిలిచాడతను.

"ఏంరా?" అంటూ బయటికొచ్చిందామె.

"ఏంతెచ్చానో' చూడు! భుజాలెగరేశాడత ను.

అక్కమొగంచాటంతయింది. "మల్లెలు తెచ్చావు, సన్నజాజులు తెచ్చావు, గులాబీ చెండు తెచ్చావు, గుమ్మడి పండుతెచ్చావు, బంగారం ముద్దతెచ్చావు, ముత్యాలమూటతె చ్చావు" అంటూ దేవుడే అనుగ్రహించి వరమి చ్చినట్టుగా పొంగిపోయింది.

అతని వెంటవచ్చిన పిల్ల సిగ్గుపడిపో యింది. కళ్లు మిలమిలమెరిశాయి. పెదాలు సన్నగా ఒణికాయి. బుగ్గలు కెంపులయ్యాయి. శిరస్సు అవనతం అయింది. నిజమే... ఆ పిల్ల అప్పుడే అరవిచ్చిన గులాబీరెమ్మలా ఉంది. మంచులో తడిసి హిమబిందువులు రాలుస్తూ రేకులు విచ్చుకోబోతున్న మల్లెమొగ్గలా ఉంది. కడిగిన మంచి ముత్యంలా ఉంది. ఎర్రగా, ఒద్దికగా గుమ్మడి పండులాఉంది. స్నిగ్ధమోహ నంగా, ఛాయా మనోహరంగా, కరిగించిపోత పోసిన బంగారు దిమ్మలా ఉంది ఆ చిన్నది! సొగసుగా, సన్నజాజులు ఏర్చికూర్చి గుచ్చిన చెండులా గుభాళిస్తున్నది. చూపులు అమాయ కంగా, హృదయం అమృతంగా ఆ సుందరి అంతఎత్తూకాక, అంతపొట్టీకాక, అంతలావూ కాక, అంత సన్నంకాక నిలబెట్టిన గాలిగుమ్మ టంలా ఉంది.

"ఎలా చూసుకుంటావో మరి?" తమ్ముడు అనుమానం, అభిమానం కలగలిపి అన్నాడు.

"బావుందిరా... నువ్వు వేరే చెప్పాలా! బంగారాన్ని బంగారంలా చూసుకోనూ, ఇత్త డిలా చూసుకుంటానా ఎక్కడైనా?"

కిసుక్కుమన్నాయి చుట్టూఉన్న కొన్ని గొంతులు. వాటివైపు చూసిందా పిల్లబితుకు బితుగ్గా. అక్కడ కొన్ని ఎముకలగూళ్ళు చీర లుకట్టుకుని గుమ్మానికొకటి చొప్పున నిల్చు న్నాయి.. కళ్ళు లోతుగా గుంటలుపడిపోయి ఉన్నాయి. బుగ్గలు కొరికి కొరికి ఉన్నాయి. అవయవాలు పీకి పీకి సాగదీసినట్లున్నాయి. దవడలు ఎముకలకు అతుక్కుపోతున్నాయి.

కారాకిల్లితోగారపట్టిన పళ్లు, సిగరెట్లుకాల్చి కాల్చి వేడెక్కి నల్లబడ్డ పెదాలు. చౌకరకాల సబ్బూ పౌడర్లతో తరిగిపోయిన ముఖవర్చస్సు. సరియైన పోషణలేక పాలిపోతున్న శరీరాలు. కంటినిండా నిద్రలేక తూలిపోతున్న ఒళ్ళు. అయినా ఒకప్పుడు వారూ అందగత్తెలే అన్న భావం లీలామాత్రంగా కలుగుతుంది.

పండకుండా ఎండిపోయి వాడిపోయిన పూబోడులు వారు. జాతి అజ్ఞానానికి బలైపో యిన కన్నె గులాబీలు, మోసపోయిన చెల్లెళ్ళు, దగాపడిన ఆడకూతుళ్ళు, వెలిసిపోయిన గిల్టు నగలు, వన్నె తరిగిన బంగారుగనులు... యజ మానులకు, బ్రోకర్లకు మాత్రం నిధినిక్షేపాలు!

వారినలా బతికున్న శవాల్లా చూసేసరికి ఈ చిన్నది జడుసుకున్నది. వారి మధ్య తానూ ఇమడాల్సివస్తుందేమోనన్న ఊహ లిప్తమాత్రం కలగడంతో ఒళ్లు జలదరించింది. అరక్ష ణంపాటు గుండె ఆగినట్టయింది. భయంతో ను, భీతితోను వెన్నెముక కంపించింది. ఆ పల్లెటూరి చిన్నది ఇదొక అపశకునంగాతోచి కీడును శంకించింది. నిలువెల్లా ఒణికింది. ముఖం చెమటలు పట్టాయి. కాళ్లకింద భూమి కదుల్తున్నట్టు, దొలుచుకుని గొయ్యి అవుతున్న ట్టు అనిపించింది.

"ఈ సంసారాన్నంతా నేను కాబట్టి భరిస్తు న్నాను. తెచ్చుకున్న తర్వాత మోయక తప్పు తుందా?" అక్క ఒకసారి వెటకారంగా చీద రించుకుంది. మళ్లీ వీరివైపు తిరిగి- "ఆ లెట్రిన్ పక్క గదిలో సామాన్లు ఖాళీచేయించా ను. పక్కసర్దించాను. వెళ్లి పడుకోండి" అని ఆదేశాలు జారీచేసి వెళ్లిపోయింది.

కొన్ని మురికిగదుల ఆవలనున్న లెట్రిన్స పక్క సామాన్ల గదిఇప్పుడు కొద్దిగా సంస్కరించ బడి ఉంది. స్వర్గద్వారాలు తెరుచుకుని ఇంద్ర భవనంలోకి అడుగుపెట్టినట్టు నవదంపతులు ఆ గదిలోకి ప్రవేశించారు. అందులో ఓ కుక్కి మంచం. దానిమీద పీచు పరుపు. దానిమీద ఉతికి ఇస్త్రీ చెయ్యని దుప్పటి. మాసికలు కట్టిన రెండు దిళ్ళు ఉన్నాయి. ఆ పక్కమీద వాడినమల్లెలు చెదురుమదురుగా పడిఉ న్నాయి.

మంచానికి దగ్గరగా గోడకు చేర్చి ఒక కాలువిరిగిన స్టూలుఉంది.

"ఇదే మనగది" అన్నాడతను.

'ఇదే మన స్వర్గం అనుంటే బాగుండేది' అనుకుందా పిల్ల.

''పాలు'' అన్నాడు గ్లాసు చేతికి అందిస్తూ.

'కాదు-అమృతం' అనుకుంది ఆ కుర్రది సిగ్గుపడుతూ.

సాయంత్రం నాలుగు గంటలయింది. ఇద్దరు స్నేహితులు రివ్వున దూసుకుంటూ ఆగదిలోకి చొరబడ్డారు.

'ఛీఛీ... ఇదేంపాడు' అనుకుంది పిల్లది. 'ఇది తామిద్దరికి మాత్రమే కేటాయించబడిన స్వర్గం. ఇందులో అన్యులకు తావుండరాదు. అనుకుంది.

సరాసరి వాళ్లిద్దరూ రావడంతోనే మంచంమీద బైఠాయించారు.

'ఛీఛీ! ఇదేం వరస, ఈశయ్యావాసం మాకు మాత్రమే సొంతమైన హంసతూలికాతల్పం. దీనిమీద అన్యులు కూర్చుండరాదు. శయనించరాదుకదూ' అనీ అనుకుంది.

ఒక ట్రేలో నాలుగు గ్లాసుల్లో టీ తీసుకొచ్చింది అక్క. ''పిల్లా... వాళ్లు నీమొగుడి స్నేహితులు. నీ చేతిమీదుగా వారికి టీ అందించు. సంతోషిస్తారు'' అంటూ ట్రే ఆ పిల్లచేతిలోపెట్టింది.

''వీరు నా బాల్యస్నేహితులు. ఒక మంచంమీద పడుకుని ఒక కంచంలో తినలేదుగాని అంతటి స్నేహితులే! అనేక పనులకారణంగా నా పెళ్లికి రాలేకపోయారు. ఇప్పుడు నిన్ను చూడ్డానికీ, అభినందించడానికీ స్వయంగా వచ్చారు. వీరివురూ నాకేకాదు, నీక్కూడా 'క్లోజ్' కావల్సినవారు. వీరి అవసరం నీకుముందు ముందు తెలుస్తుంది'' అంటూ వారిద్దర్నీ పరిచయంచేశాడు 'అతను'.

కాని వాళ్లిద్దరూ ఆమెకు మంచిస్నేహితుల్లా అనిపించలేదు సరిగదా కల్తీలేని కేటుగాళ్లలా, మచ్చలేని వుండాకోరుల్లా, నిఖార్సయిన గూండాల్లా అగుపించారు.

''కంగ్రాట్యులేషన్స్ బాభీ'' అన్నాడొకడు.

''అభినందనలు వదినగారూ'' అన్నాడు మరొకడు.

ఇద్దరూ ఆమెకు షేక్‌హేండ్ ఇవ్వబోయారు. కాని ఆమె నమస్కరించి వదిలించుకుంది.

ముగ్గురికీ మూడు గ్లాసులూ అందించి, తన గ్లాసు పట్టుకుని బయటికొచ్చింది.

ఇంతలో అక్కగారు మళ్ళీ వచ్చారు. ''ఒరే తమ్ముడూ, పిల్లదాన్ని తీసుకెళ్ళి వూరంతా చూపించు, తర్వాత సినిమాకు తీసుకువెళ్లు. ఆఖర్ని హొటల్లో భోంచేసిరండి. మీరొచ్చేసరికి ఇక్కడ ఏర్పాట్లన్నీ చేసి వుంచుతాను'' అంటూ వందరూపాయల నోటొకటి తీసిఇచ్చింది.

''అంతెందుకు... ఎక్కువ'' అన్నాడు తమ్ముడు నసుగుతూ.

''చాల్లే చెప్పొచ్చావు. ఇంద మరొక వందుంచు. కాపురానికొచ్చిన పిల్ల కదా. అందునా మొదటిరాత్రి. పిల్లదానికేవో కోరికలుంటాయి. అవి నీకు చెప్పుకోలేకపోవచ్చు. ఏవైనాకొనిపెట్టు- పీను చెయ్యకు'' అని ఇంకో వందఇచ్చింది.

''పిల్లా... నువ్వు మొహమాటపడిపోకు. వాడికి చెప్పుకోలేనివి ఏమైనావుంటే నువ్వు వేరుగా కొనుక్కో. వారు ఏమనుకుంటారో అని సంశయించకు'' అంటూ పిల్లచేతిలో ఒక వంద కాగితం మడతలు చుట్టింది వుంచి వేళ్ళు మడిచేసింది.

★ ★ ★

నలుగురూ ఝుమ్మంటూ రెండాటోలు పట్టుకుని ప్రయాణమయ్యారు నగర సందర్శనకు.

ఆ నగరం ఆమెకు అద్భుతంగా అనిపించింది. ఎంత పెద్దరోడ్లు, ఎంత ఎత్తయిన భవనాలు! కొన్ని లక్షల దీపాలు తోరణాల్లా పేర్చినట్టుందామె కంటికి. పల్లెటూళ్లో అయితే సాయంకాలమయేసరికి తెలిసిపోతుంది. కాని ఇప్పుడు రాత్రయినా చీకట్లు కమ్మడంలేదు. పట్టపగల్లాగే వెలుగులు కళ్ళుచెదరగొడుతున్నాయి.

ఆమెకు సముద్రం చూస్తూనే మతిపోయింది. తమ వూరు తుఫానుతో నిండిపోయి, వూరంతా జలమయమై, అందరూ ఇల్లెక్కి కూర్చుని జాగరం చేసినప్పుడు కూడా ఆమె ఇంత నీరు చూడలేదు. పైగా ఈ కెరటాలు ఆమెకు ముచ్చట గొలుపుతున్నాయి. అసలలాంటి కెరటాలుంటాయని ఆమెకు తెలియదు. అవేవో ఆమెకు కేరింతలు కొడుతున్న

చిన్నపిల్లల్లా అనిపించింది. అల్లంత దూరాన మినుకుమినుకుమంటూ మెరిసి దగ్గరౌతున్న ఓడల్ని చూసేసరికి ఆమెకు మూర్ఛవచ్చినంత పనయింది. వర్షంనీటిలో కాగితం పడవలు చేసి వదిలి అవి కదుల్తూ కొట్టుకుపోతుంటే చూసి అమాయకంగా నవ్వడం తెలుసు! కాని ఇవి? ఇవి పడవలా, కాదు, కాంతుల్ని చిమ్ముకుంటూ నీటిలో తేలి వస్తున్న మేరు పర్వతాల్లా ఆమెకు అనిపించింది. తను కలగంటున్నదో, తెలివితోనే వున్నదో తెలుసుకోడానికి చాలాసేపు పట్టింది.

వాళ్ళు తిన్నగా అక్కడి నుంచి సినిమా థియేటర్ దగ్గర కొచ్చారు. ఆ థియేటర్ చూస్తూనే ఆమె కొయ్యబారిపోయింది. ఆమెకు తెలిసింది తమ చుట్టు పక్కల వూర్లన్నిటికీ కలిపి సంత మొదట్లో వున్న డబ్బారేకుల టూరింగు షెడ్డు మాత్రమే. దానితో పోలిస్తే ఇది సినిమాహాలు కాదు. ఇంద్రభవనమే. వెన్నెల్ని కుమ్మరిస్తూ కిక్కిరిసిజనసమ్మర్దంతో కిటకిటలాడుతోంది.

లోపల తెర చూస్తూనే ఆమె మ్రాన్పడిపోయింది. అదేవిటో చెప్పినా అర్థం చేసుకోలేకపోయింది. వాళ్ళు చెప్పిందిది. అది వెల్వెట్ కర్టెన్. అది మెల్లమెల్లగా కొత్త పెళ్ళికూతురులా సిగ్గులొలకబోస్తూ లేవగా ఆ వెనుక దర్శనమిచ్చేది జర్మన్ సిల్వర్ స్క్రీన్. దాన్ని విదేశాల నుంచి తెప్పించారు. మిగిలిన సినిమాహాలుల్లా కాక ఈ హాలులో 'సిక్స్‌ట్రాక్ ఉంది. అంటే హాలు నాలుగు మూలలనుంచీ, వక్కగోడల నుంచీ సౌండు వినిపిస్తుంది.

ఆమెకు మతిపోయింది. తమ వూరి టూరింగు టాకీసు అతుకుబొతుకుల తెరకన్నా ఇది నాలుగు రెట్లు పెద్దది. తెరంతా బొమ్మే. పైగా రంగుల్లి. తను వూరి హాలులో చూసినట్టు కాక గుర్రాలు మీద పడిపోతున్నట్టూ పులులూ, సింహాలు మన మీదికి లంఘించినట్టుంటాయి. మనుషులు మనతో మాట్లాడుతున్నట్టే వుంటారు.

ఆ సినిమా ఆమెకు ఆశ్చర్యం గొలుపుతూ అంతుపట్టకుండా వుంది. అసలిదేం సినిమా? వారేం మనుషులు! ఆ పరుగులేమిటి? ఆ కొట్లాటలెందుకు? సినిమా నడుస్తున్నట్టులేదు. ఎగురుతున్నట్టుంది. పరుగెడుతున్నట్టుంది. వీళ్ళేం ఆడాళ్ళు? అంత పచ్చిగా. నడిరోడ్డు మీద ఆ ముద్దులేమిటి? రహస్యంగా మూడో కంటికి తెలీకుండా జరగాల్సిన శృంగారకాండ మరీ ఇంతగా బరితెగించి విచ్చలవిడిగానా! ఛీఛీ, పాడు. తప్పుకదూ- అనుకుంది. అలాంటివెప్పుడూ చెప్పగా కూడా వినలేదా చిన్నది.

అక్కడనుండి మళ్ళీ రెండాటోల మీద ఝామ్మంటూ ఒక హోటల్‌కొచ్చారు. ఆటో తిన్నగా లోపలికి వెళ్ళిపోయింది. వీరు దిగి ఛార్జీ చెల్లించడంతో వెనక్కి తిరిగిపోయింది.

పాలరాతి మెట్లు ఇరువైపులా పూలకుండీల్లాంటి వెడల్పాటి గోడలు, ఎత్తయిన చలువ రాతి స్థంభాలతో విశాలమైన వరండా. అక్కడ నిలువెత్తు అద్దాలు.

వీరు ఆటో దిగడంతోనే గ్లాస్‌డోర్స్ తెరుచుకున్నాయి. వీరెవరైనా లోపలికి అడుగుపెడితే తమ దేవుళ్ళే అయినట్టు వంగి సలాములు చేస్తున్న డోర్‌కీపర్స్. ఆ హాలు వైభవం గురించి చెప్పేదేముంది. అదో ఇంద్రదర్బారును తలపింపచేస్తున్నది.

గ్లాస్‌డోర్ దాటి, రిసెప్షన్‌హాలు దాటి మరికొంత ముందుకు వెడితే అక్కడ 'బార్' వుంది. ఖరీదైన సూట్లు, రంగురంగుల చీరలు అక్కడ రెపరెపలాడుతున్నాయి. గాజుల గలగలలు, నవ్వులకిలకిలలు...

మౌనంగా కూర్చుని కొందరు, కబుర్లు కొడుతూ, కొందరు. అందరి చేతుల్లోనూ మందు నింపుకున్న గ్లాసులు, తెల్లని గ్లాసులో ఎర్రని ద్రవం. ఒక్కొక్క చుక్కే నోట్లోకి వెళుతుంటే. ఒక్కొక్క మెట్టూ ఎక్కుతున్న ఉద్రేకం, ఉత్సాహం. ఒక్కొక్క గ్లాసూ రక్తం మరిగించి మందుగా మార్చినట్టుగా వుంది.

అక్కడన్నీ అరమోడ్పుకన్నుల్లాంటి డిమ్ము లైట్లు! ఆ మసకవెలుగులో ఒక స్పాట్‌లైటు. ఆలైటు వెలుగుధారల్లో కాంతిస్నానం చేస్తూ అందాల్ని అలల్ని అలలుగా కదిలిస్తూ ఒక కేబరే శిల్పం. అది ప్రాణంపోసుకున్నపుత్తడిబొమ్మ అంగాంగప్రదర్శన. ఒంపుసొంపులు. వొయ్యారం రసికస్వప్నం ఆవిష్కరిస్తుంటే మత్తిల్లుతున్న ఖరీదైన ప్రపంచం అది.

కొంచెం ఎత్తులో వేదిక. దానిమీద వెస్టరన్



స్టయిల్లో ఒక వాయిద్యబృందం. జాజ్, గిటార్, డ్రమ్స్. ఆధునిక వాయిద్యవిశృంఖలత. వారి దరువులమోతలో ఉద్రిక్తం చెందుతూ మరింత రెచ్చగొడుతున్న నాట్యసోయగం. ఆఖర్ని శరీరప్రదర్శన తర్వాత క్షణంసేపు చీకటి. అప్పుడు కుండపోతగా కాంతివర్షం. తర్వాత చూస్తే అక్కడేముంది- దిగిపోయినమత్తు.

ఆనందంగా తన్మయత్వంతో ఆ పరిసరాలు చూస్తూవుంటే ఈలోకంలో చాలా దరిద్రం వుందనీ, చాలామందికి కాలుచాపుకునేందుకు చాలినంతచోటు లేదనీ, కనీసం కన్నెపిల్లలు అవయవాలమీదకైనా కప్పుకునేందు సరిపడా గుడ్డలేదనీ, పదిమంది పంచుకునేందుకు ఒక చిన్నపిల్ల తినగలిగినంత తిండైనా లేక నకనకలాడుతున్నారనీ కాసేపైనా మరిచిపోతాం. కష్టాలు అన్నీ తాత్కాలికంగానైనా మరిచిపోతాం. ఆవెలుగులో అసలు చీకటి అంటూ ఒకటి వుందని గుర్తించలేం.

ఆ వాతావరణం ఆమెను ఉక్కిరిబిక్కిరి చేసింది. అది తనవూరులానూకాక, ఇప్పటివరకూ తిరిగిన నగరంలానూ కాక ఇంకేదో లోకంలోభాగంలా వుందనిపించింది. అక్కడున్న మగవారు, కాలిపొగలెక్కుతున్న నిప్పుకణికల్లా ఎర్రగామండుతున్నట్టు వున్నారు. కోరలుతీసేసిన పిల్లసైజు రాక్షసులు వేషంమార్చినట్టున్నారు. స్త్రీలు గులాబీ రెమ్మల్లా మృదువుగా, సంపంగికాడల్లా మనోహరంగా వున్నారు.

అక్కడచివరగా ఒకమూల దూరంగా వేసివున్న టేబుల్ దగ్గరకువెళ్లారు వీరు. పరుపుకుర్చీలమీద సుఖంగా కూర్చుని హాయిగా వూపిరిపీల్చుకున్నారు.

వీరు అలా కూర్చున్న పదినిమిషాలకు బేరర్ వచ్చి, మెనూకార్డుచేతికిచ్చి, వినయంగా నిల్చున్నాడు. వాడియూనిఫారం, నెత్తిమీద టోపిచూసి ఈచిన్న సైజు స్వర్గానికి పార్టనరేమో అనుకుందామె. మెనూలోని ఇంగ్లీషు ఈ మగాళ్లు ముగ్గురికీ అర్థంకాక యధాప్రకారం దాన్ని టేబుల్మీద పడేసి, నాటుదనంవదలని స్టయిల్లో ఒక రమ్ము ఫుల్బాటిల్, ఒక థమ్సప్ ఆర్డరిచ్చారు. పదినిమిషాల తర్వాత ఒక బాటిల్రమ్ము బకెట్తో ఐస్క్యూబ్స్, నీట్గా, తళతళమెరుస్తున్న నాలుగు కాళీగ్లాసులూ, వాటితోపాటు ఒక థమ్సప్ వచ్చాయి.

వారికి 'రా' కొట్టడం అలవాటు. కాకపోతే కొద్దిగా నీరు వేసుకుంటారు. లేదా 'రా'పూర్తయాక ఆతర్వాత గుటకడంటెగుటకడు నీరు తాగి వూసేస్తారు. ఇప్పుడు దానికి బదులు ఐస్వాడుతున్నారు. ఇచ్చే డబ్బులు ఎలానూ ఇవ్వకతప్పనప్పుడు ఆపాటైనా రాబట్టడం వీరి లక్ష్యం.

అలవాటుగా వారు సేవించే అసలువదార్థం కల్తీలేని ఖచ్చితమైన ప్రభుత్వపుసారాయి. అయితే అక్క చలవవలన ప్రతిమొదటిరోజు రాత్రి- ఆమొదటిరాత్రి ఎవరిదైనప్పటికీ తమ-పరభేదంలేకుండా ఇలా స్టార్ హొటల్లో కూర్చుని క్లాస్గా గడపడం ఆనవాయితీగా చేసుకున్నారు.

థమ్సప్ ఆ వచ్చేది 'నూతనవధువు' కోసం తెప్పించడం వీరి సదాచారం. కాని ఆనూతన వధువుకు తెలిసిందల్లా తనవూర్లోని కిల్లీబడ్డీలో కలిపిచ్చే రంగునీళ్లు మాత్రమే. ఈ జరుగుతున్న యావత్తు తతంగాన్నీ అర్థంచేసుకోడానికి శతధా ప్రయత్నిస్తున్నదామె.

ఆమెకు రమ్ము ఒక లార్జి పెగ్గువేసి, మిగిలింది ముగ్గురూ పోసుకుని, గ్లాసుల్లోని వెల్తిభాగాన్ని ఐస్తో నింపుకున్నారు. వారికి కొంచెంకొంచెం తాగితే తాగినట్టుండదు. అందుకని ఐస్కరిగేవరకూ ఆగి ఒక్కసారి ఎత్తినగ్లాసు దించకుండా ఏకబిగిన పూర్తిచేసి ఆపిమ్మట గ్లాసులుదించారు. ఒక్కసారి వూపిరిపీల్చుకుని ఒళ్లువిదిలించి హాయ్ అని చేరబడ్డారు. 'ఛీర్స్' చెప్పుకునే అవకాశం, తీరికా వారికి బాటిల్ ముందుకూర్చున్నప్పుడు వుండదు, ఆ అవసరంకూడా వారికి కలగదు. ఆ సాంప్రదాయానికి వారు అతీతులు.

ఆమె లార్జిపెగ్గులో ఒకపెద్ద ఐస్ముక్క దించి థమ్సప్ పోసారు, వాళ్లు ఒక్కపాళంగా తాగగాలేనిది తాను కొంచెంకొంచెం చప్పరించలేనా అనుకుంది. అనుకున్నదేతడవుగా పెదాలకు గ్లాసు ఆనించి చప్పరించింది.

అంతే! ఒక్కసారిగా గొంతు భగ్గునమండింది. చెవులు, ముక్కునోటి నుండి భుగభుగమని ఆవిర్లు పరుగెత్తాయి. క్రమంగా నరాల్లో వేడిపుట్టింది. శరీరంలోని రక్తం మరుగుతు




న్నది. ఆపాదమస్తకం మత్తుతో సోలుతున్నది. కడుపులో వికారం మీదకివిగదన్నుతున్నది. కళ్లు మైకంతో మూతలుపడుతున్నవి. ఒళ్లుతేలిపోతున్నది. తాగినమందు కడుపులో ఇమడ్డంలేదు. బలవంతంగా వాంతితెచ్చుకుని కక్కేద్దామనుకుంది. కాని ఎదటిమనుషుల్ని అవమానించడం తెలీని ఆపల్లెపిల్ల సున్నితమైన మనసు అది మర్యాదకాదేమోనని బలవంతంగా నొక్కిపెట్టి గుటకేసి మింగేసింది.

ఈలోగా ఈమగరాయుళ్లు బిరియానీకి, తందూరిచికెన్‌కి ఇంకోథమ్సప్‌కి ఆర్డరిచ్చారు.

ఆసమయంలో పుల్లపుల్లగా, తియ్యతియ్యగా, వగరువగరుగా, కొద్దిపాటి ఘాటుగా, వెరసి అంతా చల్లగావున్న ఆమందు పదార్థాన్ని కొంచెంకొంచెంగా చప్పరిస్తూ ఆమె పరిసరాల్ని ఆసక్తిగా పరిశీలించసాగింది.

దూరాన్న నియాన్‌లైట్లు మసకబారిన వెన్నెల్లా, పల్చగా వెలుగుతున్నాయి. మీదినుంచి చల్లగాలి శోభనంగదిలోకి వెళ్తున్న కొత్తపెళ్లికూతురులా సిగ్గులొలుకుతూ జారుతోంది.గ్లాసుల గలగల వింత సంగీతం ఆలపిస్తోంది. పదుతూ లేస్తున్న మనుషులు వెళ్తూ వస్తూ విచిత్రమైన సందడి చేస్తున్నారు.

ఎదురుగా నీలి సముద్రం.

సముద్రంమీద పెద్దపెద్ద పడవలు కదుల్తున్న కాంతిపర్వతాల్లా ఉన్నాయి. అంతసందడిగల నగరమూ రాత్రప్పుడు ఈ నల్లని చీకటిలో ముస్తాబయిన అడవిలా వుందేతప్ప కళకళలాడుతున్న పెళ్లిపందిట్లాలేదు.

తను చూస్తున్న ఈ దృశ్యాలు నిజమే అయినా కలలోని రంగుల బొమ్మల్లా, వూహల్లో కదిలే చిత్రాలుగా అనిపిస్తున్నాయే తప్ప భూమిమీది యదార్థ, జగత్తుగా అనుకోలేకపోతున్నది. ఇది వాస్తవ ప్రపంచమే, మామూలు మనుషుల సమ్మేళనమే అనే నమ్మకం కుదరలేకపోతున్నది.

ఈలోగా ప్లేట్లలో వంటకాలు వచ్చి టేబుల్‌కు నిండుదనం కల్పించాయి. మొదటి రౌండు గల్ఫ్‌క్రింద లాంగించడంతో ఈ రౌండు భోజనం చేస్తూ మధ్యమధ్య తీసుకుంటున్నారు మిత్రులు ముగ్గురూ. ఆమె ఆ వంటకాలు చూసి ముచ్చటపడింది. బహుశా దేవతలు చేయాల్సిన భోజనం కాబోలు అందుకే ఇంత పసందుగా వుంది అనుకుంది.

రెండోరౌండుకూడా ముగ్గురూ సమానంగా పంచుకున్నారు. ఆమెకు ఓ లార్జిపెగ్గు గ్లాసులోకి వంపి థమ్సప్ వేసారు. కాని ఈసారి ఆమె అభ్యంతరంపెట్టింది. అప్పుడు కథానాయకుడు చిలిపిగా కళ్లు గిలుకుతూ, మెటికలు తమాషాగా విరుస్తూ, ఆమె రెండు భుజాల మీదా రెండు చేతులూవేసి, దగ్గరకు లాక్కుని చెవిలో రహస్యం చెప్పినట్టు అన్నాడు కదా—"ఈరోజు మన మొదటిరోజని మరిచిపోయావా? కొంచెం వెచ్చగా వుండాలికదా, పైగా జాగారం చెయ్యొద్దూ" అన్నాడు. ఆ చెప్పడంలో బుజ్జగింపువుంది. లాలింపూవుంది.

పిల్లది మహా సిగ్గుపడిపోయింది. వారిద్దరూ విన్నారేమోనని మొహంకిందికి దించేసుకుంది. కాని ఆమె గుండెలో వింతకాంతి కెరటాలు లేచాయి. ఎవరో పాదివి పట్టుకుసి కితకితలు పెట్టినట్టయింది.

మొదటిరౌండుకి ఆమెలో మత్తుమబ్బు కమ్ముతున్నది. చిన్నమైకం పారవేస్తున్నది. లీలగా కరిగిపోయిన గతం తెరలుతెరలుగా ఆమె మనసులో కదులుతున్నది. జ్ఞాపకాల చిత్రాలు ఆవిష్కరిస్తున్నవి.

★ ★ ★

"నన్నింకా పోల్చుకోలేదా అవ్వా? నేను జ్ఞాపకంలేనా? నేను నీ వేలువిడిచిన మేనమామ పెద్దకొడుక్కి చిన్నకొడుకుని. చిన్నప్పుడు పారిపోయాను. మీరేమో తప్పిపోయాడనుకున్నారు. తర్వాత ప్రతి సంవత్సరం అమ్మోరి పండక్కి ఇక్కడి కొస్తుండేవాడిని. అప్పుడు తాతయ్య బతికేవున్నాడు. కోడిపందాలు, గొర్రెపందాలు అంటే తాతయ్యకు ఎంతో ఇష్టం. ఒక సంవత్సరం పండగలో పందాలు మాంచి వుషారులో వుండగా, పోలీసులు చాలా హడావిడిచేస్తూ అట్టహాసంగా వచ్చారు. అప్పుడు తాతయ్య ఆరడుగుల గోడదూకి కాలువిరగ్గొట్టుకున్నాడు. కుయ్యోమొర్రోమని కుంటుతూ వచ్చి ఆ మూల ముసుగేసాడు. అప్పుడు నాకెంత నవ్వొచ్చిందో" అంటూ భుజాలెగరేసి 'హిహిహి' అని పళ్లికిలించాడు.

ఆ ముసలిదానికి ఇవన్నీ లీలగా గుర్తొస్తున్నవి. కాని అప్పుడు వీడు సన్నగా, నల్లగా



వుండేవాడు. ఇప్పుడింత ఎర్రగా, లావుగా ఎలాగయ్యాడో? ఏమో! పట్నంనీరు వొంటికి పడింది కాబోలు అని సరిపెట్టుకుంది.

"అప్పుడు నువ్వు నన్ను అడ్డాల్లో కూర్చోపెట్టుకుని చప్పటిగారెలు మాంసం పులుసులో ముంచి తినిపిస్తుండేదానివి. అప్పుడు నేను ఇదిగో ఈ గుంటని, బలే గుంటాయిలారాయే, నీపేరేమిటి? ఏదోలే, మరిచిపోయాను. దీన్ని భుజాలమీదెక్కించుకుని జాతరంతా తిప్పేవాణ్ని. ఒక సంవత్సరం పండగరోజు రాత్రి మేమిద్దరం రాకపోయేనరికి మీరు వూరువూరంతా గాలించేశారు. తప్పిపోయామనుకుని ఎంతో గాభరాపడిపోయారు. నిద్రపోతున్న దీన్ని భుజంమీదేసుకుని తిరిగొచ్చేవరకూ మీ కంటిమీద కునుకే పడలేదు. అప్పుడు దీనమ్మ, అప్పటికింకా దీనమ్మ బతికేవుందిలే. దీన్నెత్తుకొని ముద్దుమీద ముద్దు, ముద్దుమీద ముద్దు అలా ఎన్నో ముద్దులు ఒంటినిండా పెట్టేసరికి ఎంత ఏడ్చేసిందో, అప్పుడు అందరికీ నామీద ఎంత కోపం వచ్చేసిందో, అప్పుడు నిజంగా నాకు భయమేసింది. ఎంత భయపడిపోయానో, నాకు నిజంగా ఏడుపుకూడా వచ్చేసింది. నేను ఏడుస్తుంటే అంతవరకూ గసిరిన వాళ్లందరూ నన్నుకూడా బుజ్జగించడం మొదలెట్టారు. అలా ఆ రాత్రి పండగ బదులు ఏడుస్తూ గడిచిపోయింది. అప్పుడిది పొట్టిగా, పీలగా గుంటరోగాల్తో వుండేది. ఇప్పుడిది కొంచెం ఒళ్లుచేసి పూటెక్కింది. తీరొచ్చి చూడ్డానికి మనిషి నదురుగా కన్పిస్తోంది" అన్నాడు.

మామ్మకి కొంచెం కొంచెం దాఖలాలు కన్పిస్తున్నట్టే అనిపిస్తోంది. వాడి మాటల్లో అక్కడక్కడా నిజం బయటపడుతున్నట్టే వుంది. ఎందుకోగాని వీడి మాటలు నమ్మాలనిపిస్తోంది.

"ఏట్రో్రా మనవడా, దీన్నించేర్రా నా బెంగంతా. దీన్ని నేలమీదపడేసి వొక్కకూతురూ ముండమోసేసింది. మారు మనువులు మనజాతిలో వున్నాయే అంటె ససేమిరా ఇన్లేదు. అడంటె ఎందుకో దీనికంత ఇది. వల్లమాలిన ప్రేమ. అడు ముట్టుకున్న ఒళ్లును ఇంకోడు తాకడానికు ఈల్లేదంది. మరొకడితో మనువాడ్డానికి కాకనేకాదు పొమ్మంది. ఆ తర్వాత ఏడాది తిరక్కుండానే ఆణ్నెతుక్కుంటూ నా కూతురు దిక్కుమాల్నిపచ్చిలా ఎల్లిపోయింది. దీన్ని నా కప్పగించేసింది. దీన్ని నాచేతుల్లో పెట్టి ఇకనుంచి ఇదే నీ కూతురు అనుకో అంది. అప్పటినుంచీ దీని ఆశ చూసుకునే బతుకుతున్నా్రా మనవడా. దీనికెప్పుడు పెళ్లవుతుందో, ఎప్పుడు ఓ ఇంటిది అవుతుందో, నేను నచ్చేలోగా దీనిపెళ్లి నా కళ్ల చూస్తానో లేదో– అదే నా దిగులంతా" అంటూ చెప్పుకుపోయింది. ముసిల్దాని గొంతులో ఆవేదన వుంది. అలా మాట్లాడుతున్నప్పుడు ఆ గొంతు బొంగురుపోయింది. ఎన్నో అనుభవాల్ని చూసి పండిపోయిన ఆ కళ్లు తడితో క్షణంసేపు మసకబారాయి. ముడతల ముఖం వేదనాభరితమయ్యింది.

"ఏఁవే గుంటా, నన్ను కట్టుకుంటావేటే, నిన్ను పువ్వుల్లో పెట్టి ఏలుకుంటాను. ఛ వుత్తినే అన్నాన్లేయే, భయపడిపోకు. అయినా నాకేం ఖర్మ, టౌన్లో ఎవర్తిని కట్టుకున్నా పదివేలిస్తారు కట్నం నాకు" అన్నాడు.

ముసిల్దానికి చిరాకేసింది. రవ్వంత రోషంకూడా కలిగింది. "ఆ ముక్కనకురా నావొల్లు నచ్చిపోద్ది. ఈ కొంపదాన్దే. ఆ అరెకరం మడి సెక్కదాన్దే. అది కాకపోతే నాకింకెవరున్నార్రా? అయినా పట్నంలో నీకేంపన్రా?" ఇంకా ముసిల్దానికి ఎక్కడో చిన్న అర మిగిలిపోయింది. చాన్నాళ్లనుంచీ రాకపోకలు లేవాయె మరి. అందుకే ఇక ఆపుకోలేక అడిగేసింది.

వాడేంతక్కువ తిన్నాడా! "టౌనంటే టౌనే అవ్వా రెండు కళ్లూ పట్టవు దాన్ని చూడ్డానికి. అక్కడో క్లాస్ వన్ కంట్రాక్టరున్నాడు. పోర్టులోను, షిప్‌యార్డ్‌లోను, బేసిన్‌లోను, కార్పొరేషన్‌లోను- ఒకటేమిటి ఆఖరికి సివిల్ కంట్రాక్టుల్లో కూడా అతనికి మించిన చెయ్యిలేదు. పెద్దపెద్ద ఆఫీసర్లు అతని బంగ్లా దగ్గరకి ఆల్లంతటఆల్లే వస్తారు. ప్రతిరోజు ఎక్కడో ఒకదగ్గర ఏదో ఒకపార్టీ. వచ్చీపోయే కార్లతో ఆ బంగ్లా అదో తిరునాళ్లలా వుంటదనుకో రోజుకు కొన్ని వేలు ఖర్చు. ఎక్కడెక్కడ ఎంతెంతమంది పనిచేస్తున్నారో, ఆళ్ల జీతాలేమిటో ఆ మానేజర్లకి తప్ప అతనికి తెల్నే తెల్దు.

"కొన్ని వందల లారీలు. కొన్ని పదుల క్రేన్లు. ప్రతి ఇంజనీరుకూ ఒక జీపు, ఆఫీసు




# ఆ కళ్లలో తళుకు కలకాలం ఉండాలి

# మార్గదర్శి

ఆ పాప అపార సంతోషం సంతృప్తి గురించే ఇప్పుడూ ఎప్పుడూ మీ ఆరాటం ! ఆమె కన్నుల్లో ఆ సంతోషపు వెలుగులు కలకాలం వర్ధిల్లడానికి ఈ రోజే మార్గదర్శిలో చేరండి.

మీ డబ్బుకు సురక్షిత దుర్గం మార్గదర్శి. ఎన్నో ఏళ్ళుగా తన ఎనలేని సేవలతో వేనవేల సభ్యులలో కలిగించిన అనంతమైన సంతృప్తి, అచంచల విశ్వాసం మార్గదర్శి నిజాయితీకి నిబద్ధతకు నిదర్శనం. ఆర్థిక పాటవంగల సభ్యుల్ని చేర్చుకోవటంలో మార్గదర్శి చూపే శ్రద్ధ సభ్యుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. సభ్యులందరి అభ్యుదయానికే ఈ అవిరళ కృషి.

ఈ అనన్య ప్రతిష్ఠ ఆర్జించడానికి మార్గదర్శి ఇరవైనాలుగు సంవత్సరాలు పరిశ్రమించి ఈనాడు యావద్దేశంలో అగ్రగామి చిట్‌ఫండ్ సంస్థగా పురోగమిస్తున్నది. అంచెలంచెలుగా ఎదుగుతూ మార్గదర్శి వార్షిక వ్యాపారం ఇప్పుడు రు.60 కోట్లు దాటింది. మీ వివిధ అవసరాలకు అనుగుణంగా రకరకాల మొత్తాలలో ఎన్నెన్నో చిట్‌లు మార్గదర్శి మీ కోసం సిద్ధం చేసింది.

ప్రస్తుత పథకం

| చందా | నెలలు | మొత్తం | సభ్యులు |
|---|---|---|---|
| 400 | 25 | 10,000 | 25 |
| 1000 | 25 | 25,000 | 25 |
| 2000 | 25 | 50,000 | 25 |
| 200 | 50 | 10,000 | 50 |
| 400 | 50 | 20,000 | 50 |
| 500 | 50 | 25,000 | 50 |
| 1000 | 50 | 50,000 | 50 |
| 2000 | 50 | 1,00,000 | 50 |
| 4000 | 50 | 2,00,000 | 50 |
| 8000 | 50 | 4,00,000 | 50 |

బ్రాంచీలు :

- బషీర్‌బాగ్, హైదరాబాద్.
- లకిడికాపూల్. హైదరాబాద్.
- చిక్కడపల్లి, హైదరాబాద్.
- అమీర్‌పేట్, హైదరాబాద్.
- ఎమ్.జి.రోడ్. సికింద్రాబాద్.
- ఎ.ఎమ్.సి.కాంప్లెక్స్, విజయవాడ.
- బందర్‌రోడ్. లబ్బీపేట్. విజయవాడ.
- జగదాంబ జంక్షన్. విశాఖపట్నం.
- స్టేషన్‌రోడ్. గుంటూరు.
- జె.పి.యన్‌రోడ్, వరంగల్.
- టి.నగర్ రాజమండ్రి.
- సుభాష్‌రోడ్. కాకినాడ.
- నెహ్రూ రోడ్. కర్నూలు.
- వైరారోడ్. ఖమ్మం.
- నరసింహారావుపేట. ఏలూరు.

డబ్బుకోసమేనా మీ చింత ! మార్గదర్శి ఉన్నది మీ చెంత !!



## మార్గదర్శి చిట్‌ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్

రిజిష్టర్డ్ మరియు సెంట్రల్ ఆఫీసు :
ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

Kiron-MCF-86-3

గుమాస్తాలకు ప్రైవేటుగా ఒక బస్సు, కూలీలకు లారీలు- ఇలా అక్కడ నిత్య సంక్రాంతి పండగ అనుకో. అదిగో ఆ కంట్రాక్టరు దగ్గర నేను కూలీ మేస్త్రీని. అంటె గుమాస్తాకన్నా కొంచెం పెద్దనుకో. ఆ బాబు గుమాస్తాలతో నరానరి మాట్లాడ్డు. మేనేజర్లతో చెప్పి చేయిస్తుంటాడు. కాని కూలీల దగ్గరకొచ్చేనరికి నన్ను పిలిచి సంప్రదిస్తారు. అప్పుడప్పుడు కూర్చోమని కూడా అంటుంటారు. ఒక్కోసారి చాలా దూరంగా అడవుల్లాంటి దగ్గర పని చేయాల్సి వచ్చినప్పుడు కొన్ని వందలమంది కూలీలకు టెంట్లు వేస్తారు. జనరేటరుపెట్టి మా కరెంటు మేమే తెచ్చుకుంటాం. ప్రభుత్వపు కరెంటులాగా మధ్యమధ్య ఆగిపోవడమనేది వుండదు. అప్పుడు ఆ కూలీలకు మేస్త్రీగా నేను అక్కడ నాకోసం వేసిన టెంటులో వుండిపోవాలి.

"పెద్ద పెద్ద మేడల్ని మేం సంవత్సరం తిరక్కుండానే లేపేస్తాం. ఇల్లు కట్టడం ఇక్కడలాకాదు. ఊచల్ని తీగల్తో చుట్టి, దాన్ని పునాదుల్నుంచి లేవుకొచ్చి, దానిచుట్టు పేకేజీ చెక్కల్తో పెట్టెల్లా చేసి, పక్కా సిమ్మెంటు, ఇనకా క్రషర్‌లో కలిపి, పెద్ద పెద్ద కాంక్రీటు స్తంభాల్ని ముందులేపి, వాటిమీద స్లాపులువేసి, అప్పుడు పదేసి పన్నెండేసి అంతస్తుల భవనాలు లేపుతాం. వేలకొద్దీ సిమెంటు బస్తాల గోడౌన్ తాళాలు నాదగ్గరే ఉంటాయి. టన్నుల కొద్దీ వుక్కు తీగలుగల స్టోరు తాళాలు నావద్దనే ఉంటాయి. వారానికి కొన్నివేలు. నెలకి కొన్ని లక్షల రూపాయలు బట్వాడా నా చేతులమీదుగానే జరుగుతుంది. వందల రూపాయలవి, యాభై రూపాయలవి, ఇరవై, పదీ, అయిదు రూపాయలవి- ఇవికాక రెండూ, ఒకటి, కట్టలు కట్టలు పెద్ద పెద్ద పెట్టెల్లో తిన్నగా బాంకు నుంచి తీసుకువచ్చి పేమెంట్లు చేస్తారు. ఆరోజు ఎటుచూసినా నోట్లే. ఎక్కడ చూసినా నోట్ల వర్షమే. ప్రతి శనివారం మాకు నోట్ల పండగే.

"నాకు జీతం నెలకి మూడొందలు. ఆపైన మరికొంత కమిషన్. ఎలా లేదన్నా నెలకి ఆరొందలదాకా గిట్టుబాటవుతుంది. ఎక్కడ పని జరిగితే అక్కడే ఒక కేంటీన్‌లాంటిది మా కంట్రాక్టర్‌గారు లేపిస్తారు. పనివాళ్లు తిళ్లుకన్జై




ప్పిపైకి షికార్లకు వెళ్లిపోకుండా అక్కడే ఉదయం టిఫిను, టీ; మధ్యాహ్నం రకరకాల కూరగాయల పచ్చళ్లతో మంచి భోజనం, సాయంత్రం టీ వర్కర్స్‌కి చాలా చవగ్గా సప్లయిచేస్తారు. బయట అయితే అంత నాణ్యంగా వుండవు పైగా ధర చాలా ప్రియం. దాదాపు, రెట్టింపు ఉంటుంది. అంత నదుపాయం అన్నమాట.

"ఇప్పుడు నాదర్జా టౌన్లో అలా వెలిగిపోతోంది. మా కంట్రాక్టరుగారికి నేను కుడిభుజం. నేను లేకపోతే ఆయనకి వర్కర్లు లేరు. ఆయనకి కూలీలు కావాలంటే ఆయన పక్కన నేనుండాలి. అక్కడ అదీ మన హోదా... అదీ మన లెవెలు" అంటూ ఆపి చుట్టూ చూసి, అందరూ తనవైపే వింతగా ఆశ్చర్యంగా చూస్తున్నారని గమనించి బింకంగా పోజుపెట్టి కాలరెగరేశాడు.

ముసిల్ది మహా ముచ్చట పడిపోయింది. తన మనవరాలికి ఈడు మొగుడుగా కుదిరి మనువాడితే మంచిదేకదా అనుకుంది. ఒక కూలీకో, ఒక బండిలాగినోడికో కట్టబెట్టే బదులు ఈడు నయమేకదా అనుకుంది 'మనవరాలు టౌన్లో రాణిలా బతుకుతుంది. నాజూకు నేరుస్తుంది. ఆపాటి అదృష్టం నా వంశంలో అటూ ఇటూ ఎవరికీ లేదుకదా, దీనికెందుకు కలక్కూడదు! దాని తలరాత ఎలా వుందో... ఏమో! ఎవరు చూడొచ్చారు. దీనికి పుట్టిన పిల్లలు టౌన్లో డాక్టర్లు, ఇంజినీర్లు అవుతారేమో! అలా ఎందుకు జరక్కూడదు. పుట్టినోళ్లు పుట్టినట్టు కూలీలుగానూ, బస్తాలెత్తినోళ్లుగానూ వుండిపోవాలని ఎక్కడైనా రాసుందా! అలా జరక్కుండా ఇలా జరగాలని ఒకవేళ ఆ దేవుడుగాని రాసేడేమో' అని వూహించుకుని తెగమురిసిపోయింది. అయితే పెళ్లికదా. మరి కొంచెం తెల్సుకోవాలనుకుంది ముసిల్ది. పెళ్లంటె నూరేళ్ల పంట. మళ్లీ మళ్లీ జరగదు కదా. ఒకసారి తప్పు చేస్తే ఆ తప్పుకు తగిన శిక్ష ఈ జీవితంలోనే అనుభవిస్తాం. మరోజన్మ వున్నా అందులో కాదు.

"ఇంతకీ మీ అమ్మా, మీనాన్నా ఎక్కడున్నారా! ఆళ్ళందర్నీ ఇక్కడికి రప్పించాలంటే ఎల్లా అవుద్ది-" అంది. అసలు విషయం రాబట్టడానికి.

ఇంకెక్కడి అమ్మా నాన్నా అవ్వా! వాళ్లకి

నేనొకణ్నే కొడుకునా. నేను పారిపోయే నన్ను బెంగతో వారు మంచం పట్టారు. నేను టౌన్లో స్థిరపడి నాకాళ్లమీద నేను బతకడం నేర్చుకున్నాక వీర్ని తీసుకెళ్దామని వచ్చాను. అప్పటికే వారు బాగా తీసుకుని తీసుకుని నీరసించి పోయారు. పల్లెటూరు బతుక్కాదు పట్నం బతుకు చూపిద్దామని ఎంత ఆశపడ్డానో అంత నిరాశపాలయ్యాను. అయినా వదలకుండా పట్నం తీసికెళ్లి పెద్ద పెద్ద డాక్టర్ల చేత మంచి మంచి మందులిప్పించాను. కాని ఫలితం లేకపోయింది. నా వైభవం కళ్లవేడుకగా చూడకుండానే వారు కళ్లు మూశారు. యిక బంధువులంటావా. అప్పుడు ఈ వూరు కరువు వాత పడింది కదా. అందరూ చెట్టుకో పుట్టగా చెదిరి పోయారు. మీరంటె మడిసెక్కలున్నాయి కాబట్టి నేలతల్లిని నమ్ముకుని వుండిపోయారు. యిప్పుడు ఈ కరువు రోజుల్లో ఎవరి కెవరు చెప్పు.ఎవర్ని వారు పోషించుకోడమే కష్టమై పోతుంటే యిక బంధువులని ఎక్కడుంటుంది. నేనంటే కడుపు తీపి చంపుకోలేక, బంధుప్రీతితో నీదగ్గరకు పరుగెత్తుకొచ్చాను కాని" అని కళ్లంట నీరు పెట్టుకున్నాడు.

ముసిల్ది కరిగిపోయింది. ఔను నిజమే ... అని సమాధానపర్చుకుంది. "ఊరుకోరా మనవడా కరువురోజుల్లో ఎవరికెవ రౌతారులే. పోనీ చిన్నప్పుడెలా తిరిగినా పెద్దయ్యాక కాస్త బుద్ధి తెచ్చుకున్నావ్. ప్రయోజకుడివనిపించుకున్నావ్. ఒకరిమీద ఆధారపడకుండా నీగంజి నువ్వు తాగుతున్నావ్. అక్కడికదే సంతోషం. మంచికో చెడ్డకో ఎందుకో నీనోరు జారిపోయింది. ఆమాట మీద నిలబడిపో. ఎలా జరగాల్సింది అలాగే జరుగుతుంది. ఎవరి రాతను ఎవరు తప్పించగలరు. పిల్ల నీకిష్టమైతే చూడు. మనవరాలి పెళ్లి జరిపించేస్తాను. ఇదిగో ముందే చెప్తున్నాను... పిల్ల బంగారం. చదువు తక్కువన్నమాటేగాని శ్రీమహాలక్ష్మి. కట్నం మాత్రం ఈ కొంపే. దీన్నేం చేసుకుంటావో నీయిష్టం. కట్నం లేదని పిల్ల మనసు కష్టపెట్టక, నేనేలోకంలో వున్నా అది కనిపెడుతుంటాను. ఇక ఆ మడి సెక్కంటావో- పాత అప్పులకిందా పెళ్లి ఖర్చులకిందా, అమ్మేస్తాను. చచ్చేముందు రుణంలేకుండా చేసుకుంటాను. ఆయింత బరువుతీర్చుకుని హాయిగా కళ్లు మూస్తాను" అంది.

అంతే!

ఊరిపెద్దల నేతృత్వంలో పెళ్ళి సన్నాహాలు చురుగ్గా జరిగిపోయాయి. ఆ రెండోరోజే ఏదో ముహూర్తముందని పంతుళ్ళు చెప్పగా పెద్దలు అందుకు సమ్మతించారు. పల్లె ప్రముఖులే పెళ్ళిపెద్దలై కలిసివచ్చి తమ బాధ్యతగా ఆ కర్తవ్యం నెరవేర్చారు. పెళ్ళిచూసి నేను కళ్ళు మూసేస్తానంది ముసిల్ది. నువ్వు కళ్ళుముయ్యనక్కర్లేదు. తెరిచేవుంచుతావు. ఆయింతా, మేం అయిందనిపించేస్తాం- అన్నారు పెద్దలు. ముసిల్ది కూడా అనుకోకుండా అయిపోతున్న మనవరాలి పెళ్ళికి ఎంతో సంబరపడిపోయింది. దేనికోసమైతే బెంగపెట్టుకొని ఆశపడిందో అది పెద్దశ్రమలేకుండానే సవ్యంగా జరిగిపోతున్నందుకు తృప్తితో ఆ అవ్వగుండె చెమర్చింది.

పెళ్ళిరాట భూమిలోకి దిగింది. పెళ్ళిపందిరిపైకి లేచింది. అరటిచెట్లు పందిరిరాట్లకు అదనపు అందాన్ని కూర్చాయి. తాటికొమ్మలు, కొబ్బరికొమ్మలు పందిరికింద నీడకల్పించాయి. మంగళవాయిద్యాలు వాతావరణాన్ని సంగీత భరితం చేసాయి. పురోహితుల వేదమంత్రాలు శుభం పలికాయి. పెద్దలు నిండుమనసుతో అక్షింతలు కురిపించారు. పేరంటాళ్ళు, ముత్తయిదువులు తోడువచ్చారు. సమస్తప్రకృతీ ఆ పెళ్ళికి తన హర్షామోదాలు తెలిపింది.

పెళ్ళి వున్నంతలో, సమయం తగినంతలేనప్పటికీ కడువేడుకగా సజావుగా జరిగిపోయింది.

పెళ్ళయితే ఇక్కడ జరిపించారుగాని శోభనం మాత్రం ఇక్కడొద్దని పట్టుపట్టాడు పెళ్ళికొడుకు. క్షణాలమీద.టౌన్నించితన స్నేహితులు ఎలాగూ పెళ్ళికొచ్చే అవకాశంలేదు కాబట్టి, శోభనం తన వూర్లోతన ఇంట్లోనే ఘనంగా జరగాలని పట్టుపట్టాడు పెళ్ళికొడుకు. అదిఇంకెంత ఘనంగా జరుపుకుంటాడో అని వూహించుకుని అబ్బురపడిపోయారు పెద్దలు. సిగ్గుతో ముసిముసి నవ్వులు నవ్వారు ముదితలు.

అందుచేత ఈ ప్రతిపాదనకు పెద్దల సమ్మతం లభించింది. ముసిల్దాని అంగీకారం

లభించింది. తర్వాత వున్నంతలో మడిసెక్క అమ్మి అప్పులు తీర్చగా పెళ్ళిఖర్చులకు పోను మిగిలినదానితో సారిచీరలతో చిన్నమెత్తు బంగారంతో నవదంపతుల వీడ్కోలు వైభవంగా సాగిపోయింది.

వెంటవెళ్ళేవారు ఎవరూలేకపోవడంతో ఆ జంట ఒంటిగానే బయలుదేరింది. పిల్లదానికి గుబులుగావుంది. పిల్లోడు ఆరముగ్గిన పండు చేతిలో పడినట్టు, రెక్కలువిప్పుకుని ఆకాశంలోకి ఎగురుతున్న పక్షిలా హాయిహాయిగా వున్నాడు. ఇద్దరూ నవనవలాడుతున్న జంటగువ్వల్లా ఉన్నారు.అక్కడి వారందరికీ చూడవేడుకైన ఆ జంటకి మగువలుమనసారా ఆశీర్వాదాలు తెలిపారు. ముసిల్దిమాత్రం గొల్లుగొల్లున ఏడ్చి తర్వాత అందరి బలవంతాన ఆపుకుంది. ఆపుకుందేగాని పెంచిన మమకారం చంపుకోలేకపోయింది.

అలా అందరి సంతోషంతోనూ, కొందరి విషాదంతోనూ ఆమె అతనితో ప్రయాణమైంది. జీవనయాత్రలో జీవితసహచరిణిగా తన ప్రయాణం ప్రారంభించింది.



నిద్రలేని పెళ్ళికూతురుకు రైల్లో నిద్ర ముంచుకొచ్చింది. రైలు వుయ్యాలలూపుతోంది. గాలి జోలపాడుతోంది. కళ్ళు పసిలోకపు అందాల్ని వెతుకుతూ నిద్రకుపక్రమిస్తున్నాయి. జోగుతున్న శిరస్సుకంపనచేస్తున్నది. పెళ్ళికొడుకు సుతారంగా ఆమె శిరస్సు తన గుండెలమీదకి చేర్చుకుని సుతి మెత్తగా నిమురుతున్నాడు. అతని వక్షపీఠమే ఆమె శయ్యావాసం అయింది. రైలు చక్రాలశబ్దం ప్రణయ గీతం ఆలపిస్తున్నది. రైలుకూత వారికి ప్రణయభేరి మోగించి ఉద్రేక పరుస్తున్నది. రైలు పరుగువారిని ఇతర లోకాల్లోకి తీసుకువెళ్తున్నది. వచ్చని బీడు, పసిరిక చేలు, ఫలపుష్పాలు, మొక్కలు, చెట్లు, కొండలు ఆ నూతన వధూవరులను దారిపొడుగునా పలకరిస్తున్నాయి.

ఆమె నల్లనికురులు మేఘాల్లా వూగుతున్నాయి. పల్చనినునులేత పెదాలు తీపిగా వణుకుతున్నాయి. లోపలి నుంచి తెల్లదానిమ్మ గింజల్లాంటి పళ్ళు కాంతి కిరణాల్ని పంపిస్తున్నాయి. సిగ్గుతో బిగుసుకుపోతున్న చెక్కిళ్ళు కెంపుల మొగ్గలౌతున్నాయి. విడివడిన పెదాలమధ్యనుంచి సన్నని తీపి మూలుగు వినిపిస్తున్నది.

కాళ్లకు పారాణి వుంది. ముఖానికి చందనం వుంది. నెత్తిన కాశికవుంది. పాపిటలో సింధూరం వుంది. సొట్టబుగ్గమీద గచ్చకాయంత దిష్టిచుక్కవుంది. ఒంట్లోనిలువెత్తు అమాయకత్వంవుంది. ముఖాన చెక్కుచెదరని మంచితనం నిండుగా వుంది. అంగాంగం వికసిస్తున్న ఒయ్యారం వుంది. ఆమె గుండె పూదోటలో సిగ్గుల మొగ్గలున్నాయి.

పెళ్ళికొడుకు ఆమె ముఖసౌందర్యాన్ని కప్పుతూన్న కురులతెరల్ని అలవోకగా తొలగిస్తూ సూదిగా కొనతేరిన ముక్కుమీద మెత్తగా ముద్దుపెట్టుకున్నాడు. రైల్లోని జవరాండ్రు అదిచూసి ఫక్కుమన్నారు. నడివయసు ముదితలు ముఖమంతా కళ్ళు చేసుకుని చూసారు. పాతరవేసిన వారి పాత అనుభవాల గని అడుగునుండి నవ్వులు పేలాయి.

ఉలిక్కిపడి కళ్ళు తెరిచిన ఆ పిల్ల అందరూ తమనే గమనిస్తుండటం చూసి సిగ్గుపడిపోయింది. తప్పుచేసినదానిలా బిడియపడి మరింత కుంచించుకుపోయింది. గువ్వలావొణికి మరింతగా అతని ఒడిలో వొదిగిపోయింది. ఎందుకో ఆమె అతని ఛాతీమీది నుంచి లేవాలనుకోలేదు. ఆ పసుపుబట్టల్ని చూసుకుని, ఆ పసుపుతాడుని స్పృశించుకుని ఆ పసిమనసు రాబోయే వసంతాల్ని కలగబోయే సౌభాగ్యాన్ని వూహించుకుని పరవశించిపోతున్నది. తొలిమేఘాలమీద తేలిపోయి మైమరచిపోతున్నది.మత్తుగాఅతని హృదయ ఫలకంమీద తన్మయత్వంతో ఇష్టపూర్వకంగా

వాలిపోతున్నది.

ఇప్పుడు కూడా సరిగ్గా అదేమైమరపు, అదే మైకం, అదేమత్తు. అదే పరవశం. అదే పులకరింత. ఉదయం రైల్లో ఏం జరిగిందో ఇప్పుడు హొటల్లోనూ అదేజరుగుతోంది. అప్పుడు రైల్లో పాసింజర్లు, ఇక్కడ హొటల్లో గొప్పగొప్ప తాగుబోతు పెద్దలు. ఉదయం పల్చని పొరవేసిన నీరెండ, ఇప్పుడు మెత్తమెత్తని ముసుగు వేస్తున్న మసకమసక వెన్నెలవొయ్యారం.

ఇప్పుడు కూడా ఉదయంలాగే అతని గుండెమీదవాలిపోయి ఏదో తాదాత్మ్యంలో కూరుకుపోతున్నది, అతని ఒడిలో ఒదిగి గువ్వలా ఇమిడిపోయింది.

అతను అలాగే ఆమెను తనగుండెలమీద అన్నుకుని ఒక చేయి తప్పించి, ఆచేత్తో గ్లాసు పట్టుకుని ఆమె రెండు పెదాలమధ్య సున్నితంగా వుంచాడు. అతని భరోసాతో, ఆమె మెల్లమెల్లగా చప్పరించింది. ఆ తియ్యని విషం గుండెను మండిస్తూ కడుపులోకి దిగి అక్కడ గుప్పుమంది. నరాలన్నీ వేడెక్కి కొంతసేపటికి చప్పున చల్లారిపోయాయి.

ఆమె కళ్ళు బరువుగా మూతలు పడుతున్నాయి. మెత్తమెత్తగా మైకం కమ్ముకుంటున్నది. మత్తుమత్తుగా ఒళ్ళు తూలుతున్నది. ఎదుటి ప్రపంచం కళ్ళముందు కదులుతూ కరుగుతూ కలిసిపోతున్నట్టయింది. చిక్కని చీకట్లు కారుమబ్బుల తెరలుదించుతూ, సమస్తవిశ్వమూ శూన్యమైపోతున్నట్టయింది.

మొత్తం తాగేసిన పదినిమిషాలకు ఆమె పట్టు తప్పిపోయింది. చలనరహితంగా తలవేలాడవేసింది. కాళ్ళూచేతులూ సత్తువ కోల్పోయినట్టు వేలాడుతున్నాయి.

అలా ఆమె జీవశ్చవంలా మారిపోయిన మరుక్షణం ఆ ముగ్గురూ ఆమెను పొదివిపట్టుకుని బయటకు తీసుకువచ్చేసారు. అక్కడ ఒక ఆటో కుదుర్చుకుని అందులో ఆమెను పడుకోబెట్టి సీటు అంచున ముగ్గురూ జాగ్రత్తగా కూర్చున్నారు. మరో పదినిమిషాల్లో ఆ ఆటో అక్క ఇంటిముందాగింది. మళ్లీ ఆ ముగ్గురూ ఆమెను మోసుకొని ఇదివరకటిగది లోకి తీసుకొచ్చి పడుకోబెట్టారు.

ఆ గది ఇప్పుడు కొంచెం శుభ్రంగా, వున్నంతలో శోభనం గదిలా అలంకరించి వుంది. గోడలు పట్టుదులిపి వున్నాయి. గది చెత్తాచెదారంలేకుండా క్లీన్‌గావుంది. ఒక గట్టి మంచం, దానిమీద పీచుపరుపు, ఆపైన రెండు ఒత్తుదిళ్లు. వాటిమీద తెల్లటి దుప్పటి, దానిమీద జల్లిన అత్తరు, పరిచిన మల్లెలు, రసికుల్ని పరవశుల్నిచేసి సమ్మోహపరిచేటట్లుంది.

అక్కడ ఇద్దరు మార్వాడీలు కొత్త పెళ్లికొడుకుల్లా ముస్తాబై ముసిముసి నవ్వుల్తో శుభసమయంకోసం ఎదురుచూస్తున్నారు. స్త్రీఅత్యంత పవిత్రంగా ఎంచుకుని జాగ్రత్తగా భద్రపరుచుకునే శీలానికి రిబ్బను కత్తిరించి, ఆమె తదుపరి జీవితాన్ని శోభలప్రభలతో వెలిగించడమనే మహొజ్వల వైభవానికి ప్రారంభోత్సవం చేయడానికొకరు వచ్చారు. ఈ తతంగమంతా సాకల్యంగా సందర్శించి, అనంతలయుడువేసే మొదటి చిందులాట అయిన ఈ సృష్టి మహాత్కార్యానికి స్వయంగా అధ్యక్షతవహించడానికి ఇంకొకరు వచ్చారు. ఆ ఇద్దరు మార్వాడీల జన్మ సాఫల్యమనే ఈ మహాత్కృష్ట కార్యం యావత్తూ శాస్త్రోక్తంగా సంపూర్తిచేయడానికి "అక్క" సంసిద్ధురాలై సగౌరవంగా వారిని ఆహ్వానించిఉంది. అందుకుగాను వారిరువురునుంచీ మొదటి ఎనిమిదిరోజుల కంట్రాక్టు కింద చెరో రెండు వేలూ పుచ్చుకుంది. దానికి మరో ఆరువేలు కలిపి, ఖర్చులకింద అయిన మొత్తాన్ని తీసివేసింది. ఆ మిగిలింది ఆ రాత్రే ఆ అక్క ఈ తమ్ముడి చేతికిచ్చి చెయ్యిదులుపుకుంది. అక్కడికా అంకం పూర్తిచేసింది.

ఆ స్వచ్ఛమైన పల్లెటూరి ముద్దబంతి పువ్వు పేరు వరాలు. నిజంగానే దేవుడనేవాడుంటే అతడు ఈ నేలమీదికి దించిన వరాలమూట ఆమె. అమాయకత, పవిత్రతల సంగమం మూర్తీభవించిన మంచితనపు ప్రతిరూపం.

ఆ "తమ్ముడు" ఓ కల్తీలేని కేటుగాడు. అప్పిగాడు వురఫ్ దానుడు. చిన్న చిన్న నేరాలుచేస్తూ దాంతో తాత్కాలికంగా పబ్బంగడుపుకుని, పెద్దలఅండవుంటే హత్యలవరకూ ఎదగాలని ఉవ్విళ్ళూరే కుర్రాడు. బ్లాక్‌టిక్కెట్ల గాంగును లీడ్‌చేస్తూ వాళ్లదగ్గర మామూళ్లు వసూలుచేసుకు బతికే బచ్చా. సహజంగా పోలీసు ఇన్ఫార్మెంటు. ఎప్పుడూ స్టేషన్లోపడి




[illegible] తూ చిల్లర మిగుల్చుకునే బ్రోకర్. పగలూరాత్రీ సారాదుకాణాలదగ్గరా, అంగనల అంగడివద్దా వీరవిహారంచేసి, పోలీసుస్టేషన్ పేరుచెప్పి బతికేవీరుడు. తీరికవేళల్లో "అక్క"కి తగిన తమ్ముడిగా యధోచిత సేవలందించి ఋణంతీర్చుకునే విధేయుడు.

కన్నెపిల్లలు లొంగిరాకపోతే, లేడిపిల్లలా బెదురుచూపులుచూస్తూ నునుసిగ్గులు కళ్లల్లో, లేతవలపులు కెంపుల బుగ్గల్లో వొలకపోస్తుంటే ఆ వయసు పిల్లల్ని లొంగదీసుకోడానికి బెల్టులు, బ్లేడులు, సూదులు, రాడ్లతో కాయకల్పచికిత్సచేసి దారికి తీసుకువచ్చే వస్తాదులు.

అది మొదలు వాళ్ల సొంత మెదళ్లు పనిచేయకుండాచేసి ఆడమన్నట్టు ఆడించుకునే స్థాయికిదించి, రంగురంగుల ప్రపంచంలో సహజమైన కోరికలు మొలకెత్తకుండా, వికసించకుండా నిర్దాక్షిణ్యంగా తుంచివేసేకసాయిలు వీళ్లు. ఎదుటివారి ఆనందంకోసం వారి విలాసాలకోసమే తాము కారణజన్ములమైనట్టు ఆ ఆడపిల్లలు అనుకున్నట్లు చేస్తారు వారు. పారలో కప్పచింతనతో తమను తాము కాల్చుకోడానికి ఇష్టపూర్వంగా సంసిద్ధపడేట్లు వారిని మార్చే నీచులు

ప్రాణంవుండి నడిచే గుండెలేని ఆటబొమ్మలుగా మార్చి వారిని లాడ్జీలకు, మోడరన్‌కాటేజీలకుపంపి, అక్కడినుండి వారంతటవారుగాని, విటుల సహకారంతోగాని వుడాయించకుండా కట్టుదిట్టంచేసి, వారి మెడచుట్టూ కనిపించని వుచ్చుబిగించి, ఇరవై నాలుగ్గంటలూ కళ్లాలు తమ చేతిలో వుంచుకునే "అక్క" విధేయులు వారు. ఖచ్చితమైన గూండాలు వాళ్లు.

ఆ అక్క పేరు నూకరాజు.

నూకాలుగా జీవితం ప్రారంభించి యవ్వనదశలో, వయసు పొంగులో, శరీర బిగువులో, మాంచి నిగాలింపు మీదున్నప్పుడు ఆమె అక్కకాదు, రాజు. అప్పుడు తన కాలిపట్టీలు ఘల్లున మోగినచోట రసికప్రపంచాన్ని దిగ్భ్రాంతిపరచి తన కొంగుకు కట్టివేసింది. సరిగ్గా అప్పుడే ఒక ముసలిరాజా వారు, తన హోదాకు సరిపడుతుందన్జెప్పి ఈవిడగార్నిచేరదీసారు. ఆ రాజావారు తన శేషజీవితాన్ని తీసుకు వెళ్ళిపోగా, వారి తదనంతరం, ఆయిన వరుసుదుగా ఈ భవనాన్ని వారి నామధేయాన్ని కూడా స్వీకరించి నూకరాజుగా రూపాంతరం చెందింది.

ఆ తర్వాత ఈ భవనం కేంద్రంగా ఎగుమతి దిగుమతుల వ్యాపారాన్ని ఆరంభించింది. అనతికాలంలోనేదాన్ని అభివృద్ధిపరిచి మొత్తం వీధి వీధంతటినీ ఏకఛత్రాధిపత్యంగా పాలించి తనకెదురులేకుండా చేసుకుంది నాయకురాలు. అనిపించుకుంది. ఆ విధంగా అవతారం మార్చి మరో మెట్టు పైకెక్కింది. పరిణతి చెంది అంచెలు అంచెలుగా మలుపులు తిరిగిన ఆమె జీవనశోభ ఇప్పుడు అధికార్ల చేయూతతో, రాజకీయనాయకుల అండదండలతో ముగ్గురు కన్యలు, ఆరుగురు ప్రౌఢలుగా ఉచ్ఛదశకు చేరుకుంది. దశదిశలా మారుమోగుతున్న వైభవం ఆమెది.

తన మనుమలు ఒంటి నునుపులు తేలిపోయి మేని వనలు తగ్గిపోయినప్పుడు బేరంతగ్గి గిరాకీపడిపోతే రీబోరింగు కంపెనీలకు వారిని అమ్మేస్తుంది. కొత్తనరుకు కోసం కోటి కళ్ళతో వెతికి వేటాడి వేటాడి వలవన్ని తెప్పించుకుంటుంది. అధికార్లకు అవసరం కలిగినప్పుడు తానే సర్వాలంకారశోభితయై స్వయంగా వెళ్తుంది. వార్ని సమాధానపర్చి తన పనికి అడ్డురాకుండా చూసుకుంటుంది.

అదుగో ఈ అక్కచేతిలో పడింది వరాలు.

★ ★ ★

ఉదయంలేస్తూనే వరాలకు ఒళ్ళు తిరిగినట్టయింది. హుషారుగా లేచి అలవాటు ప్రకారం పక్కమీది నుంచి ఒక్క గెంతు గెంతుదామనుకున్న వరాలు లేవబోయి కట్టెలా వెనక్కి పడిపోయింది. ఆమెకు ఆశ్చర్యం వేసింది. అలాంటిస్థితి తనకెప్పుడూ లేదు. మరో రెండు నిమిషాలు ఆగి మళ్ళీ లేవబోయింది. తిరిగి యధాప్రకారం పడిపోయింది. ఆమెకు మరింత ఆశ్చర్యం వేసింది. ఏమైంది... తనకే మొచ్చిందిప్పుడు రాత్రి తెలివికూడా లేదు. ఎంతమొద్దు నిద్రపోయింది. ఇంతకీ రాత్రి ఏం జరిగింది? ఏం జరిగివుంటుంది? ఆమెకు తలచుకుంటే సిగ్గు కమ్ముకొస్తున్నది. ధైర్యంగా కళ్ళు తెరిచి చూడలేకపోతున్నది. ముఖానికి

చేతులు అడ్డంపెట్టుకుని సన్నని వేళ్ల సందు ల్లోంచి నక్కినక్కి చూసింది. ఇంతకీ తన మనోరధుడు ఏడీ... ఎక్కడ?

పక్కన చూసింది లేడు. చుట్టూ చూసింది లేడు. అప్పుడు చూసుకుంది ఒళ్ళు.

అంతే! దెయ్యాన్ని చూసి జడుసుకున్నట్టు ఒక్కకేక వేసింది. మరోసారి బిగ్గరగా భయాన కంగా ఒక్క చావు కేకవేసి కట్టెలా విరుచుకుపడిపోయింది. వరాలు మూర్ఛబోయింది.

ఆ పడిపోవడం పడిపోవడం మధ్యాహ్ననికి గాని తెలివి రాలేదు. అదీ మిగిలినవారొచ్చి లేపగా. అప్పుడు తెలుసుకుంది- వొళ్లంతా నొప్పులుగా, ఒకటే మంటగా వుంది. కత్తులతో పొడుస్తున్నట్టు, సూదులతో గుచ్చుతున్నట్టు ఒకటే బాధ. అప్పుడు చూసుకుంది-

చూసుకుంటే ఇంకేముంది... బతుకే బద్ధలైంది.

అంతెత్తునుంచి పడిపోయిన గాజుబొమ్మ తునాతునకలైనట్టు జీవితమే ఛిన్నాభిన్నమైంది. దుప్పటి నిండా రక్తం. చీర రక్తపుముద్దే. తొడలు రెండూ రక్తమయంగా రక్తం పారుతున్న కొండవాగులావుంది. చీర ఒంటిమీద లేదు. జాకెట్టు ముక్కలుగా చిరిగిపోయి వుంది. లంగా ఒక మూలకు విసిరేసివుంది. పొత్తికడుపు గునపాలతో పొడిచినట్టు నొప్పితో మెలికలు తిరిగిపోతూవుంది. శరీరంలో అందమైన ప్రతిభాగం పళ్ళగాట్లతో, గోళ్లరక్కులతో నిండి ఉంది. పెదాలు, బుగ్గలు కొరికి కొరికి ఉన్నాయి. అక్కడక్కడ రక్తం గడ్డకట్టి వుంది. ముఖమంతా బీభత్సంగా చెదరగొట్టబడిన శిల్పంలా వుంది. ధ్వంసంచేసిన పాలరాతి బొమ్మలావుంది.

ఆమె తన దైన్యస్థితిని, అసహాయ పరిస్థితిని అర్థంచేసుకునేసరికి తను మోసగించబడిందని తెలుసుకుంది. రాత్రి తనను ఇంతగా హింసించి, ఘోరంగా రాక్షస రతిసల్పింది మొగుడుకాక మరికొందరుంటారని వూహించుకుంది. ఆ కొందరు బహుశా ఆ ఇద్దరే అయివుండొచ్చని నిర్ణయించుకునేసరికి, ఎవరో కడుపులో చెయ్యిపెట్టి కెలికినట్టయింది. గుండెలో శూలాలుగుచ్చి దేవినట్టయింది. తిన్నపదార్థాలు కడుపులో ఇమడలేనట్టు ఒక్కసారి భళ్లున వాంతిచేసుకుంది. మళ్ళీ మరోసారి మొహం తిరిగిపడిపోయింది.

★ ★ ★

కుర్రప్లీడరు ఆమెకేసి మరోసారి ఎగాదిగా చూశాడు. నిశితంగా పరిశీలించాడు. తన అంచనా సరియైనదేననీ, అందులో సందేహించాల్సిందేం లేదనీ నిర్ధారించుకున్నాడు. ఒక చిన్న కాగితంముక్కతీసి, దానిమీద ఏదో రాసి తీర్పు పీఠం ఎదురుగావున్న బెంచి గుమస్తా చూస్తుండగా అతని టేబుల్మీద వుంచాడు.

ఆ బెంచి గుమస్తా ఆ చీటీ చూసి ఏదో గొణుక్కుని తీసి మడతలువిప్పి చదివాడు. లౌక్యం తెలిసినవాడు కావడంచేత చదివిన వెంటనే షాక్ తిన్నాడు. నిర్ధారించుకోడానికి మరోసారి చదివి కొంచెం ఆశ్చర్యపోయాడు. అయినా తనకెందుకన్నైప్పి, ఆ కాగితాన్ని చిన్నగా మడిచి మెల్లగా మేజిస్ట్రేట్గారి ముందుంచాడు.

మేజిస్ట్రేట్గారు చిరుదరహాసంతో ఆ పత్రాన్ని తీసి మడతలు విప్పి యధాలాపంగా చదివారు. అంతే! ప్రియురాలిని చూడబోయి ఆమె తల్లికి ఎదురుపడిపోయినట్టు షాక్తిన్నారు. అయినా దాన్ని బయటికి కనబడనీయకుండా హుందాగా మళ్ళీ చదివారు. ఎందుకయినా మంచిదని మూడోసారి కూడా చదివి, తన కళ్లు తనని మోసగించటంలేదని నిర్ధారణ చేసుకున్నారు. దీనిని గురించి కొంత ఆలోచించాలి-- అనుకుని ఆ కాగితాన్ని మడిచి పక్కన వుంచుకున్నారు.

అప్పుడు ఇలా చెప్పారు:

"సూరరాజు అనబడే ఈ ప్రాసిక్యూటర్ కేసు మరికొంత వివరంగా విచారించాల్సి వుంది. ఈ కేసునుగూర్చి వాదించడానికి ఒక లాయర్ సిద్ధపడుతున్నాడు. అలా ఎందుకు జరుగుతోందో మేము వివరణ కోరాల్సివుంది. అందుచేత ఈ కేసును కోర్టు ముగిసేవరకూ వాయిదా వేస్తున్నాం. అంతవరకూ సదరు ముద్దాయిని ఇక్కడే వుంచాల్సిందిగా పోలీసు వారిని ఆజ్ఞాపిస్తున్నాం. నెక్ట్స్ కేస్ ప్రొసీడ్" అంటూ వారు బెంచి గుమాస్తాను చూశారు.

బెంచి గుమస్తా తర్వాత కేసు విచారణకు హుకుం జారీచేశాడు.

బిళ్ల బంట్రోతు లౌడ్ స్పీకర్లాంటి నోరు




లేక, తరువాత కేసు విచారణకు రానున్న వ్యక్తిని నాలుగువైపులా వినిపించేటట్టు అరిచి పిలిచాడు.

అంతవరకూ మౌన గంభీరంగావున్న కోర్టు వాతావరణం కడలికల్లోలంలా మారిపోయింది. ఏదో పొడిచేశామనుకున్న పోలీసులు గునపాల పోట్లు తిన్నట్టయిపోయారు. దాచుకున్న దొంగకడుపునవున్నపాళంగా బయటపడిపోయినట్టు, దొంగలు కన్నంలోనే దొరికిపోయినట్లు తికమకపడిపోయారు. అణిచిపెట్టుకున్నా ఆగని అలజడి వారిగుండెల్లో కలకలంరేపింది.

లంచ్ టైంలో మేజిస్ట్రేట్‌గారి పిలుపునందుకుని ఈ కుర్రలాయరు, ఛాంబర్లోకి అడుగుపెట్టాడు.

మేజిస్ట్రేటుగారు ఒక్కటంటె ఒక్కనిమిషం ఈ కుర్రలాయర్ని తిలకించి, తలపంకించి, కూర్చోమన్నట్టు సైగచేశారు.

"థాంక్సెలాట్" అన్నాడేగాని కుర్రప్లీడరు కూర్చోలేదు. నించునేవున్నాడు. మేజిస్ట్రేటుగారు ఈ పిల్లప్లీడర్ని మరోసారి వీక్షించి, కూర్చోమన్నట్టు రెండోసారి సైగతో ఆదేశించారు. అప్పుడు ఈ చిన్నవాడు బహువొద్దికగా, తగుజాగ్రత్తగా కూర్చున్నాడు. టై సవరించుకుని తన విన్నపం మేజిస్ట్రేట్‌గారి ముందు వివరించడం మొదలుపెట్టాడు.

"ఈ కేసులో నిజం వున్నట్టు కనిపించడంలేదుసార్! ఆమె తననోటి మీదుగా ఈ నేరాలు అంగీకరించడంలేదు. పోలీసులు ఆరోపించినట్టు అంతలేసి నేరాలు చేయడానికి ఇప్పటికున్న ఈమె వయసు చాలదనిపిస్తోంది. ఈమెను అడ్డంపెట్టుకుని పోలీసులు ఏవో ప్రయోజనాలు నెరవేర్చుకోచూస్తున్నట్టు నాకనిపిస్తోంది. అందుచేత సార్... తమరు వందో, యాభయ్యో ఫైన్ వేసిగాని, వారమో రెండువారాలో జైలు శిక్ష చెప్పిగాని, దయచేసి తీర్పుచెప్పవద్దని అర్థిస్తున్నాను. తమరు అనుమతిస్తే ఈ కేసు నేను టేకప్ చెయ్యదలచుకున్నాను"

అతనికి ఈ కేసు ఒక రమీజాబీ, ఒక షకీలా, ఒక మాయాత్యాగీ కేసులాగా అనిపించింది. ఇందులో కూడా అంతుపట్టని మిష్టరీ ఏదో గూఢంగా దాక్కుని వుండవచ్చు అనుకున్నాడు. పైగా ఈ పిల్ల 'ఆ బాపతు సరుకు'లాకాక చాలా అమాయకురాలిలా కనిపిస్తోంది.

ఈ కేసులో ఎక్కడో మారుమూల దాగివున్న క్లూలాగి అసలు విషయం బయటపెట్టి, పకడ్బందీగా వాదించాలి. ఆ విధంగా ఒక రికార్డు సృష్టించి తాను తొందర తొందరగా పైకొచ్చేయాలనే దృఢసంకల్పంతో వున్నాడు ఆ కుర్రలాయరు.

ఆ కుర్రలాయరు పేరు సత్యసుందరం.

కొన్ని సత్యాలు అబద్ధాలంత సుందరంగా వుండకపోవచ్చుగాని అతనుమాత్రం సుందరంగానేకాక సున్నితంగా కూడా వున్నాడు. పైగా పేరుకు తగ్గట్టు సత్యంవైపే నిలబడాలని నిశ్చయించుకున్నాడు.

అతను పట్టా పుచ్చుకుని కోర్టులో ప్రవేశించి సంవత్సరం పూర్తయింది. ఎన్నో కేసులు వాదించి నెగ్గిన పాపానపోలేదు. అతను ఎవరి వద్దా అసిస్టెంటుగా పనిచేసి ప్రాక్టీసు మొదలుపెట్టినవాడు కాదు. ముసలిలాయర్లు లౌక్యం, అబద్ధం మప్పుతారని అతని భయం. అందుచేత అప్రెంటిస్ మాత్రం ఒక పేరున్న లాయరువద్దచేసి, కొన్ని మెళకువలు తెలుసుకుని, అక్కడితో వదిలించుకున్నాడు. నీతినిజాయితీలతో తన వృత్తిధర్మం నిర్వర్తించాలనుకున్నాడు. ప్రజలకు న్యాయం కలుగచెయ్యాలని నిర్ణయించుకున్నాడు. అతనిలో కుర్రతనపు ఆవేశంతోపాటు కొత్తతరం ఆలోచనలు కూడా చోటుచేసుకున్నాయి.

మేజిస్ట్రేటు కూడా ఏకళనున్నాడోగాని మాంచి హుషారుగా వున్నాడు. ఆఫ్టాల్... ఒక ప్రోతల్ కేసు ఈరకంగా మలుపుతిరగడం కోర్టుల చరిత్రలోనే అరుదు. ఈ గౌరవం తనకే దక్కవచ్చునేమో! ఇదీ ఒకందుకు మంచిదే. ఓ చిన్న ఎడ్వెంచర్‌చేసి ఒకింత సంచలనం సృష్టించవచ్చుకూడా— అనుకుని, బైటకేమీ కన్పించనీయకుండా గుంభనంగా వూరుకున్నారు.

ఆరోజు కేసులన్నీ పూర్తయి, కోర్టు టైమ్ ముగిసేసరికి కోర్టు ఆవరణలో సందడి తగ్గిపోయింది. పగటి వెలుగు పక్కకు తప్పుకుని మసకచీకటికి చోటిస్తున్నది. అప్పుడే వెలిగిన




లైట్లు కమ్ముకొస్తున్న చీకటిని తరిమికొట్టడానికి శక్తి వంచనలేకుండా ప్రయత్నిస్తున్నవి.

ఇరువైపులా పోలీసు పహారాతో అంతవ రకూ ఆ పిల్ల అక్కడే వరండాలో చతికిలబడి వుండిపోయింది.

కోర్టు ముగిసే సమయానికి ఆఖర్ని ఆకేసు మరునాటికి వాయిదా వేస్తూ ఆ పిల్లను పోలీసు కస్టడీనుంచి తప్పించి జైలు కస్టడీకి పంపిస్తూ తీర్పువెలువడింది.

అప్పటికిగాని ఏం జరిగివుంటుందో పోలీసులు తెలుసుకోలేకపోయారు. అలా తెలుసుకున్న తర్వాత ముఖాలు జేవురించుకుపోయాయి. కాంతి హీనమయ్యాయి. ఇక ఏదో జరగబోద్ది అనుకున్నారు. అలా అనుకున్న తర్వాత వారి మనసులు కీడు శంకించాయి. వారి గుండెలు భీతావహంతో అదిరాయి.

కుర్రలాయరు సత్యసుందరం సరాసరి కోర్టునుంచి ఇంటికి వెళ్లాడు. ఇంటి దగ్గర ఒక్క క్షణం ఆలస్యం చేయకుండా శుచిగా శిరస్నానంచేసి శుభ్రంగా ముస్తాబయ్యాడు. సత్యాన్వేషణకు బయల్దేరినట్టు హుషారుగా రెట్టించిన ఉత్సాహంతో ఏకాఏకిన జైలు వద్దకు చేరుకున్నాడు.

జైల్లో ఖైదీల్ని చూసే సమయం అదికాదని అతనికి తెలుసు. అందుచేతనే ముందుగా కోర్టువారి అనుమతి తీసుకున్నాడు. ఆ అనుమతియిచ్చిన ధైర్యంతోనే మరింత హుషారుగా జైలును సమీపించాడు.

జైలు సూపరింటెండెంటు అనుమతి పత్రంచూసిన తరువాత, ఇది సామాన్యమైన బోత్రల్ కేసుకాదనుకున్నాడు. ఏదో ప్రత్యేకమైన ఇన్వెస్టిగేషన్ బాపతులావుంది. పైగా ఆ వచ్చినవాడు వకీలు కాబట్టి, ఇంకా తగు జాగ్రత్తలో వుండాలన్జెప్పి సత్యసుందరాన్ని సమర్యాదగా ఆహ్వానించి ఆమెతో ఇంటర్వ్యూకి అనుమతించాడు.

విజిటర్స్ సెల్‌లో ఒక కుర్చీ వేశారు. సత్యసుందరం అందులో కూర్చున్నాడు.

ఒక జవాను ఆమెను అక్కడకు తీసుకువచ్చాడు.

ఆమె రక్తమంతాపోయినట్లు చాలా బలహీనంగా వుంది. కొట్టిన దెబ్బలకో ఏమో, ముఖమంతా కమిలిపోయివుంది. చర్మంచిట్లి ఆ గాయాలనుంచి ఇంకా రక్తంకారుతూ వుంది. ఆమె నడవలేకనడవలేక నిస్సహాయంగా వుంది. నీరు ఆర్చుకుపోయి వేలాడుతున్న అరటిచెట్టులావుంది.

అలా వున్న ఆమెను ఒక జవాను ఆసరాయిచ్చి మెల్లగా నడిపించుకుంటూ తీసుకువచ్చాడు. సత్యసుందరం ఎదురుగా ఒక బెంచీ వుంటే దాని మీద నెమ్మదిగా కూర్చుండబెట్టాడు.

సత్యసుందరం ఆమె వైపుచూశాడు.

అంత చిన్నవయసులో ఆమె ఎంతో అందంగా వుంది. గుండ్రని ఆ ముఖంలో కొట్టొచ్చినంత అమాయకత్వం వుంది. సానపట్టిన వజ్రంలా మెరుస్తూ కడిగిన మంచిముత్యంలా స్నిగ్ధమనోహరంగా వుంది.

పండిన దొండపండులా, కుంకుమ పూత పూసినట్టు పెదాలు; గులాబిరంగు అద్దినట్టు చెంపలు; లోకం చూడని ఆ కళ్లు ఇపుడిప్పుడే కల్తీఅయిపోయిన ఈ కుళ్లు లోకాన్ని చూసినట్టు బెదురుతున్నాయి. నిజాన్ని చూడాల్సిన ఆ చూపులు, అబద్ధాన్ని చూసినట్టు భయంతో రెవరెవలాడుతున్నాయి.

ఆ పిల్ల ఈ కుర్రలాయర్ని వింతగా చూసింది. ఇతను తనకు మిత్రుడో, శత్రువో ఆమె తేల్చుకోలేకపోతున్నది. ఇంతవరకూ మిత్రులంటూ ఎవరూ కనిపించలేదు. అంతా శత్రువులే, దుర్మార్గులే ఎదురయ్యారు.

విశాలమైన జైలు. ఎత్తుగోడలు, దృఢమైన ఇనపవూచలు, కాకీబట్టలు, ఎర్రటోపీలు, నల్ల బూట్లు, చేతిలో లాఠీలు, భుజాన తుపాకీలు - ఇది ఏరకమైన లోకమో ఆమెకు అంతుపట్టలేదు. చచ్చేవాళ్లు స్వర్గం కాకపోతే నరకానికి వెళ్తారంటారు. కాని తాను బతికి వుండగానే నరకానికి చేరుకున్నాననుకుంది.

పులికి ఎదురుపడిపోయిన మేకలా విలవిలలాడిపోతున్నదామె. విసిరిన బలమైన పంజాదెబ్బ కానుకోలేక కిందపడిపోయిన లేడిలా గిజగిజమంటున్నది.

ఆమెను అలా చూసేసరికి సత్యసుందరానికి చాలా జాలివేసింది. కష్టం అనిపించింది.



ఆమెకు ధైర్యం చెప్పాల్సిన బాధ్యత వుందని పించింది.

"చూడమ్మాయ్... నీకొచ్చిన భయమేమీలేదు. నువ్వు ధైర్యంగా వుండు నిన్ను నేను కాపాడతాను. నిన్ను ఈ జైలునుంచి తప్పించి బయటకు తీసుకువస్తాను. ఇంతకంటె మంచి జీవితం నీకు చూపిస్తాను. నేనుండగా నీకు ఎలాంటి ఆపదారాదు. నన్ను నమ్ము"

ఆమెలో ధైర్యంకలగడానికి, ఉత్సాహాన్ని తిరిగితెప్పించడానికి అతను చేయాల్సిన ప్రయత్నమంతా చేశాడు.

అయినా ఆమెలో ఉత్సాహంకలగలేదు, ఆనందం పెల్లుబికలేదు. ఆమెకు మాట్లాడ్డానికి నోరు పెగలడంలేదు. ఈ కొత్తమలుపు ఆమెకు అర్థంకాలేదు.

ఒక్క పది నిమిషాల మౌనం తర్వాత ఆమె లేతమెదడు, ఈ చిన్న అనుభవంతో ఎంతో ఆలోచించుకున్న తర్వాత, సత్తువంతా కూడదీసుకుని నెమ్మదిగా నోరువిప్పింది - "మీరెలా కాపాడతారు నన్ను ఇప్పుడు నన్నెవరూ రక్షించలేరు. పిల్లను రెక్కల్లో దాచుకోవాల్సిన పోలీసు బాబులు కూడా నన్ను నాశనం చేసిన వాళ్లలో వున్నారు. మీరెలా కాపాడతారు నన్ను?"

ఆమె కంటివెంట బొటబొటా నీరు కారుతోంది.

ఆమెను వూరడించడం కష్టమే అనుకున్నాడు అతను. అయినా తాను వచ్చిన పని చేసుకోకతప్పదు.

"పోలీసులు ఎప్పుడూ కాపాడలేరు. అలా కాపాడగలిగితే వారు పోలీసులేకారు. వారి సంగతి అలా విడిచిపెట్టి అసలు విషయానికి వద్దాం. జరిగిందేమిటో పూర్తిగా వివరంగా చెప్పు. ఏ ఒక్కటీ దాయకూడదు. అంతా నిజమే చెప్పు... నా శాయశక్తులా నిన్ను విడిపించడానికి ప్రయత్నిస్తాను. విడిపించడమేకాదు - నీకు మేలైన బతుక్కిదారి కూడా చూపిస్తాను"

ఆమెలో ఆత్మవిశ్వాసం కలగడానికి అతను ఆ మాట అనకతప్పలేదు - అన్న తర్వాత అదెలా సాధ్యమో అతను ఆలోచించదలచలేదు.




అయినా ఆమెలో కదలికలేదు " నాలో ఆశచచ్చిపోయింది. నమ్మకం నశించిపోయింది. నేనిప్పుడు బతకాలనుకోడంలేదు. అయినా నాకోసం మీరింత శ్రమ, ఆరాటం పడుతున్నప్పుడు మిమ్మల్ని నిరుత్సాహపర్చడం మంచిదికాదనిపిస్తోంది. అడగండి... చెప్తాను" ఆమె ఎంతో ఆలోచించుకున్న మీదట ఈ నిర్ణయానికి వచ్చింది.

"నూకరాజు పేరుతో నీమీద కేసు నమోదు అయింది. నీపేరు నూకరాజేనా?"

"కాదు" ఆమె అరచినంతపనిచేసింది.

"అది ఆ ఇంటి యజమానురాలిపేరు"

ఆ పేరు చెబుతున్నప్పుడు ఆమెలో చిన్న వణుకు కనిపించింది. కోపంతో కళ్లు ఒక్కనిమిషం జ్వలించాయి. కళ్లల్లో ఒక్కక్షణం ఎర్రజీర కనిపించింది. తప్పయినా సరే నూకరాజును హత్యచేసేయాలన్నంత కసి ఆమె చూపుల తీవ్రతలో కనిపించింది.

"మరి నీ పేరు?" ఆశ్చర్యంగా అడిగాడు సత్యసుందరం.

"వరాలు"

అలా చెప్తున్నప్పుడు ఆమెలో కొంత ప్రశాంతత చోటుచేసుకుంది.

"నీదేవూరు, ఇక్కడికెలా వచ్చావు? ఎవరు తీసుకువచ్చారు?"

ఆమె చెప్పింది...

అంతాచెప్పింది.

ఏ ఒక్కటీ విడిచిపెట్టకుండా పూసగుచ్చినట్టు చెప్పింది... మొట్టమొదటినుంచి చిట్టచివరివరకూ ఏ ఒక్కటీ దాయకుండా కళ్లకుకట్టినట్టు చెప్పింది. చూసింది చూసినట్టు; అనుభవించింది అనుభవించినట్టు చెప్పింది.

అలా చెపుతున్నపుడు ఆమె తనలో కలిగిన ఆవేశాన్ని అతిప్రయత్నంమీద అణచుకుంది. బతుకుమిగిల్చిన నిరాశ స్పష్టంగా కన్పించింది. తనకు జరిగిన అన్యాయానికి ప్రతీకారం తీర్చుకోవాలన్న కోర్కె ఆమెలో చాలా వరకూ నశించిపోయినట్టు అనిపించింది.

అన్నీవిన్న సత్యసుందరానికి మతిపోయినంతపనైంది. ఇది తప్పకుండా రిస్క్‌తీసుకుని అయినాసరే టేకప్‌చేయాల్సిన కేసుగా అతనికి అనిపించింది. అతను ఆగ్రహంతో ఊగిపో

యింది. ఏమైనా ఏదైనా... దీన్ని ఛాలెంజ్‌గా తీసుకోవాలనుకున్నాడు. ఎలాగైనా సరే సాధించితీరాలని నిశ్చయించుకున్నాడు.

వెంటనే కొన్ని కాగితాలు తీసి ఆమె ముందుంచాడు. కొన్నిచోట్ల చుక్కలుపెట్టి అక్కడ సంతకాలు చేయమన్నాడు.

సంతకంపెడితే పెనంమీదినుంచి పొయ్యిలోకి దూకినట్టు అవుతుందేమోనని భయపడింది.

అతను ధైర్యం చెప్పాడు- "ఫర్వాలేదు సంతకంచెయ్యి. సంతకాలు చేసినంతమాత్రం నీకు పొయ్యేదేమీలేదు. నేను దొంగిలించడాని కీ, నువ్వుపోగొట్టుకోడానికీ ఇంకా నీదగ్గర ఏంమి గిలిఉందని? పోతే నీకు శనేవదిలిపోతుంది. శేషజీవితమంతా హాయిగా, తృప్తిగా,గర్వంగా సుఖాలు అనుభవిస్తూ జీవిద్దువు గాని- నన్ను నమ్ము. నా సాయంతో ధైర్యంగా ముందడుగువెయ్యి. ఎలాంటిసందేహాలు పె ట్టుకోక ముందు సంతకంచెయ్యి.

అతని భరోసాతో ఆమెకు కొంత ధైర్యంవ చ్చింది. అవును... నిజమే. అతనన్నట్టు పోగొ ట్టుకునేందుకు తనదగ్గర ఇంకేంమిగిలి ఉంది గనక. పోతే దరిద్రమేపోతుంది. వదిలితే శనేవ దిలిపోతుంది. ఇప్పుడు తాను అనుభవిస్తున్న నరకంకంటే క్రూరమైనదీ, కర్కశమైనదీ మరోటి ఉండబోదు. అందుచేత ఈ లాయరు కొత్తగా తెచ్చిపెట్టే నరకమంటూ ఇంకోటి ఏంవుంటుంది?

ఇతన్ని చూస్తుంటే నమ్మాలనిపిస్తోంది. మంచివాడులాగనే కనిపిస్తున్నాడు. ఇంకా కుత్రతసంకదా, బహుశామాయలూ, మోసాలు తెలిసుండవు. ఫర్వాలేదు. అయినా ముందు ముందు తనకెలా జరగాలనుందో అనుకుంది. అనుకున్నదే తడవుగా అతను చెయ్యిమన్న ప్రతిచోటా సంతకంచేసింది. ఇప్పుడు ఒక మనిషిగా ఆమెకు కొంతధైర్యం వచ్చింది. తన గురించి ఆలోచించే మరో మనిషివున్నాడనే తృప్తికలిగింది.

ఇక్కడ జరుగుతున్న ప్రతివిషయాన్నీ జైలు జవానులు గమనిస్తున్నారు. ప్రతిచర్యనీ పొల్లు పోకుండా పోలీసు స్టేషనుకు చేరవేస్తున్నారు. జైల్లో వారిరివురిమధ్యా ఏం జరుగుతున్నదీ పోలీసుస్టేషన్లో తెరమీద సినిమారీళ్ళమాదిరి స్పష్టంగా కనిపిస్తున్నది.

* * *

రాత్రి రెండు గంటలుదాటింది.

ఇంకా సత్యసుందరం గదిలో టేబుల్‌లైటు వెలుగుతున్నది. అతను టేబుల్ ముందు కుర్చీలోకూర్చుని కాగితాలుతిరగేస్తూ ఏకదీక్షగా స్కెచ్ తయారుచేస్తున్నాడు. కాలం గడుస్తున్న కొలదీ అతనిలో ఉత్సాహం ఉరకలువేస్తు న్నది. ఆనందం అలలు అలలుగా పైకెగదోస్తు న్నది.

వరాలు జీవితకథఅంతా ఒక క్రమపద్ధతిలో పొందుపరుస్తూ రాశాడు. ఆమెపేరు, ఊరు, తల్లితండ్రులు, వారు గతించాక అమ్మమ్మ పెంపకం, చదువు, ఆస్తివివరాలు, డాఫర్‌తో పెళ్ళి, వెంటనే బ్రోతల్‌హౌస్‌లో అమ్మకం, అక్కడి నరకం తర్వాత పోలీసుస్టేషన్లో మజిలీ, అక్కడ కాకీదుస్తులనేతృత్వంలో ఊచకోత, అక్కడ సూరిబాబు మరణం.

ఇలా రాస్తున్నప్పుడు, అంతక్రితం అర్థంకాని కొన్ని విషయాలు చిక్కుముడివిప్పి నట్టు విడిపోయాయి. అంతకుముసుపు తెలు సుకోలేకపోయిన కొన్ని 'క్లూలు' బయటప డ్డాయి. ఇప్పటికి అతనికేం చెయ్యాలోఖచ్చి తంగా అర్ధమైపోయింది.

శ్రమఫలించినందుకు అతనెంతో సంతో షంగాఉన్నాడు. ఆనందాతిరేకంతో అతను ఆ రాత్రి నిద్ర కూడా పోవడంలేదు. కేసుకు సంబంధించిన యావత్తు రికార్డు క్షుణ్ణంగా సిద్ధపరుచుకున్నాడు. ఇక విజయంవైపు చూ పులు సారించాడు.

మర్నాడు కేసు విచారణకువచ్చింది. అయితే వరాలు ఆ కేసుకు హాజరుకాలేదు. ఆమె తరఫున సత్యసుందరం ఒక పిటీషన్‌ను కోర్టువారికి సమర్పించుకున్నాడు.

అందులో-

"ఇది పగడ్బందీగా నడుపబడుతున్న కుట్ర.

ముద్దాయిపేరు సూకరాజుకాదు, వరాలు. వయస్సు పదహారు సంవత్సరాలు, మైనారిటీ, వివాహిత, ఊరు మానాపురం, భర్త పోలీసుస్టే షన్లో ఇన్ఫార్మెంటు, బ్రోతల్ హౌసులో డాఫర్ అయిన దానువురఫ్ అప్పిగాడు. పెళ్ళాడింది

వాడుకాగా అమ్మింది నూకరాజు కంపెనీకి.

నూకరాజు అనే ఆమె బ్రోతల్‌కంపెనీ యజమానురాలు. ఆమె చేతికింద ఇప్పటికి కొన్ని వందలకన్నె జీవితాలు బూడిదగా మారిపోయాయి. ఆమె పేరు మీద కొన్ని వందలకేసులు రికార్డుచేయబడ్డాయి. ఆ కేసులు రద్దుచేయడానికీ, ఆ రికార్డులు మాఫీచేయడానికీ వరాలును ఎరగా ఉపయోగించుకుంది. పోలీసులకు వరాలును ఆహారంగావేసి తన పాపాలన్నీ వరాలు మీదకు త్రోసి తాను తప్పుకోచూసింది. ఇందుకు పోలీసులే నూకరాజుకు వారధిగా ఉపయోగపడ్డారు..

వరాలు పోలీసుస్టేషన్లో పోలీసుల చేతనే రేప్‌చేయబడింది. అందుకు ఒకేఒక్కసాక్షి రిక్షా కార్మికనాయకుడు సూరిబాబు. అయితే ఆ సాక్ష్యం కూడా లేకుండాచేయడానికి అదేరాత్రి అతణ్ని హత్యచేసి అదే రాత్రి శవాన్ని పోలీసు వ్యాన్‌లోనే తీసుకువెళ్ళి సముద్రంలో పారవేయడం జరిగింది.

ఇది సామాన్యమైన బ్రోతల్‌కేసులా బయటికి కన్పించినా ఒక హత్యాకేసు ఇందులోఇమిడివుంది. గౌరవనీయులైన కోర్టువారు దీనిమీద జ్యుడీషియల్ విచారణ జరపాల్సిందిగా అభ్యర్థిస్తున్నాను. ఇట్లు విధేయుడు సత్యసుందరం''

ఈ కేసు తన పరిధిదాటిపోతున్నందుకు మేజిస్ట్రేటుగారు విచారించారు. అయినా ఈ కేసు అనుకోని మరిన్ని మలుపులు తిరుగుతున్నందుకు మరింత ఆసక్తిని కనపరుస్తూ ప్లీడరు సత్యసుందరాన్ని అభినందించారు.

కేసు సి.బి.సి.ఐ.డి.కి అప్పచెప్పబడింది.

దీంతో పోలీసు వర్గాల్లో కలకలం బయల్దేరింది. ఇప్పుడు తామేంచేయాలో వారికి బోధపడలేదు. ఇది ఇలా జరగకుండా, ఇంతవరకూ సాగదీయకుండా ముందే ఎందుకు నిరోధించలేకపోయామా అని వారిప్పుడు తెగబాధపడిపోతున్నారు.

సి.బి.సి.ఐ.డి. తన ఇన్వెస్టిగేషన్ ప్రారంభించింది. వారికి దగ్గరుండి సత్యసుందరం తన సహకారాన్ని అందించాడు. వారి తమ కార్యక్రమంలో దగ్గరుండి మరీ ఆమె సొంతగ్రామస్థుల దగ్గర్నుంచి, ఆమె మీద స్వారీచేసిన విటులవరకూ అందరితో సాక్ష్యంఇప్పించాడు. వార్ని ఆయావ్యక్తులవద్దకు స్వయంగా తీసుకువెళ్ళాడు. మరి కొందర్ని వారివగ్గరికే తీసుకువచ్చాడు. ఇంత శ్రమ తర్వాత వారిపని సంతృప్తికరంగా ముగిసిపోయింది.

సత్యసుందరం పట్టుదల, కార్యదీక్షలవలన పోలీసులు ఎన్ని అడ్డంకులు కల్పించినప్పటికీ, మోకాలు అడ్డంపెట్టినప్పటికీ సి.బి.సి.ఐ.డి వారి పరిశోధనా ఫలితం సత్యసుందరం ఆశించినవిధంగానే తుదిరూపానికొచ్చింది..

మూడు నెలల అన్వేషణ, పరిశోధన తర్వాత వారొక రిపోర్టు తయారుచేసారు. ఆ రిపోర్టు ఇప్పుడు పరిశీలననిమిత్తం, తీర్పునిమిత్తం జిల్లా జడ్జిగారిసమక్షంలోవుంది. వారు ఆ కేసుపరిశీలనకు ఉపక్రమించారు.

ఆయన పేరు శ్యామసుందర్. ఆయన స్నేహితులు ఆయన్ని ముద్దుగా 'శ్యామ్' అని దగ్గరబంధువులు ఆదరంగా 'సుందరం' అని పిలుస్తారు. అలాపిలవడం ఆయనకు ఎంతో సంతోషాన్ని కలిగిస్తుంది. అలా పిలుస్తున్న ప్రతిసారీ తన హోదాకు తగినగుర్తింపుగా, తన వ్యక్తిత్వానికి ఇస్తున్న గౌరవంగా ఆయన భావిస్తారు.

తీర్పు వెలువడే వరకూ వరాలును జైలు రిమాండ్‌లోనేవుంచేటట్టు ఆదేశాలు జారిచేసారు. ఆదేశాలు దారి ఆదేశాలది. పోలీసులుదారి పోలీసులదీ అయింది.

★ ★ ★

అది ఒక క్లబ్బు.

ఖరీదైన మనుషులు సరదాగా వేలు, లక్షలు పోగొట్టుకోవడానికి, రాబట్టుకోవడానికి నెలవైన స్థలం. నిషూచీగా గంటలతరబడి మందు కొట్టడానికి అనువైన ప్రదేశం. ఒక్కముక్కలో చెప్పాలంటే అది ఒక పానశాల. అది ఒక క్రీడామందిరం. అది ఒక జూదగృహం.

పెద్ద ఉద్యోగులు, ఆఫీసర్లనుంచి వ్యాపారస్థులదాకా బంగారుపిచ్చుకల కలయికకు కేంద్రమది. డబ్బు ఎలా ఖర్చుచేయాలో తెలియని పెట్టిపుట్టినవారి ధ్యానమందిరం అది.

అలాంటి క్లబ్బులో జిల్లాజడ్జి శ్యామసుందర వరప్రసాద్ బిలియర్డ్స్ ఆడుతున్నారుగానీ ఆ ఆటలో లీనం కాలేకపోతున్నారు. ఆ ఆట ఇచ్చే

వేడుకను అనుభవించలేకపోతూ అసీజీ ఫీల వుతున్నారు. ఆ ఆట వారి మనసుని రంజింప చేయలేకపోతున్నది.

నిజానికది వారి ఫేవరేట్‌గేమ్ కాదు. వారి సరదా అసలు కార్డ్సులో వుంది. కాని అది ఇప్పుడు డేంజర్ ఆట. ఒక ముక్కబదులు ఇంకోముక్క తీసినా వేసినా వందలు, వేలు వదుల్తాయి. మరందుచేత ఒళ్లు, ఆస్తి దగ్గర పెట్టుకుని వారు ఆ ఆటజోలికి పోలేదు. తర్వాత వారి సెకండ్ ఇంట్రెస్ట్‌గేమ్ చెస్. ఖర్మకాలీ ఇదీ అంతే. దీనిక్కూడా మైండ్ కాన్సంట్రేషన్ కావాలి. లేకపోతే ఒకర్ని చంపబోయి మరొకరి చేతిలో చస్తారు. ఆ తలనొప్పి ఎందుకనుకుని ఈజీగా వుంటుందని చెప్పి వారు బిలియర్డ్స్‌లోకి రంగప్రవేశం చేశారు.

ఏంపోయింది... గురిచూసి కొట్టడమేకదా. అయినా అందులో కూడా ఇంట్రెస్టు చూపించలేకపోతున్నారు.

మొన్ననగా ఇన్వెస్టిగేషన్ కోసం వెళ్లిన డి.ఎస్.పి. నిన్నొస్తానని చెప్పి, ఈరోజు కూడా రాలేదు. ఇన్వెస్టిగేషన్ కొనసాగిందో లేక ఏదేనా క్యాంపు చెక్కేశాడో విషయమేమిటో తెలియదు.

ఈ రకమైన అనుభవం వారికదీ కొత్తదికాదు గాని, దీన్నొక అవమానంగానూ, ఛాలెంజ్‌గానూ తీసుకోవడం మాత్రం ఇదే మొదటిసారి.

కష్టాలనేవి రకరకాలు. అన్ని కష్టాలు ఒకలాంటివి కాదు. అందరికీ కష్టాలూ ఒకరకంగా వుండవు. 'పిత కష్టం పితది'లాగానే మర్రిచెట్టు కష్టం మర్రిచెట్టుకి వుంది. పేదవాడి కష్టం మర్రిచెట్టుతో ముడిపెట్టరానటువంటిది.

డబ్బు పారేస్తే వాడి కష్టాలు హుష్‌కాకీ అని ఎగిరిపోతాయి. డబ్బులేక వాడిబాధ. కాని డబ్బున్నవాడి కష్టాలు ఆ డబ్బులేనివాడితోనే ముడిపెట్టివుంటాయి. నోట్లకట్టలే పురిచుట్టుకుని వురితాడులవుతాయి. ఇచ్చిన రూపాయలే నమ్మెటలుగా మారి నెత్తిన బాదుతాయి. బాకులుగామారి గుండెలు తీస్తాయి.

ఇన్‌కంటాక్సువాళ్లు ఎప్పుడొచ్చి రైడ్‌చేస్తారోనని భయం. విజిలెన్స్‌వారు పట్టుకుంటే ఏంచేయాలని బాధ. అన్నిటికీమించి దొంగలు దోచేసి ఎప్పుడు ప్రాణానికి ముప్పు తెస్తారోనని దిగులు. పోనీ ఎవరిపేరనైనా బినామీగా బ్యాంకులాకర్లలోనూ, ఫిక్సడ్ డిపాజిట్లలో దాస్తే అవి తిరిగి వస్తాయో రావోనని అనుమానం.

ఇవి చాలవన్నట్టు ఇన్ని బాధలమధ్య, కష్టాల నడుమ పెళ్లాం ఇంట్లో వుంటుందో, క్లబ్బులూ, పికార్లూ, షాపింగులు పేరు చెప్పి, హైసొసైటీ కల్చరు ఎకౌంటుకింద ఎవడి పక్కనైనాచేరి కులుకుతుందేమోననే అనుమానం. చిన్నపురుగుకింద గుండెల్ని దొలుస్తుంది. కూతురు ఎవ్వడినైనా లవ్వాడి, మనసు జార్చేసుకుని ఆ జారిపోయిన మనసుని తిరిగి తీసుకోలేక హిప్నాటిజం చేసినట్టు వాడి మోసంలో పడిపోయి డబ్బు, బంగారం, దొంగచాటుగా రవాణాచేసి ఇల్లు ఎక్కడ గుల్లచేస్తుందోనని భయం. లేకపోతే విస్తరిస్తున్న శృంగార సామ్రాజ్యాన్ని కడుపులో దిగమింగి, అది పెరిగి పెద్దదైనప్పుడు ఎప్పుడో ఒకప్పుడు నడిరోడ్డుమీద పరువుఫలకం ఎక్కడ పగలకొడుతుందోనని బెంగ. ఎక్కడ పరువుచిహ్నాలు చెల్లాచెదరై, నడివీధిలో నవ్వులముద్దలై ఎక్కడ మొగాన కొడతాయోననే బెదురు.

ఈ రకమైన కష్టాలు లేనివాడికి వుండవు. కలిసుంటే ఎవర్నీ లెక్కచేయకుండా పాలాల గట్లమీద కలిసుంటారు. విడిపోతే చెప్పాపెట్టకుండా లేచిపోతారు. కృతకమర్యాదలు, సమాజ భేషజాలు వారిని తాకను కూడా తాకవు. ఉన్నంతసేపూ అరమరికలు లేని ఆనందం! విడిపోతే నిర్భయంగా ఎవరిదారి వారిది.

కాని సమాజపు పరువూమర్యాదలు డబ్బున్నవాడిని కట్టిపడేస్తాయి. మనసుని చంపేస్తాయి. లేనిపోని భేషజాలతో ఊపిరాడక ఉక్కిరిబిక్కిరవుతాడు. ఈ సమస్యలు కలవాడి కాలు నిలవనివ్వవు. ఆరాటంతో గుండె కొట్టుకొంటుంది. అదెప్పుడు ఆగిపోతుందో తెలియదు. ప్రతి చిన్న విషయమూ అనుమాన పిశాచమంత పెరిగి, వేధించి వేధించి పిసికిపిసికి పారేస్తుంది.

ఇలాంటి కారణాలచేత ఒక్కోసారి అంతటివారు కూడా ఇంతటి సంపదా వైభవం, హోదా, పలుకుబడి వుండి కూడా ఏమీ చేయలేకపోతున్నామన్నమని చెప్పి బాధపడిపోతూ ఇబ్బందిపాలవుతుంటారు.

కష్టాలు అందరికీ వస్తాయి. కాని ఇలాంటి





కష్టాలొస్తే ఎంతటి వారైనా ఎలా భరించగలరు? సామాన్యులు వీటిని తట్టుకోగలరా? వారు కాబట్టి, చదరంగంలో సిద్ధహస్తులు కాబట్టి, ఏదో పథకం రూపొందించారు కాని, మరొకరైతే ఏమైపోవాలి. 'పోపోబే బచ్చా' అని వారిలా అనగలగడానికి ఎవరికైనా ఎంత ధైర్యం కావాలి. ఎంత సత్తా వుండాలి.

ఒకనాడు అల్లప్పుడెప్పుడో శనిమహర్దశజ్వాజ్వల్యమానంగా వెలిగిపోతున్నపుడు. అల్లారు ముద్దుగా చూసుకునే తన పద్మినికారు తీసుకుని బీచ్‌రోడ్డుమీద స్వయంగా నడుపుకుంటూ షికారు వెళ్లారు.

రోడ్డుకు బాగా పక్కన ఒక ఎత్తయిన స్థలంలో కారు ఆపి అద్దాలు మీదికెత్తి, రెండు డోర్లకు తాళాలువేసి వచ్చి సముద్రానికెదురుగా ఒక ఎత్తయిన దిమ్మమీద కూర్చున్నారు. సముద్రపు అలలమీదినుంచి వచ్చే కల్తీలేని చల్లనిగాలి గుండెనిండా పీల్చుకున్నారు.

తర్వాత ఇష్టపడి కొత్తగా కొనుక్కున్న హేండ్ స్టిక్‌ను విలాసవంతంగా వూపుకుని, సముద్రపు అలలకు దగ్గరదగ్గరగా ఇసుకతిన్నెల మీద కొంతదూరం నడిచి, ఇక ఆరోజుకు అది చాలుననుకుని చాలించేసి, తిరిగి కారు దగ్గరికి వచ్చారు. కారును ఎవరూ ఏమీ చేయలేదని నిర్ధారించుకున్నాక ఇంటిముఖం పట్టారు. కారు నెమ్మదిగా జారుతున్నది.

అప్పుడు చిరుసాయంసంధ్య. శోభనం గదిలోకి తీసుకువెళ్తున్న కొత్త పెళ్లికూతురులా వయ్యారాలు ఒలకబోస్తూ, అలవోకగా నును సిగ్గుగా, మెల్లమెల్లగా కిందికి జారుతున్నది. ఒక అవసరంకోసం ప్రత్యేకంగా డిజైన్ చేయబడ్డ చీరకట్టుకున్న మోడల్‌గర్ల్‌లా, ఆకాశం వింతవింత అందాల్ని తెరలుతెరలుగా ఒలకబోస్తూ రంగులలో నాసాటి వేరెవ్వరు అన్నట్టు సుమనోహరంగా వుంది.

అప్పుడే- అవును సరిగ్గా అప్పుడే...

క్రమపద్ధతిలో గుబురుగుబురుగా పెరిగిన అశోకవృక్షాలు, క్రమశిక్షణకు పెట్టిన పేరుగా నిలిచిన వీరసైనికులులా ప్రహరీచుట్టు నలువైపులా కాపలాకాయగా సువిశాల స్థలంలో ఒక పద్ధతి ప్రకారం అందంగా తీర్చిదిద్దిన ఒకతోట ఆ రోడ్డుకు పక్కనే వున్నది. సుమారు ఫర్లాంగు పొడుగువరకూ ఆ తోట ప్రహరీగోడ రోడ్డుకు ఆనుకునే వుంటుంది.

ఆ తోటలోపలినుంచి గుర్రపుడెక్కల చప్పుడు వినిపిస్తుంది. ఆ చప్పుడు లయబద్ధంగా గాకుండా, ప్రభుత్వ బహుమతి పొందిన అనమర్థవిధ్వాంసుడి మృదంగనాదంలా మోటుగా, మొరటుగా వుంటుంది.

అప్పటికి జడ్జిగారి కారు ప్రహరీగోడ ప్రవేశ ద్వారం వద్దకు వచ్చింది. బ్రేకుమీద కాలువేసి నొక్కినట్టు అసంకల్పితంగా అక్కడ ఆగిపోయింది.

ఆ గేటులోంచి తోట లోపలికిచూస్తే-

అబ్బ! అదేమిదృశ్యం,

కళ్లున్నవాడికి ఇంద్రధనుస్సులా, రంగులవైభవంతోవుంది.

మనసున్నవాడికి మనోహరదృశ్యకావ్యంలా సుమధురంగావుంది. అత్యంత ప్రతిభావంతుడు సర్వసమర్థవంతంగా చిత్రించిన పెయింటింగ్‌లా వర్ణ సమ్మోహనంగా వుంది. ఎక్కడుండాల్సిన రంగుముద్దలు అక్కడవున్నట్టుగా వుంది.

తోటనిండుగావుంది. తోటమాలీల సుశిక్షణలో పెరిగి కాచిన కాయలతో, అరవిచ్చిన పువ్వులతో పుష్టిగా, తృప్తిగా, కనువిందుగా వుంది. ఎత్తయినచెట్లతో, విస్తరించిన వృక్షాలతో చల్లగా, అందంగా వుంది.

గుర్రం ఎత్తుగావుంది. బాగా మేతమేసి బలంగావుంది. గోధుమరంగు ఛాయతో, అక్కడక్కడా నల్లని పెద్దా, చిన్నా మచ్చలతో, మాలిష్‌చేసిన చర్మంతో మెరుస్తూవుంది. యజమాని ఆజ్ఞ ఇవ్వడమేతరువాయి పరుగెత్తడానికి, గెంతడానికి, ఎగరడానికి సంసిద్ధంగా ఉరకలువేస్తూ ఉత్సాహంగా పిలుపుకోసం ఎదురు చూస్తూవుంది.

ఆగుర్రంమీద

ఆపిల్ జ్యూస్‌మాత్రమే తాగి పెరిగినవారిలా కనుపించే అరముగ్గిన ఆపిల్‌రంగు జంట ఒకటి కూర్చునివుంది.

అంతవరకూ గుర్రంమీద తోటంతా తిరిగి తిరిగి అలసిపోయి, చెమటపట్టి, విరామంకోరుతూవున్నట్టుగావుంది. ఆ జంట! అయినా అందంగావుంది. ఆ ముఖాలలో సంతృప్తిరేఖలు కొసమెరుపులా వున్నాయి.

ఆ తోటమధ్యలో ఒక చిన్నగాజు బంగళా వుంది. ఆ బంగళా పూర్తిగా అద్దాలతో చిన్నది గావుంది. ఆ బంగళాముందు విశాలమైన వరండావుంది. ఆ వరండామధ్య రంగు రంగుల బుల్లి ఫౌంటెన్.

ఆ ఫౌంటెన్‌కిరువైపులా, రోడ్డుకి అభిము ఖంగా, తలకింద దిళ్ళు అమర్చిపెట్టుకుని, కాళ్ళు బార్లాచాపుకునేందుకు వీలుగా పొడ వాటి సోఫాలున్నాయి. ఆ సోఫాలముందు ఒక టీపాయ్, దానికింది అరలో నేతిలోవేయించిన జీడిపప్పు, కోడి వేపుళ్ళు ఒక పక్క, ఆరోజు దినపత్రికలు, వార, మాసపత్రికలు వున్నాయి. టీపాయ్‌మీద నోరూరించే ఆపిల్స్, ముగ్గడానికి సిద్ధపడుతున్న జామపళ్లువున్నాయి. మరో అంచున ఎర్ర అరటిపళ్లు పెద్దవివున్నాయి. అన్నిటిమీద రేపర్ నేప్‌కిన్స్ మూతలువు న్నాయి.

వాటిమధ్య చుక్కల్లో చంద్రుడిలా, గోపికల మధ్య గోపాలుడిలా 'రాయల్ శాల్యూట్' దానికి రువైపులా బాడీగార్డ్సులా, అరుదుగా దొరికే కెనేడియన్ విస్కీ, ఫ్రెంచ్‌షాంపేను వున్నాయి. బహుశా షాంపేను ఆమెకోసం కాబోలు అనుకు న్నారు జడ్జిగారు. వాటిపక్కన ఒక బకెట్‌లో ఐస్ క్యూబ్స్ వున్నాయి. ఆ టీపాయ్‌మీద శుభ్రంగా తోమి తుడిచిన ఇంపోర్టెడ్ గ్లాసులు, పింగాణిప్లేట్లు వున్నాయి. వాటిమీద యధాప్ర కారం పేపర్ నేప్‌కిన్స్ మూతలువున్నాయి.

గాజు బంగ్లాలోపల ఒకపక్కకు షన్‌సోఫా లు. మరోపక్క డబుల్‌కాట్ బెడ్. ఏసి చేసిన ఆగదిలో కలర్ టీవీ, ఫోను, గ్లాస్‌డోర్స్, గ్లాస్ విండోస్, అద్దాలు అన్నిటిమీదా సాటిన్ కర్టెన్లు వేలాడుతూవున్నాయి. ఆ శాటిన్ కర్టెన్లు బంగా రు రంగులోవున్నాయి. ఎరుపు, పసుపు కలిసి సూర్యుని ఆఖరికిరణాలు వాటిమీద ప్రతిఫ లించి మెరుస్తూ, పుప్పొడి అద్దిన పత్రంలా తళతళలాడుతున్నాయి.

బంగళాముందు ఇంపోర్టెడ్ ఎ.సి.బెంజికా రు ఆగివుంది. వంటకాలదగ్గర ఇద్దరు సర్వెర్లు, మెయిన్‌గేటుదగ్గర ఇద్దరు తోటమాలీలు పహా రావున్నారు. ఒళ్లంతా బొచ్చుతో, అక్కడక్కడా నల్లనిమచ్చలున్న తెల్లని కుక్కపిల్ల, అక్కడ తిరుగుతోంది. గోధుమరంగుతో ఎత్తుగా, భారీగా, అప్పుడే పుట్టిన గుర్రంపిల్ల సైజులో ఒక ఆల్సేషన్ వారిద్దరూ వున్న గుర్రంచుట్టూ తిరుగుతోంది.

అతను హైజంప్‌చేసినట్టు గుర్రంమీది నుంచి ఒక్కగెంతుగెంతాడు. కింద పచ్చిక మీద కాళ్లుదించి అంతలోనే స్ప్రింగ్‌యాక్షన్‌లా పైకిలేచాడు. కాళ్లు బలంగానేలమీద మోపి, నిటారుగా నిల్చుని చేతులు పైకిచాచి ఆమెను ఆహ్వానించాడు. ఆమె ఒక్కసారి ఇతణ్ని చూ సింది. ఇతను హుందాగా, హీరోలా నిలబడ్డా డు. ఆమెకు కొండంత భరోసాయిస్తూ వీరసైని కుడిలా ధీరోదాత్తంగా చూశాడు.

ఆమె ఒక్కసారి ఫక్కుమని నవ్వింది. ఆ నవ్వు చిలిపిగావుంది. అందులో చిన్నపాటి గర్వంవుంది, ధీమావుంది. ఆ నవ్వు మంచిము త్యాలు రాల్చి తేటవెన్నెల్ని పేర్చింది.

ఆమె అంతెత్తు గుర్రంమీదినుంచి రెండోకా లు ఇవతలివైపుకు తిప్పి సరిగా కూర్చుంది. ఆతర్వాత కిందికి ఏటవాలుగా ఒంగోని జా రింది. ఆమె చీర జీనుమీదినుంచి మెత్తగా కదిలింది. కాళ్లురెండూ బార్లాచాపి దగ్గరగా వుంచింది. చేతులు రెండూ విశాలంగాచాపి మీదికి నిలబెట్టింది.

అలా మెల్లమెల్లగా జారుతున్నప్పుడు, మేఘాలమీదినుంచి వెళ్ళిపోతూ పొరబాటున కాలుజారిపోయి, భూలోకంమీదికి పడిపోతున్న దేవకన్యలా వుందామె. ఆ చెట్లమధ్య ఒక లేతకొమ్మలా, ఆ రెమ్మలమధ్య, అపుడేవిరిసిన ఒక పువ్వులా ఆ ప్రకృతి సౌందర్యంలో కలి సిపోయి కదులుతున్న వనకన్యలావుందామె.

ఆమె కట్టుకున్న పాలిస్టర్ చీర లేతాకుపచ్చ లోవుంది. పెద్దపెద్ద పువ్వులు ముదురు రంగులో వున్నాయి. అదేరంగు ప్లైన్ స్లీవ్‌లెస్ జాకెట్టువేసుకుంది.

భుజాలవరకూ వేలాడుతున్న రాగిజుత్తు పొడిపొడిగా వుండి గాలికి సయ్యాటలాడుతూ బంగారుమేఘంలా కదలాడుతోంది. విసురు గాలికి తొలిగిపోయిన పైటకదులుతూ మేఘంలా వూగుతోంది. ఆపైట, ఈ కురులూ కలిసి గాలిలో తేలియాడుతున్నాయి. అలలు అలలుగా ఎగురుతూ యుగళగీతం పాడుతు న్నది.

కాళ్ళు నున్నగా, పిరుదులు వెడల్పుగా,




నడుము సన్నగా, ఛాతి విశాలంగా, మెడ నునుపుగా, ముఖం కోలగా, అలా గాలికి లంగా ఎగురుతూ, చీరవూగుతూ, పైటతొలగి గుర్రం పాదినుంచి కిందికి దిగుతూన్న ఆమె దివినుంచి భువికి జారుతోన్న అప్సరకాంతలా వుంది.

ఈ దృశ్యం హాలీవుడ్ సినిమాలో లవ్‌సీన్లా వుందన్జెప్పి జడ్జిగారు కుతూహలంగా కారువ క్కకుతీసి, క్యూరియాసిటీతో చూస్తున్నారు. వారి కంటికి ఆ యువతీయువకులిద్దరూ యాడ్‌ఫిలిం కోసం కెమేరాముందు ఫోజులిస్తు న్న మోడల్‌గర్ల్, ఆమె బోయ్‌ఫ్రెండ్‌లా కన్పించారు.

అలా దొంగచాటుగా చూడ్డం తప్పు, చట్టరీత్యా నేరం అనేది వారు ఒక్క క్షణం మరిచి పోయి శృంగార రాముడే అయిపోయారు. వయసు దేహానికేగాని మనసుకు కాదు అని సరిపెట్టుకున్నారు.

కాని వారిలో ఆనందం ఎంతోసేపు నిలవలేకపోయింది.

వారిద్దరూ నవ్వుకుంటూ, ఒకరినొకరు తోసు కుంటూ, ఒకరిచెంపల్ని ఒకరు స్పృశిస్తూ దగ్గ రౌతున్నారు. కిందికిదిగిన ఆమెను రెండుచేతు లతోనూ అతను పట్టుకున్నాడు. ఒక్కసారి ఆమె కిందికివాలి, అతని రెండు చేతులమ ధ్యా చిక్కుకుని ఒక్క వూపువూగి ఆగిపో యింది. తర్వాత రెండుచేతులతోనూ అతని మెడని కౌగలించుకుంది. అతను అలా ఆమెను చేతులమీదనే వుంచి గాల్లో వూపాడు. ఆమె అతని చేతులమీదినుంచి జారికింద నిల్చుంది. తర్వాత ఆమె అతడిని కిందపడ వేసి అతని ఛాతిమీద వాలిపోయింది.

తర్వాత ఇద్దరూలేచి బట్టలు దులుపుకుని బంగ్లావైపు నడిచారు. ఆమె అతని నడుంచుట్టూ చేతులువేసి, శిరస్సుతో అతని భుజానికి రాస్తూ అనుసరించింది. బొచ్చుకుక్క ఆమెను, అల్సేషన్ అతణ్ణీ అనుసరించాయి.

ఇద్దరూ రెండు సోఫాలమీదా కూర్చుని విశాలంగా కాళ్ళు చాపుకున్నారు. ఒక సర్వర్ టంచన్‌గా పెగ్గు విస్కీగ్లాసులోపోసి సోడా కలిపి ఐస్‌ముక్కలువేసి గ్లాసుతెచ్చి అతడికి అందిచ్చాడు.

అతడు ఆ విస్కీని సిప్‌చేస్తుండగా ఆమె కాజూనట్స్ ఒక్కొక్కపలుకూ నోట్లోవేసుకుంటూ గోముగా అడిగింది– "రాజ్... ఈ డ్రింకు మానెయ్యకూడదా?"

అతను చిలిపిగా కళ్ళు గిలికాడు "తప్ప కుండా! ఇది అలవాటయిందీ నీవియోగం తర్వాతకదా. నీ ఎడబాటు భరించలేకనేకదా. దీనికి నేను దాసుణ్ణి కావాల్సివచ్చింది. ఇకను వ్వుండగా దీని అవసరం నాకేమిటి! అసలు నువ్వే ఒక పెద్ద డ్రింక్‌వి! నీమత్తును దగ్గరపె ట్టుకుని ఈ చిన్న మత్తును దగ్గరకుచేరని స్తానా"

"ఛీ... ఫో" అని ఆమె బుంగమూతిపెట్టి అలిగింది. అతను ఆమె ముక్కును చేత్తో వూపి పెద్దగా నవ్వాడు "ప్రమీ... నా ప్రమీ" అంటూ వినోదించాడు.

ఆ నవ్వుకు చెట్లు కదిలాయి. ఆకులు అల్లల్లాడాయి. ఆమె ఇటుతిరిగి వారదేసి కళ్లతో వింతగాచూసింది. అప్పుడు గాలి ఆమెకు వింజామరవీచింది. ఆకు సందు ల్లోంచి కొమ్మలమధ్య కన్నాల్లోంచి సూర్యుని సాయంత్రపుఎండ ఆమెను సమీపించి తనివి తీరా ఒక్కసారి చూసి పలకరించింది.

సరిగ్గా అప్పుడే ఆ వెలుగు ఆమెను చూ సినప్పుడు, పలకరించినప్పుడు, ఫ్లాష్‌కొట్టిన పోజులా ఆమె స్పష్టంగా అతిస్పష్టంగా జడ్జి గారి కంటికి కనిపించింది. కనిపించి ప్రళ యంపుట్టించింది.

సరదా పుట్టించాల్సిన ఆ సీను వారికి ఒక్క షాకిచ్చింది. షాకంటే షాకుకాదు... అసలు సిస లైన కల్తీలేని కరెంటుషాకు.

అది సాయంత్రపు నీరెండే అయినప్పటికీ, వేసవికాలపు మిట్టమధ్యాహ్న మార్తాండుడు చండప్రచండతీవ్రతతో, అతిశక్తివంతంగా ము ఖానగుద్దినట్టయింది. సూర్యుడు మండిపోతూ నిప్పుల వర్షం రాల్చుకుంటూ ఒక్కవూపున ముఖానగుద్ది, ఆ దెబ్బకు అతను కూడా ముక్క ముక్కలై సముద్రం మధ్యరాలిపోయి ఇంకి పోయి కలిసిపోయినట్టయింది. ఆధాటికి తట్టు కోలేని సముద్రం, వెయ్యిపిడుగుల శబ్దంతో మెరుపు వెల్లువలు కుమ్మరిస్తూ, పాతాళ గంగని ఆకాశపు అంచుల దాకా తీసు

కుపోయినట్టయింది. అప్పుడు భూకలపం పుట్టింది.

ఆ దెబ్బకి కిందపడిపోకుండా తట్టుకోడం జడ్జిగారికి అసాధ్యమయింది. నిజం నిప్పులా గరళంలా కంఠం మధ్యనే వుండిపోయింది. గొంతుకాలిపోతున్నది. గుండె వుండయిపోతున్నది. శరీరం కుతకుతవుడికిపోతున్నది.

ఆ కుసుమ కోమలి ఎవరోకాదు— నవవధువుగా తనింట అడుగుపెట్టిన ఆ సుందరాంగి, తనకి వంశోద్ధారకుడిని ప్రసాదించాల్సిన కోడలు. ఒక్కగానొక్క కోడలుపిల్ల.

మరి అతనెవరు? ఇంతగా ఆమె హృదయానికి హత్తుకుపోయిన ఆ వక్షపీఠం ఎవరిది?

అక్కడితో వారి క్యూరియాసిటీ అంతా చచ్చుబడిపోయింది. ఘనత వహించిన వారి వంశవృక్షంయొక్క మహత్తు యావత్తూ ఫ్లాష్‌కొట్టి వెండి తెరమీద ఆవిష్కరించినట్టు, జ్ఞాననేత్రం ముందు అంచెలంచెలుగా సాక్షాత్కరించింది.



సదరు న్యాయమూర్తిగారి తండ్రి నామధేయం పరంధామయ్య. శ్రీ రామచంద్రమూర్తికి ఒకే భార్య ఎలాగో వీరికీ అంతే. దీనికి సవాలక్ష కారణాలున్నాయి. ముఖ్యంగా ఆయన పిరికితనం ఒక కారణం కావొచ్చు. సభ్యసమాజంలో తనస్థానం దిగజారిపోతుందన్నది మరో కారణం కావొచ్చు. అన్నిటికీ మించి ఘోరాతిఘోరమైన జబ్బులు తగులుకుని వంశం నిర్మూలమైపోతుందన్నబాధ అతి పెద్ద కారణం కావొచ్చు. కారణమేదైనా కాని వ్వండి— ఆయన మాత్రం పరస్త్రీ స్పర్శఎరగనివాడు. స్వచ్ఛమైన, నిఖార్సయిన ఏకపత్నీవ్రతుడు.

అటువంటిమహోదాత్తుడు ఒక శుభోదయాన "తండ్రీ" అని తనయుణ్ణి పిలిచారు. పిలిచి అరటిపండు వొలిచిపెట్టినట్టుగా పరంధామయ్యగారి చెల్లెలి కూతుర్ని ఈయనగారికివ్వబోతున్నట్టు చెప్పారు.

అప్పుడు సదరు శ్యామసుందర్ కళ్ల ముందు సూర్యగోళం పగిలి కళ్ళల్లోకి దూసుకుపోయినట్టయింది. ఆ సుందరాంగి ఆటుపోటులందు రాటుదేరిన నెరజాణగా పేరుబడసియున్నది.

తండ్రి ఆ సుకుమారిని తనకు కట్టబెడుతున్న కారణం ఆ పడుచు పరంధామయ్యగారి ఏకైక సోదరికి ఒక్కగానొక్క తనయకావటమే. పెళ్లికి ముందు మేనకోడలు కాలుజారింది. వీధినిపడితే చెల్లెలి బతుకు బజారుపాలవుతుంది. ఆమె వెనక చెదిరిపోని బోలెడు ఆస్తి వుంది. ఆ ఆస్తిని మన భవిష్యత్తుకి సోపానాలు పేర్చుకుంటూపోతుంది.

సోపానాలమాట దేవుడెరుగు-- ఈ గరళం మింగడానికి శ్యామ్‌గారికి బ్రహ్మప్రళయమైంది.

సరిగ్గా ఇలాంటి విషమపరిస్థితి దాపురిస్తుందనే ఈ విపత్కరకాలంలో సంధించడానికి ఒక తురుపుముక్క పరంధామయ్యగారు అట్టే పెట్టుకునున్నారు. సరియైన అదనుచూసి ఇప్పుడు దాన్ని వదిలారు.

భగవానులైన శ్రీకృష్ణపరమాత్ములవారు మూర్ఖుడైన అర్జునుడికి జ్ఞానామృతం ప్రసాదించిన భగవద్గీత ప్రభోదించినట్టు ఆయన ఈయనగారికి జన్మరహస్యం వెల్లడించారు.

మనం పూజించే పురాణపురుషులు వారి అసలు తండ్రులకి పుట్టలేదని క్లూలాగారు. హిట్లర్ చెప్పినట్టు బలమైన జాతిగా మనగలగడానికి, మెదడు చురుకుగా పనిచెయ్యడానికి ఇదే సరిమైన పద్ధతి అని కూడా బోధించారు. పైగా ఎవడు ఎవడికి పుట్టాడో ఆ పుట్టిన వాడికి తెలుసునా, అలా అని వాడి అమ్మగ్యారంటీ ఇవ్వగలదా అని కూడా ప్రశ్నించారు.

బాగా ఆలోచించి చూస్తే ఇది ఉభయతారకంగా వుంటుందని కూడా శెలవిచ్చారు. ఒకటి చెల్లెలి పరువు కాపాడినట్టుంది. ఆమె మరింత

ఎక్కువ విశ్వాసాన్ని కృతజ్ఞతను చూపించి, మరిన్ని నజరానాలు సమర్పిస్తుంది. రెండు, ఆమె డబ్బు చూసి మొగం తిరిగి ఎవడేనా ఎగరేసుకుపోతాడు. ఆ ఛాన్సు పరాయివాడికి దక్కకుండా ముందుగా ఆ పని మనమే ఎందుకు చేయకూడదు. బంగారానికి తావిఅబ్బినట్టు, మన పదవులకు పరపతి కూడా జోడించినట్టవుతుంది అని కూడా తెలవిచ్చారు.

అలా కొన్ని కఠిన సత్యాల్ని, మర్మగర్భంగా, వేదాల నుండి పురాణాల నుండి చరిత్రల నుండి సంగ్రహించినపిమ్మట ఇంచుకజ్ఞాన శీలుడిని చేశారు. అలాంటివే మరికొన్ని ఆధునిక సూక్తుల్తో జ్ఞానబోధచేసి, తనయుడి మార్పుని, మనసారా అభినందించి, ఆ ఘనకార్యమేదో తన చేతుల మీదుగా అయిందనిపించి నిశ్చింతంగానిట్టూర్చారు పరంధామయ్యగారు.

అది మొదలు శ్యామసుందర్‌కి దశ అందుకుంది. బతుకు మూడు కేసులు, ఆరు విజయాలుగా వర్ధిల్లింది. అంచెలంచెలుగా జిల్లా జడ్జి పదవి వరించింది. అనుకోని అవకాశాలు అందలం ఎక్కరాగా సమస్త సదుపాయాలూ సమకూడాయి. సంఘంలో హోదా, పలుకుబడి వెనక అన్నీ మాసిపోయాయి. చెరిగిపోయాయి.

బతికివున్నంత వరకూ జడ్జీగారి సతీమణి ఆ నగర ఆడసింహాల అంతర్జాతీయానికి జోనల్ ఛైర్మన్. ఫంక్షన్స్‌లోనూ, మీటింగుల్లోనూ ఆవిడే రిబ్బను కత్తిరించాలి. బహుమతులు పంచిపెట్టాలి.

ఇప్పటి అంతస్తుముందు వెనకటిగాథలన్నీ ఎండకి కరిగిపోయిన మంచుముద్దల్లా నీరుగారిపోయాయి. డబ్బు, హోదా, పరపతీ ముందు సవాలక్ష దుర్గుణాలు తుడిచిపెట్టుకుపోయాయి.

ఇలాంటి అవలక్షణాలు ఏవీలేకుండా తన వంశవృక్షాన్ని తీర్చిదిద్దాలనీ, కోడలు పిల్ల, అకళంక పావనుడైన వారసుణ్ణి ప్రసాదించాలని, ఆ ప్రకారంగా వంశగౌరవం పునరుద్ధింపచేయాలని ఎంతో ఆశపడ్డారు. కలలుకన్నారు. గుణం ఎక్కువైన పేదింటి పిల్లను కోడలుగా తెచ్చుకోవాలని సైతం అనుకున్నారు.

కాని ఇక్కడ కూడా వేషజం అడ్డొచ్చింది. అంతస్తు, హోదా ఎదురు తిరిగాయి. సొసైటీ క్రూరంగా ఛాలెంజ్ చేసినట్టనిపించింది. అప్పర్ క్లాసు మనుషులందరూ హేళన చేసినట్టు భావించారు. వారి మధ్య, హైసొసైటీ నాగరిక పరిధిలో తర్ఫువస్తాయి పిల్లతో తమ కుటుంబం ఇముడలేక ఉక్కిరిబిక్కిరౌతున్నట్టు ఎంచి ఊపిరి సలుపుకోలేకపోయారు. గుణం ఎవరు చూసారు? తళుకుబెళుకు సమాజంలో డబ్బు పంచులురాలాలిగాని ఒకవేళ చెడిపోయినా అదోరకం ఎడ్వంచర్. వ్యాపారాభివృద్ధికి అడ్డదారి.

గత్యంతరంలేని పరిస్థితుల్లో, ఈ సంబంధం చేసేసారు. ఈ పిల్ల తన బాల్యస్నేహితుడి ఏకైక సంతానం. చిన్నప్పటినుంచి ఎరిగుండటంవలన అనుమానించడానికి ఆస్కారం లేకుండాపోయింది. పిల్ల బుద్ధిమంతురాలని ముందే తెలుసు. ఇక సమస్యే లేదు గనక పెళ్లి జరిగిపోయింది.

ఇంతచేసినా వ్రతభంగం తప్పలేదు. ఇప్పుడీ పిల్లకి ఇంత చిన్నవయసులోనే ఒక లవ్వు! దానికి జతగా ఒక లవరు!

ఇప్పుడు తన వంశవృక్షం యొక్క మహోన్నత వైభవాన్ని వెనక్కి తిరిగి చూసుకుంటె, తన తండ్రి సంగతేమోగాని, తాను తనతండ్రికి పుట్టినవాడుకాడు. తన కొడుకు తనకి పుట్టలేదు. తనకుపుట్టబోయే మనవడు తన కొడుక్కి పుడతాడన్న గ్యారంటీలేదు. ఏతావాతాతేలిందేమంటె ఒకే మొగుడూ, ఒకే పెళ్లాం అనే సూత్రం ఇంతవరకూ తమ కుటుంబాలలో పాటించబడలేదు. ఎంతగా సరిపెట్టుకుందామనుకున్నా అంతమనిషిక్కూడా ఎందుకో ఇది మింగుడు పడటంలేదు. వాంతి వచ్చినట్టుగా వుంది. సూదిప్రశ్నకు పంచర సమాధానంలా మనసుకి అతుక్కోవడంలేదు. ఎక్కడో సొట్టవుంది. మరెక్కడో గండి వుంది.

తలపట్టుకుని శ్యామ్‌గారు భరించలేని మూగవేదనను అనుభవిస్తున్నారు. ఎవరికీ చెప్పుకోలేని పరిస్థితుల్లో, తనలోతానే కుమిలిపోతూ, అలాంటి తండ్రి ఇలాంటి కొడుకు వున్న తనకు ఏజన్మలో తగిలిన ఏ ఘోరశాపమో



తేల్చుకోలేకుండా కూర్చుండిపోయారు. గుండె ముక్కముక్కలై మౌనంగా రోదిస్తున్నది.

ఒక్కపదినిమిషాల భయంకరమైన నిశ్శబ్దం తర్వాత ఒక కంఠ స్వరం ఆయన్ను మేల్కొల్పింది. "గుడీవినింగ్‌సర్"

శ్యామ్‌గారు నిద్రమత్తు నుంచి లేచినట్టు కళ్లు విప్పిచూసారు.

క్లబ్బులో సందడి ప్రారంభమై చాలాసేపు అయినట్టుగా వుంది. గ్లాసులు గలగలమంటున్నవి. పేకముక్కలు ఫెళఫెళమంటున్నవి. అంతటా లైట్ల వెలుగు పరుచుకుని వుంది. బోయ్స్ అవిశ్రాంతిగా అటూయిటూ తిరుగుతున్నారు.

జడ్జిగారు కారు పార్క్ చేసి, దిగి అందరకూ దూరంగా చెట్లచాటు వైపు కదిలారు. అక్కడికి చేరుకునేసరికి, బోయ్ హడావుడిగా వచ్చి తొందరతొందరగా రెండు కుర్చీలు తీసుకువచ్చి వేశాడు. వేసి వారి ఆజ్ఞకోసం నిరీక్షిస్తూ నిలబడ్డాడు.



జడ్జిగారు ఒక కుర్చీమీద కూర్చుని, మరో కుర్చీ ఆ ఆగంతకుడికి ఆఫర్ చేసారు- ''ఫర్వా లేదు... నేను నిలబడే వుంటాను. తమ పని కానివ్వండిసార్''

''ఫర్వాలేదు... కూర్చోవయ్యా. మర్యాదలు కోర్టులో. ఇక్కడ అందరూ సమానమే - కూర్చో'' అంటూ బలవంతాన కూర్చుపెట్టి- ''డ్రింక్ ఏం తీసుకుంటావు. మొహమాటపడకు, అసలు నాకు తాగాలనిలేదు. సరియైన కంపెనీ లేకపోతే తాగబుద్ధి వెయ్యదు. నాకు ఇంటిదగ్గర స్కాచ్ వుంటుంది. కేవలం నీ కోసమే ఏదో



నరదాగా తాగుతూ మాట్లాడుకుందాం'' అన్నారు ఎంకరేజ్ చేస్తూ.

"ఎందుకుసార్ అంత ఖరీదు. తమరు తీసుకోండి. నాకు రమ్మువాలు''. అన్నాడు ఆ ఆగంతకుడు బహుఒద్దికగా వినయంగా కూర్చుంటూ.

జడ్జిగారు బోయ్‌వైపు తిరిగి-- ''నాకు పీటర్ స్కాట్ ఒకలార్జ్, ఆయనకు రమ్ ఒక క్వార్టర్, తినడానికి కాజూనట్స్ తీసుకురా'' అన్నారు.

బోయ్‌వెళ్లిపోయిన తర్వాత ఆ ఆగంతకుని వైపు చూసారు.

ఆ ఆగంతకుడు బలిష్టంగా, పొడుగ్గా, ఫుల్ కాకీ యూనిఫారమ్‌లో గాక ప్లెయిన్ డ్రెస్‌లో ఉన్నాడు. వృత్తిలో సాటిలేనివాడనీ, నిరంకుశుడనీ, రాక్షసుడనీ పేరు పొందినవాడు.

బోయ్ ఒకగ్లాసులో లార్జ్‌పెగ్ విస్కీ, ఇంకో ఖాళీగ్లాసు, క్వార్టర్ బాటిల్‌లో రమ్, రెండు సోడాలు, ఒక బకెట్‌తో ఐస్ క్యూబ్స్, ఒక పింగాణీప్లేటులో కాజూ నట్స్ తీసుకువచ్చాడు. వాటిని టీపాయ్‌మీద సర్ది కొంచెంసేపు ఆగాడు ఏమైనా చెప్తారేమోనని. ఏమీ చెప్పకపోవడంతో మళ్లీరావచ్చుననుకుని మరోసారి వారివైపు చూసి వారినుంచి సమాధానం రాకపోవడంతో వెళ్లిపోయాడు.

శ్యామ్‌గారు రెండు జీడిపలుకులు నోట్లోవేసుకుని మెల్లగా గ్లాసు పెదాలదగ్గరకు తీసుకుని ఒక్క గుటకవేసి అసలు కార్యక్రమం మొదలుపెట్టారు. ''వెళ్లినపని ఏమైందీ''

ఆ ఖాకీ దుస్తుల్లో లేని ధర్మారావు చిన్న హేండ్‌బాగ్ తెరిచి అందులోంచి ఒక కవరు తీసి జడ్జిగారిముందు సవినయంగా వుంచాడు.

జడ్జిగారు కవరు తెరిచి చూసారు. అందులో రెండు ఫొటోలున్నాయి. ఆ రెండుఫొటోలు ఇద్దరు యువకులవి. ఇద్దరూ ఎడ్యుకేటెడ్ అందగాళ్లే.

ధర్మారావు వివరించాడు. ''మొదటతను రాజ్‌మోహన్– తండ్రి డాక్టర్ శ్రీనివాసరావు, పేరుమోసిన స్పెషలిస్టు. పెద్దపెద్ద ప్రముఖులతోనేకాదు గొప్పగొప్పరాజకీయవాదులతో, మంత్రులతో పటిష్టమైన సంబంధాలున్నవారు. ఆయన క్లినిక్కు అతిరథమహారథులు వైద్యనిమిత్తం వస్తూపోతూవుంటారు. ఆయన సలహానిమిత్తం ఎందరో మెడికల్ విద్యార్థులు, డాక్టర్లు వస్తుంటారు. క్షణం తీరికలేని బిజీ మనుషుల్లో ఆయన ఒకరు.

''ఆయన ఒక్కగానొక్క సంతానం ఈ రాజ్‌మోహన్. అల్లారుముద్దుగా పెరిగినవాడు. చిన్నప్పుడే తల్లిపోయింది. ఆ లోటు తెలియకుండా పెంచారు శ్రీనివాసరావుగారు. కొడుకు కాలిలో ముల్లుగుచ్చుకుంటే తండ్రిగుండెలో శూలాలు దిగబడిపోతాయి. అంత ప్రేమ ఆ కొడుకంటే ఈ తండ్రికి. శ్రీనివాసరావుగారి పంచప్రాణాలూకాక ఆరోప్రాణం కూడా ఈ రాజ్‌మోహనే. రాజ్‌మోహన్ రాకపోతే శ్రీనివాసరావుగారికి ఆ రాత్రి నిద్రపట్టదు. ఉదయం లేస్తూనే కొడుకు ముఖం చూసి పనులు ప్రారంభించాలి. రాత్రికాగానే కొడుకు ముఖంచూసి నిద్రపోవాలి. ఇందులో ఏదీ జరక్కుండా వుండటానికి వీల్లేదు.

''రాజ్‌మోహన్‌ని అందరూ రాజా అని పిలుస్తారు. అయితే రాజుల్లోవున్న అవలక్షణాలుగాని, దుర్గుణాలుగాని ఏఒక్క శాతం కూడా లేనివాడని అతనికి కీర్తివుంది. రాజ్‌మోహన్ బాగా చదువుకున్నవాడు. చదువుతున్నప్పుడు డబ్బుందీ మదించిన ఆంబోతులాకాక, బుద్ధిగా చదివి, వినయంగా ఎదిగివచ్చినవాడు. ఎం.బి.ఎ.లో బంగారుపతకం పొందినవాడు. హార్స్‌రైడింగ్‌లో, మోటారు సైకిలింగ్‌లో ఎక్స్‌పర్ట్.

''ఆ చదువుకునేరోజుల్లోనే ప్రమీలతో పరిచయం కలగడం, అది ఎదిగి గాఢంగా అల్లుకోడం జరిగిపోయింది. ఆ తర్వాత పెళ్లిచేసుకుని దానికొక రూపం కల్పిద్దామనుకున్నారు. కాని ప్రమీల తండ్రికీ, మీకూ వున్న స్నేహం, ఆ స్నేహం బంధుత్వంగా మార్చుకుందామని అనుకోడంతో ఆమెకు మీ అబ్బాయితో వివాహమైంది. ప్రమీలకి మీ సంబంధం ఇష్టంలేకున్నా తండ్రి మాట కాదంటే వురిపోసుకుచచ్చిపోతానని తల్లి బెదిరించడంతో వారి పరువు ప్రతిష్టలకోసం ప్రమీల తలవంచకతప్పలేదు.

''అయితే ఇక్కడొక నిజం అంగీకరించాల్సివుంది. తాళికట్టించుకున్న దగ్గర్నుంచీ మొన్న మొన్నటివరకూ ప్రమీల రాజ్‌మోహన్ మొగం




కూడా చూడలేదు. రాజ్‌మోహన్‌కూడా బ్రహ్మ చారిగానే వుండిపోయాడు తప్ప మరో స్త్రీతో స్నేహసంబంధం కూడా పెట్టుకోలేదు. పెళ్ల యిన కొన్ని నెలలవరకూ ఇద్దరూ దాదాపు విడిపోయినట్లే... విడిపోయారు కూడా.

"ఆ ఎడబాటు రాజ్‌మోహన్‌ను బాగా కృంగతీసింది. ప్రమీలను మరిచిపోడానికి అతను తాగుడికి బానిసైపోయాడు. నిద్రాహారా లు విసర్జించి ఎప్పుడూ ఇంట్లోనే కూర్చుండేవా డు. తండ్రి కొడుకుమీద బెంగతో వైద్యం కూడా తగ్గించుకున్నారు. ఇక్కడ మీ కోడలుగారు ప్రియుణ్ని మరిచిపోలేక, మరిపించేందుకు భర్తచెంతవుండకా విలవిల్లాడిపోయేది. రెక్క లు తెగిన పక్షిలా కుమిలిపోయేది.

"ఎప్పుడైతే మీ అబ్బాయిగారు చెకింగుల కని, ఇనస్పెక్షన్‌లకని ఇంటిపట్టునవుండ కుండా తిరుగుతున్నారో, ఎప్పుడైతే ప్రమీల మనసు అసంతృప్తితో విసిగివిసిగి ఒక నిర్ణ యానికొచ్చిందో సరిగ్గా ఆ సమయం విడిపో యిన ప్రేమికుల్ని తిరిగి ఏకంచేయడానికి అనుకూలించింది. అది మొదలు వ్యవధి దొరి కినప్పుడల్లా ఇద్దరూ కలుసుకునేవుంటారు.

"ఇన్నాళ్ల తర్వాత ఇప్పుడు ప్రమీల మీ అబ్బాయిగారికి విడాకులు ఇచ్చే ప్రయత్నంలో వున్నారు. అయితే మీరు జడ్జిగా వుండగా ఈ ప్రయత్నం ఫలిస్తుందని వారు అనుకోవడంలే దు. కాని శ్రీనివాసరావు వలుకుబడి ముందు మీధాటి ఆగలేదనే భయం ఒకటుంది. ఏమైనా ప్రమీలకు మైనారిటీ తీరే రోజుకోసం ఎదురుచూస్తున్నారు. ఆరోజు దాదాపు దగ్గర్లోనే అంటే రోజుల్లోనే వుంది" అని చెప్పి ఆగాడు.

జడ్జిగారికి శ్రీనివాసరావు పేరు వినడంతోనే ముఖంలో రంగులుమారిపోయాయి. కోడలు తన కుటుంబంనుంచి విడిపోడానికి లీగల్ అడ్వాయిజరీ కోరనున్నదని తెలియడంతో వెన్నెముకనుంచి వన్నని వణుకు ప్రారంభ మైంది.

విడాకులకోసం, కోర్టుగుమ్మం ఎక్కడం మొ దలెడితే తమ వంశచరిత్రలో ఇదే ప్రథమం అవుతుంది. చూపరులదృష్టిలో ఎంతగొప్ప ఆడదైనా కోర్టుకొచ్చేసరికి వ్యభిచారగృహాల్లోంచి వచ్చిన వేశ్యకిందనే జమఅయిపోతుంది. మన కోర్టుల్లోని ఈ దిక్కుమాలిన పీడ అటువంటిది. ఎంత ఉన్నతురాలు అయినాసరే కోర్టు ఆవర ణలో అడుగుపెట్టేసరికి ఒక దోషిలా— నేరస్తు రాలిలా చూడబడుతుంది. ఆమె నిరపరాధి అయినా సరే.

వారి ముఖం కోపంతో ఎర్రబడిపోయింది. రౌద్రంతో వారికళ్ళు నిప్పుముద్దలయ్యాయి. ఆ కళ్ళనుంచి విస్ఫులింగాలు తుళ్ళుతున్నాయి.

అయినా వెధవని ఇంజనీరింగ్ చదివించ డంతప్పే అయింది. పోనీ అంటే ప్లీడరీ ఛదివిస్తే ప్రాక్టీసులేకపోతే చెట్టుకింద గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోవాలి. ఏ లీడింగ్‌లాయర్ కాళ్ళు పట్టో గుమాస్తాగిరి చెయ్యాలి. ఇంజనీ రింగు అయితే సమర్థతవున్నా లేకపోయినా ప్రభుత్వోద్యోగం కాబట్టి రోజుకు కొన్నివేలు కళ్ళచూడొచ్చు అని సంతోషిస్తే వీడు ప్రభుత్వ భవనాలు, ఆనకట్టలూ కూల్చాల్సిందిపోయి ఏకంగా సొంతఇంటినే కూల్చుకుంటున్నాడు. ఇంజనీరు అయితే ఏదో వుద్ధరించేస్తాడనుకు న్నానుగాని, ఇంతనిర్వాకంచేసి ఇలా కొంప తగలెడతాననుకోలేదు. ఆ చెకింగూ, ఈయినసె క్షనూ అన్జెప్పి వెధవపూర్లమ్మట పడి తిరగడమే గాని, ఒక్కనాడయినా ఇంటిపట్టున వుండి, భార్య చిన్నదికదా ఎలావుండగలుగుతుంది? ఆమెకోర్కెలేమిటి? సరదాలేమిటి? అవి తీర్చే మార్గాలేమిటి? అనిఎప్పుడైనా ఆలోచించాడా? సినిమాకు తీసుకువెళ్లాం, షికారుకు జంటగా వెళ్లాం, షాపింగుచేసిపెడదాం అని ఎప్పుడైనా అనుకున్నాడా? మరి చూసిచూసి విసిగిపోయి, కోడలు పిల్ల మరోదారి తొక్కిందంటే ఆమెనని ప్రయోజనమేమిటి?

ఇలా ఆలోచిస్తూ కొంతసేపటితర్వాత "మరి ఆ రెండోఫోటో" అన్నారు.

తిరిగి ధర్మారావు చెప్పడం ప్రారంభించా డు. "ఒక సామాన్యుడిది పేరు రాజభూషణ్. నిజంగా భూషణమే. అన్నిటిలోనూ గోల్డ్‌మెడ లిస్ట్. మంచి స్పోర్ట్స్‌మన్. చాలా బుద్ధిమంతు డు. తండ్రిలేడు. తల్లే పెంచి ఈ స్థితికి తీసుకువచ్చింది. స్వతంత్రంగా జీవిస్తూనే మేనమామల ఇంట్లో వుంటున్నాడు. మరీ పేద వారు కాకపోయినా వున్నవారు మాత్రంకాదు. మీ అమ్మాయి ప్రసూనగారు సెకెండియర్. ఈ అబ్బాయి ఫోర్తియర్. ఇద్దరూ ఒక సంవత్స రంగా, ఒకరిమనసొకరు ఇచ్చేసుకుని, ప్రేమా

మృతాన్ని ఎవరిగుండెల్లోవారు భద్రంగా దాచే నుకున్నారు. కాకపోతే వీరుకూడా మీకోడలిగారి లాగే అమ్మాయి మైనారిటీతీరే రోజుకోసమే ఎదురుచూస్తున్నారు. ఈ ఇయర్ చదువు పూర్తి చేయడం, మైనారిటీ తీరిపోవడం ఒకేసారి జరిగిపోతుందనుకుంటున్నారు. ఆ తర్వాత రిజిస్టర్‌మ్యారేజ్‌కి అప్లికేషన్‌పెట్టి తీరికగా మీ కుచెప్పి మీ అంగీకారం ఎలాగూ దొరకదుకాబ ట్టి మీవద్దనుండి శెలవు తీసుకుందామను కుంటున్నారు. వేరేకాపురం పెట్టి స్టడీస్ కంటి న్యూ చెయ్యాలని చూస్తున్నారు'' ఆగాడు ధర్మారావు.

ఒక్కొక్కమాటా వింటున్నకొద్దీ తనెంత పైలె వెల్‌కి ఎదిగిపోయి మరి అందకుండా వుండి పోదామనుకున్నారో, అంతలా ఒక్కొక్క మెట్టూ దిగిపోతున్నట్టని పించింది. ఒక్క పదినిమిషా లుపాటు మూగరోదన అతికష్టంమీద భరిస్తూ మౌనంగా వుండిపోయారు.

ఏది ఎలాజరిగితే తాను ఏంచెయ్యాలో పథకరచన చేస్తూ మెదడును సిద్ధంగా వుంచు కుంటున్నారు. ఏది సబబు, బేసబబూఅని ఆలోచిస్తున్నారు.

ఏమైనా వంశగౌరవం తనకి ముఖ్యం. అదే మొట్టమొదటిది. ఆ తర్వాతే ఏదైనా. అంతే... మరో పదినిమిషాల్లో ఒక దృఢనిర్ణయానికొచ్చే సారు. ఇక ముందూవెనకా ఆలోచించాల్సిన పనిలేదని సరిపెట్టుకున్నారు. ఆలోచించినకొ ద్దీ మరింత గందరగోళమైపోతుందేతప్ప ప్ర యోజనం వుండదు.

అంతే! వారి ముఖం గంభీరంగా, రౌద్రంగా మారిపోయింది. ''ఈఇద్దర్నీ కనిపించనీయ కుండా-ఐమీన్-అసలు లేకుండా చేయడానికి తగిన అవకాశాలున్నాయేమో పరిశీ లించారా?'' అన్నారు కొంచెం ముందుకు వంగి.

''పరిశీలించానండి. రెండో అతణ్ని ఈలో కంనుంచి పంపించెయ్యడానికి పెద్దశ్రమపడ నవసరంలేదండీ. చాలా తేలిగ్గా చేసేసి చేతు లు కడిగేసికోవచ్చునండీ. కాని మొదటతను న్నాడుచూసారూ! రాజ్‌మోహన్‌ని ముట్టుకోడా నికి కూడా వీల్లేని పరిస్థితండీ. పేరుప్రఖ్యాతు లుగల స్పెషలిస్టుడాక్టర్‌కి ఒక్కగానొక్క వారసు డు. ఈ ఊళ్ళో అందమైన భవనాలున్నాయి. వాళ్ళఊళ్ళో వందలాది ఎకరాల్లో విస్తరించిన పెద్దపెద్దతోటలున్నాయి. మీవరకేమోగాని, నామట్టుకునాకు ఖూనీకేసులాంటిదేదైనా జరిగి సెర్చి వారంటు వుంటెె తప్ప వారి ప్రహరీదాటి లోపలికి ప్రవేశించే అర్హతకూడా లేదండీ. ఆమాటకొస్తే మీరుకూడా శ్రీనివాసరావుగారితో సమవుజ్జీకారనుకుంటానండి. ఆయనదంతా ఢిల్లీ, హైదరాబాద్ మినిస్టర్లలెవెలండీ! మరంచేత ఆయనవిషయం వదిలేసి మిగి లింది చెప్పండి. నాకాకీడ్రెస్సు తడాఖాచూ పించేస్తాను'' అన్నాడు ధర్మారావు.

జడ్జిగారికి మహాచిరాకు అపించింది. మొ దట్లోనే ఈ సొడ్డేమిటి? అని విసవిసలాడిపో యారు. ''పోనీ నేను యస్పీనో, డి.ఐ.జి.నో మీటయ్యాననుకో- అప్పుడెలావుంటుంది?'' అని ప్రశ్నించారు.

'హమ్మయ్య' అనుకుని ఆ మానవుడు నెమ్మ దిగా వూపిరి తీసుకున్నాడు. పోతున్నప్రాణం తిరిగివచ్చినట్టనిపించింది''అలా అన్నారు బాగుంది. ఆ వైపునుంచి ప్రయ త్నంచెయ్యడం మంచిదికూడా. అయితే ఎట్టి పరిస్థితిల్లోనూ నాపేరు మాత్రం బయటకురానీ యకండి. ఎందుకంటే ప్రాణాధికంగా ప్రే మించిన ఒక్క కొడుకూ దక్కకపోతే డాక్టరుగా రు విజృంభించేస్తారు. పగతో వున్న ఆస్తంతా పోయినాసరే మనందర్నీ నేలమట్టంచేసి పాతా ళానికి తొక్కేసేదాకా నిద్రపోరు. అవసరమైతే ప్రెసిడెంటువరకైనా పోతానంటారుగాని వద లరు. రాజీపడ్డం ఆయన మనస్తత్వానికే విరు ద్ధం. ఆయన పలుకుబడి అంతంతమాత్రంది కాదు. ఆయన శక్తిసామర్థ్యాలు తక్కువ అంచ నావెయ్యడానికి వీల్లేనివి. ఒకవేళ తమకు సాధ్యంకాదనుకుంటే ఆగిపోవడం మంచిది గాని దుందుడుకుగా ముందుకు దూకడం మంచిదికాదు''

డి.యస్.పి. ధర్మారావు ఎందుకో ఈ విష యంలో వెనకాడుతున్నట్టు జడ్జిగారికి స్పష్టంగా అర్థమైపోయింది.

''ఏం పెద్దమనిషివయ్యానువ్వు, అందరికీ తెలిసేట్టు చేస్తారటయ్యామీరు. అలాగయితే గూండాలకూ, మీకూ తేడా ఏమిటి? మరీ ఇంతపిరికివాడివి పోలీసుడిపార్టుమెంటులో క




లావచ్చావయ్యా. ఏ స్పెషల్‌వర్కరుగానూ వుండిపోక! సరే... వెళ్ళు. సాయంత్రం యస్పీకో, డిఐజీకో ఫోనుచేసి పిలుస్తాను. వారితో వివరంగా మాట్లాడినతర్వాత వారిద్వారానే పని అప్పగిస్తానులే'' అన్నారు.

''అవునుసార్... అదేసరైన పద్ధతికూడానండి. థాంక్స్‌సర్. ఇకశెలవు తీసుకుంటానండి'' అని ఆఖరిసారిగా మిగిలిపోయిన ద్రవం గుటకేసి లేచి నిలబడ్డాడు. అటెన్షన్‌పోజులో మరోసారి కాకీశాల్యూట్‌చేసి, ఇక అక్కడ ఏమాత్రం ఉండకూడదని, అది మరింత రొచ్చులోకి లాగుతుందని భయపడుతూ ఆ మానవుడు చల్లగా, తొందరగా అక్కడనుంచి జారుకున్నాడు.

ఒక నిశ్చయానికి రావడంతో జడ్జిగారికి ఆందోళన చల్లారినా, మరో పక్క కలత బయల్దేరింది. రెండూ పక్కపక్కనే పెనవేసుకుని వూపిరాడనివ్వకుండా వుక్కిరిబిక్కిరి చేస్తున్నాయి.

అప్పటికి సమయం సాయంత్రం ఆరు గంటలు దాటి మరో అర్ధగంట ముందుకు నడిచింది. శీతాకాలపు చలి మనుషుల్ని నిల్పోనివ్వడంలేదు.

మరో పదినిముషాల తర్వాత వారికారు ప్రధాన వీధులగుండా ఇంటికి అభిముఖంగా బయల్దేరింది. ప్రతి సెంటర్‌లోనూ జడ్జిగారి కారును గుర్తించి శాల్యూట్ చేస్తున్నారు పోలీసులు.

తాను తలపెట్టబోయే కార్యానికిది మొదటి విజయంగా భావించి హేపీ ఫీలయ్యారు జడ్జిగారు. 'హోదా, పలుకుబడి అంటే ఇలా వుండాలిగాని మరొకలా వుండకూడదు' అని వారికి వారే దర్జాగా అనుకుని, గర్వంగా నవ్వుకుని రెట్టించిన ఉత్సాహంతో అప్రయత్నంగానే లేని మీసాలమీద చెయ్యివేసుకున్నారు.

కారు పోర్టికోలోపెట్టి తిన్నగా లాన్‌లోకి నడుచుకుంటూ వెళ్లారు. ఎదుగుతున్న చెట్లవంకా, అణువుఅణువూ గుబాళింపులు నింపుకుని ఆ పరిమళాల్తో మనోహరంగా వికసించిన పూల వంకా తదేకంగా చూశారు. తోటమాలి సమపాళ్లలో మొక్కలు కత్తిరిస్తాడోలేదో వీక్షించి అది అలా టంచనుగా జరుగుతున్నదని అర్థంచేసుకున్నపిమ్మట వాడి విధేయతను మనసులోనే మెచ్చుకున్నారు జడ్జిగారు. శభాష్! జీవితం అంటే ఇది, ఇలా వుండాలి అని తననుతానే ప్రశంసించుకుని బోలెడు సంతోషపడిపోయి గంభీరంగా ముందుకు సాగారు.

ఆ క్షణాన వారికి అన్నీ తనకు అనుకూలంగా వున్నట్టే అనిపించింది.

అలా హుందాగా అడుగులేసుకుంటూ వారు బంగళా మొదటిభాగానికి చేరుకున్నారు. మెట్లెక్కి, పూర్తిగా గ్లాసుతో బిగించబడిన డోర్ తెరిచి హాల్లోకి అడుగుపెట్టారు. ఎంతమంది అతిథులైనా కూర్చోడానికి వీలుగా సదుపాయంగా వుందా హాలు. నాలుగువైపులా గోడలకు ఆనించి పెద్దపెద్ద సోఫాలు, వాటిలో అమర్చిన ఎత్తుకుషన్ సీట్లు, వాటిపైన వేలాడుతున్న పులిచర్మం డిజైనులో వెల్వెట్‌క్లాత్‌లు చాలా దర్పంగా వున్నాయి.

నాలుగు కార్నర్స్‌లోనూపెద్దపెద్దఅక్వేరియమ్స్, వాటికిరువైపులా రకరకాల ఫ్లవర్స్‌వాజ్స్ వున్నాయి. హాలుమధ్యలో పెద్ద టేబులు, దానిమీద చూడముచ్చటైన బుల్లి ఫౌంటెన్, నాలుగు పక్కలా నాలుగు ఫ్లవర్‌వాజ్‌లు, వాటిలో తాజాదనం నింపుకున్న రకరకాల ఆకులు, వివిధ రూపాల పరిమళపుష్పాలు వుండి, వాతావరణాన్ని సుగంధభరితం చేస్తున్నాయి. ధారాళంగా గాలి, శుభ్రంగా వెల్తురు వస్తోంది. అన్ని గోడలకూ నిలువెత్తు కిటికీలు వున్నాయి. వాటికి దళసరి అద్దాలు, సిల్కు కర్టెన్లు!

నాలుగు పంకాలు నిశ్శబ్దంగా గాలిని సరఫరా చేస్తాయి. ఆ హాలు ఇది సామానుల కొంపకాదు అని ఎలుగెత్తి చాటుతున్నట్టుంటుంది. అడుగడుగునా రాజసం వుట్టిపడుతుంటుంది.

అలాంటి హాల్లోకి వారు ఠీవిగా హేండ్‌స్టిక్ వూపుకుంటూ మెత్తనిబూట్లు చప్పుడు చేసుకుంటూ హుందాగా అడుగుపెట్టేసరికి పూలతోటలో గంజాయి మొక్కలాంటి దృశ్యం ఎదురై, వారు అంత హాయిలోనూ గుండెలు కలుక్కుమన్నట్టు ఫీలయ్యారు. అపశకునపక్షిలా ఎదురుగా సోఫాలో ఓ కుర్రాడు కూర్చుని వున్నాడు. పక్కనే ఓ అమ్మాయి కూడా వుంది. ఆ అమ్మాయి జడ్జిగారి ఏకైక తనయ ప్రసూన.

కుర్రాడు ఇంతకుముందు ఫొటోలో చూసిన రాజ్‌భూషణ్.

శ్యామ్‌గార్ని చూడగానే అతను లేచి నిల్చు న్నాడు.

ప్రసూన 'హాయ్‌డాడీ' అని పరుగుపరుగున వెళ్లి తండ్రిచేయి పుచ్చుకుంది. దగ్గరకు రాగానే రాజ్‌భూషణ్ "నమస్కారంసార్" అని పలకరించాడు. "కూర్చోండి" అంటూ వారు తనగదిలోకి వెళ్లి డ్రెస్సు ఛేంజ్ చేసుకుని స్లిప్పర్స్‌తో వచ్చారు. చారల లుంగీ, చేతుల బనీను, ఆపైన సన్నని సిల్కులాల్చీ- ఇవన్నీ ఎంతో ఖరీదైనవే.

వారు వచ్చి ఎదురు సోఫాలో కూర్చుని "చెప్పండి... సంగతేమిటి?" అడిగారు.

"ఈయన పేరు రాజ్‌భూషణ్. తల్లి మాత్ర మేవుంది. నాకు కాలేజీమేటు, క్లాసుమేటుకా దు. అన్నింటిలోనూ ఈయనే ఫస్టు. కొన్నింటిలో గోల్డ్‌మెడలిస్ట్ కూడా. మీకు పరిచయం చేద్దా మని తీసుకు వచ్చాను" అంది ఆపిల్ల.

"నాకు పరిచయం చేయడమెందుకు? ఇప్పుడా అవసరం ఏమొచ్చింది?" కొంచెం విసుగ్గా అన్నారు జడ్జిగారు.

"నాఫ్రెండ్ కదా అందుకని" లైట్‌గా అనే సింది ప్రసూన.

"సరే... ఇక నాపని చూసుకోవచ్చునా?" అదోలా అన్నారు జడ్జిగారు.

"ఓకే... మేమిద్దరం అలావెళ్ళి వస్తాం" అంటూ లేచింది ప్రసూన.

"మేమిద్దరం అంటే?" ఇంచుమించు కోపం ప్రదర్శించారు జడ్జిగారు.

"ఈయన్నలా రోడ్డుచివరవరకూ దిగబెట్టి వస్తాను"

"నువ్వు దిగబెట్టకపోతే ఈయన వెళ్ళ లేడా?"

"వెళ్లగలడు... ఎందుకు వెళ్లలేడు. కాళ్ళు న్నమనిషికదా. దారికూడా తెలుసు. కాని కావా లని నేను తీసుకొచ్చినప్పుడు ఇంటిబయట వరకైనా సాగనంపడం మర్యాదకదా. అందు కని" తనూ ఏమీ తక్కువ చదవలేదన్నట్లు పెంకిగా అంది ప్రసూన.

"నాన్సెన్స్. చూడు బాబూ... నువ్వెవరివో నాకు తెలియదు. అలా కొంచెం బయటకువె ళ్తావా? మేమిద్దరం మాట్లాడుకోవాలి. మూడోమ నిషి వుండటం నాకిష్టం లేదు" బేసబబే అయినా నిర్మొహమాటంగాచెప్పారు జడ్జిగారు.

"ఆల్‌రైట్... మీరు మాట్లాడుకోండి. మీకు ఇబ్బంది కలిగించాననుకుంటే క్షమించండి. మరి నేను వెళ్తానుసార్ వస్తా ప్రసూ" అంటూ వెళ్ళబోయాడు భూషణ్

"వెళ్లడంకాదు... నువ్వు మాలాన్‌లో వైట్‌చె య్యి. నేను మాడాడీతో మాట్లాడి నిన్ను రెండుని మిషాల్లో కలుసుకుంటాను. ఇద్దరం కలిసే వెళ్దాం. నీతో నాకు పనివుంది. ఈరోజు ఆర్థోపె డిక్‌లో ఒక టిపికల్ కేసుచూశాను. నాకు కొన్ని డౌట్స్‌వున్నాయి. నీదగ్గర్నుంచి వివరణలు కా వాలి"

అది అబద్ధమని అతనికి తెలుసు. కాని ఆమెది మంకుపట్టు.

తప్పుచేసినవాడిలా అతను తలొంచుకువె ళ్ళిపోయాడు అక్కడి నుంచి లాన్‌లోకి.

"ఏమిటి నీఉద్దేశం... నేను వెళ్లమన్నప్పుడు అతణ్ని నువ్వుండమనడంలో అర్థం ఏమిటి? ఆ బచ్చాగాడి ముందు నన్నుఇన్సల్ట్ చే స్తావా?" అన్నారు జడ్జిగారు రెచ్చిపోతూ.

"మీకు పరిచయం చెయ్యడానికని నేనే తీసుకొస్తే, మీరు ఛీత్కరించుకుని పొమ్మంటే, నా తండ్రి దగ్గర నాకాపాటివిలువకూడా లేదని అతననుకోడా? అప్పుడు నా గౌరవమేమా తుంది" అంది ప్రసూన మరింత ఆవేశంతో.

"వాడనుకుంటే నాకేమిటి, అనుకోకపోతే నాకేమిటి? అయినా రోడ్డుమీద ఆడామగా కలిసి తిరగడం, రావడం, పోవడం అంటే ఏమిటి నీఅభిప్రాయం?"

"నా అభిప్రాయమేకాదు- ఎవరికూ్కడా వేరే అభిప్రాయం వుండాల్సినపనిలేదు. వెళ్ళడ మంటే వెళ్ళడం, రావడమంటే రావడమే. ఇక ఇందులోవెతికేందుకు కొత్త అర్థాలే ముంటాయ్?"

"ప్రపంచమంతా అలాగే అను కుంటుందనా నీ ఉద్దేశం?"

"ప్రపంచంతో నాకు పనేమిటి? అది సము ద్రంలో కలుస్తానంటుంది. నన్ను కూడా వెళ్ళిక లవమన్నారా? మనిద్దరం రోడ్డుమీద పోతుంటే తండ్రీకూతురుకాదు అరవయ్యేళ్ళముసిలాడు




## హనుమగిరి కాలని



నెల్లూరు నుండి మద్రాస్‌కు పోవు GNT రోడ్డుకు కుడివైపున బాలాజి స్టీల్ ఫ్యాక్టరీ పవన్ కాలని కోరా రెసిడెన్షియల్ కాలేజీ ప్రక్కన 250 ప్లాట్లు లే అవుటు వేయబడినవి. ఇప్పటికి 30 ఇండ్లు నిర్మాణము జరిగి నివసించుచున్నారు. అందమైన రోడ్లు, రోడ్లకు ఇరువైపుల చల్లని నీడను ఇచ్చు చెట్లుతో, విద్యుచ్ఛక్తి మంచినీటి వసతి కలిగి కట్టుబడి పునాదులకు రెండు అడుగుల లోతులో గ్రావెల్ కలిగియున్నది.

ఈ ప్లాట్లు శ్రీస్వామి అయ్యప్పగుడికి అందుబాటుదూరములో ఉన్నవి. నెల 1కి Rs.500/-చొప్పున 60 నెలలు చెల్లించవచ్చును. ప్లాటు సైజు 60'×40' కొలతలుగలిగి, $33^{1}/_{3}$ అంకణములు విస్తీర్ణము కలదు.

నెల 1కి Rs.250/- చొప్పున 60 నెలలు చెల్లించవచ్చును. ప్లాటు సైజు 20'×60' కొలతలు గలిగి $16^{2}/_{3}$ అం॥ విస్తీర్ణం కలదు. ప్రతినెల "డ్రా" జరుగును. "డ్రా"లో గెలుపొందిన వారు వాయిదా పైకం చెల్లించనవసరంలేదు. రూ.500/-లు చెల్లించినచ్చిన ప్లాటును రిజర్వు చేసుకొనవచ్చును.

వివరములకు ప్రమోటర్సు ఫోన్ నెం.6729

# J.L. నారాయణ అండ్ క్యాకంపెని

ఊర్వశి కాంప్లెక్సు కాపువీధి- నెల్లూరు-524001

ప్రతి ఆదివారం స్థలసందర్శనమునకు మా ఆఫీసు నుంచి ఉచిత వాహనసౌకర్యముకలదు. TIME 8 A.M. to 1 NOON.

పదహారేళ్ల పిల్లతో కలిసి తిరుగుతున్నాడంటారు. దానికి మీరేమంటారు?" అంది పౌరుషంగా.

"ప్రసూ..." విసురుగా చెయ్యెత్తారు. కాని అంతలోనే తమాయించుకుని ఆగిపోయారు. "కళ్ళు కావరంతో ఒళ్ళుపొగరెక్కి మాట్లాడుతున్నావు. కన్నతండ్రికీ ప్రేమించే ప్రియుడికీ మధ్య తేడా నీకు తెలియడంలేదు. కొట్టకుండా ఎందుకు ఆగిపోయానో నీకు తెలుసా? తల్లిప్రేమంటే ఏమిటో తెలియని పిల్లవి. తిరిగి నేనే బుజ్జగించాల్సి వస్తుందని" ఉబుకుతున్న ఆవేశాన్ని అణుచుకుంటూ అన్నారు.

"మంచి పనేచేసారు. ఆ బుజ్జగింపుకూడా ఎందుకులెండి- ఏనాడైనా మనిద్దరం, తండ్రీ కూతుర్లలా ప్రవర్తించామా? అలా అనుకుని పెరిగానా? ఒకవేళ అమ్మ బతికున్నా నాకు తల్లి ప్రేమ తెలుస్తుందనుకోను. ఎందుకంటే మీరు మెన్స్‌క్లబ్బులకూ, లైన్స్‌క్లబ్‌లకూ వెళ్ళినట్టుగానే అమ్మకూడా లేడీస్‌క్లబ్బులకూ, లేడీలయన్స్‌లకూ వెళ్ళివుండేది. ఇప్పటిలానే అప్పుడు కూడా దాసిపిల్లలుగానే పెరిగివుండేవాళ్ళం. అరిస్టొక్రాట్ స్టైయిల్లో హాయ్‌డాడీ, హాయ్‌మమ్మి, గుడ్‌మార్నింగ్ మమ్మీ, గుడ్‌నైట్‌డాడీ- అని కొత్తవారు చెప్పుకున్నట్టు చెప్పుకుని, ఎవరిగదుల్లోకి వారు దూరిపోయి, ఏకాకిగా బతకడం తప్ప ఒక్కర్నొకరు ప్రేమించుకోవమనేది ఎలాగుంటుందో మనకెప్పుడైనా తెలుసా. ఒకరికెదురుగా ఒకరు కూర్చుని, ఒకరి ముఖాల్లోకొకరు చూసుకుని ఎప్పుడేనా భోంచేశామా? ఈ బుజ్జగింపు ముచ్చటకూడా ఎందుకులెండి"

ప్రేమ తెలీనిపిల్ల. అప్పుడప్పుడే ప్రేమ చవిచూస్తున్నపిల్ల ఆ ప్రేమకూడా జారిపోతుందేమోనన్న భయం అంతరంగంలో కసిని ఏడుపు పర్యంతం అవుతోంది.

కాని కృతకహోదాని, కృత్రిమహోదాని తన చుట్టూ వలయంలా నిర్మించుకుని, అన్న డికదే గొప్పతనమని భుజాలెగరేసిన ఆ తండ్రి, దాన్ని వదులుకోడానికి సిద్ధంగా లేడు. చిగురుటాకుకు ముల్లు గుచ్చుకున్నట్టు, ఎంతో మానసిక హింసని గరళంమింగినట్టు, రెంతే కంటికి తెలీకుండా సంపాదించిన ఈ పరపతికోసం పడినకష్టాల్నీ, దిగమించిన అవమానాల్నీ మరిచిపోడానికి సిద్ధంగా లేడు. ఈ పరపతికోసం ఎంత మూల్యం చెల్లించాడో, ఎంత వ్యక్తిత్వాన్ని కోల్పోయాడో అతనొక్కడికే తెలుసు. అందుచేత దాన్ని నిలబెట్టుకోడానికి ఎన్ని అడ్డదార్లయినా తొక్కడానికి సిద్ధంగా వున్నాడు. దానికోసం ఏది వదులుకోడానికైనా తెగించివున్నాడు.

"నువ్వు స్నేహం చేయాల్సొస్తే దానికీ పాటివెధపేదొరికాడా?"

"స్నేహం చేయడానికి ఏపాటివెధవైనా కావాలికదా. ఆపాటిదానికి ఈ పాటివెధవైనాసరిపోడా అనుకున్నాను" అంది మరింత మొండిగా.

"వాడితోనువ్వు నడవడానికీ, నీపక్కన వాడు నిల్చోడానికి వాడికున్న అర్హతేమిటి? ఇదినీకు సిగ్గనిపించలేదా?"

"సిగ్గా... అది నాపుట్టుకలోనే లేదు. ఇక అర్హతలకేమిలెండి. తెలీక అడుగుతాను- ఈ అర్హతతోనే మీరు పుట్టారా? ఈ అర్హత మీకు అందచేయడానికే దీన్ని కట్టుకుని మీనాన్నగారు ఈ నేలను అవతరించారా? అర్హత మనం సంపాదిస్తే వస్తుంది. నిలుపుకుంటే నిలుస్తుంది. అంతేకాని ఒక మనిషిరావడంతోనే వచ్చి పోవడంతోనేపోదు. లాయర్‌కమ్ జడ్జికదా ఈ మాత్రం మీకు తెలియదా"

"తల తిరుగుడుగా మాట్లాడకు. సొసైటీలో ఒక హోదా, అంతస్తు, పలుకుబడి లేనివాడితో నువ్వు స్నేహంగా వుండటం, అంతకుమించి సన్నిహితంగా మెలగడం నేను సహించలేను. కలిసి తిరగాల్సొస్తే మనస్థాయికి సరిపడ్డవాడూ, మన లెవిల్‌కి ఎదిగినవాడూ ఆపాటి మగాడు ఒక్కడూ దొరకలేదానీకు. ఏదియేమైనా కానీ, రోడ్డువెంట తిరిగే ఒక్కడిక్కుమొక్కులేనివాడితో నువ్వు చెలిమిచెయ్యడం, అంతకుమించి ముందుకుసాగడం నేను సహించను... క్షమించను. మొగ్గలోనే తుంచేస్తాను. ముందుగా చెప్తున్నాను- తర్వాత నువ్వు బాధపడీలాభంలేదు. అంటూ తీవ్రంగా హెచ్చరించారు.

ఆమె నవ్వింది తనలోతానే గొణుక్కున్నట్టు అనుకుంది గొప్పకోసం అప్పుర్‌క్లాసు మనుషులతో తిరిగి, వారి విలాసాలకు, లాభాలకు




పనిముట్లుగా ఉపయోగపడి దొంగకడుపులు చేయించుకున్నా ఫర్వాలేదు కాని పేదవాడితో నీతిగా మాత్రం వుండకూడదు. ఎంత హీనమ నస్తత్వం! ఆమెకు తలచుకున్నకొద్దీ రోతపుడు తోంది.

తండ్రివైపు తిరిగి ఆఖరిమాటగా అంది ఒక ఆడామగా కలిసివుండటమంటే ఏమిటి మీదృష్టిలో? మీరు చెప్పింది ఇప్పటికీ పల్లెల్లో సజావుగా సాగుతూనేవుంది. అన్నెం పున్నెం ఎరుగని ఒక అమాయకురాలికి, ముక్కూ ముఖం తెలీని ఒకవెధవన్నర వెధవని ఎక్కడ నుంచో తెచ్చిఅంటకడతారు. ఆ చవటని మరుక్షణం నుంచి దైవమే అనుకుని వాడి పాదసన్నిధే తనకు మోక్షమార్గమని తాదాత్మ్య తతోతనని తానే సమర్థించుకుని పూజాను మంగా అంకితమైపోతుంది. ఆ దద్దమ్మ కూర్చోమంటేకూర్చుని, నిల్చోమంటే నిల్చుని, పడుకోమంటే పడుకుని, అదొక దైవదత్తమైన కార్యమైనట్టు, ఏడాదికొక్కణ్ణి చొప్పున వాడికి కనిపారేస్తూ అక్కడి కదేస్వర్గమని, ముక్తి సోపానమనీ మురిసిపోయిన అభాగ్యురాలు ఆ ఆడది. అత్తమామల పాదపూజకీ, మొగుడిచే తిన్నర్శకీ తేడా తెలియక, ఏది ఆనందమో, ఏది విచారమో ఎరగక, వయసుండగానే జవసత్వాలుడిగిపోయి ముసలిదై ఆ నిర్భాగ్యురాలు రక్తమాంసాల ముద్దగా, కన్నీటికొలనుగా నేలలో ఇంకిపోతుంది.

"కాని... డాడీ ఇది ఆధునిక యుగం. ఇక్కడ ఎవరి బతుకులు వారు బతకడమేకాదు, ఎదరి బతుకుల్ని వెలిగించాలి. ఒకరి కోసం ఇంకొకరు బతకాలి. అందరి బతుకుల్నీ పండించాలి. ప్రేమించుకోడంలోనే తెలుస్తుంది దాని గొప్పతనం. సాఫల్యంలోనే తెలుస్తుంది దాని ఔన్నత్యం. ఒకరికోసం ఒకరు త్యాగానికి సిద్ధపడ్డంలోనే తెలుస్తుంది దాని పారవశ్యం. ప్రేమ ఒకరు శపిస్తే చచ్చిపోదు. ఒకరు కాల్చేస్తే మండిపోదు. ఒకరు తోసేస్తే కూలిపోదు. నింగీనేలా నిలిచివున్నంతవరకూ ప్రేమ వుండితీరుతుంది. ప్రేమ నిత్యమైనది. సత్యమైనది. అజరామరమైనది. ప్రేమే జీవితం, జీవితమే ప్రేమ. ప్రేమలేనిదే జీవితంలేదు ప్రేమ అంతకంటె సున్నితమైనది... దాన్ని గుండె గదుల్లో భద్రపరుచుకోవాలి. పువ్వుకంటె పదిలంగా చూసుకోవాలి... అదీ ప్రేమంటే.

"మీరంటూ వుంటారే సంపన్నత, అంతస్తు, హోదా అని- అందులో అసలే వుండదు. ఇపుడున్నవన్నీ అబద్ధపు దాంపత్యాలు, బలవంతపు బతుకులు. ఎవరో తోస్తే కదులుతున్న జీవితాలు, సంప్రదాయం పేరిట, వారసత్వంపేరిట వంశగౌరవంపేరిట. ఏడుస్తున్న ఎడ్జెస్టమెంట్స్. అందుకే ఈ దేశంలో వేశ్యావృత్తి తామరతంపరగా వర్ధిల్లుతున్నది. ఇష్టంలేని మనిషితో కాపురం చేస్తూ, ఇష్టమున్న మనిషితో చాటుగా కులకడం - అదీ ఈ దేశపుగొప్ప సంస్కృతీ, సంప్రదాయాల విలువైన వారసత్వం. కృతకమైనదీ, అసహ్యామైనదీ అయిన ఈ అబద్ధపు బతుకు నాకొద్దు డాడీ! నాకు ప్రేమ కావాలి. నేను ప్రేమించేవాడు కావాలి, నన్ను ప్రేమించేవాడు కావాలి. అదీ నేను కోరుకునేది. వస్తా డాడీ... గుడ్‌బై" అని విసురుగా లాన్‌వైపు పరుగెత్తింది ఇంకొక్క క్షణం కూడా అక్కడ బతకలేనన్నట్టు ప్రియుణ్ని చేరుకోడంలో క్షణం ఆలస్యం వుండకూడదన్నట్టు వెళ్లిపోయింది.

నిశ్చేష్టుడై తలపట్టుకుని అలాగే కూర్చుండిపోయరాయన. ఎదిరించడమనేది ఎలా వుంటుందో ఆయన జీవితంలో మొదటిసారిగా చూశారు. దీని చివరి అంచుఎలా వుంటుందో వూహించుకునేసరికి వారి శరీరం జలదరించింది. ఎలా జరగబోయినా తాననుకున్నదానికి కట్టుబగి వుండాలనుకున్నారు.



ప్రసూనకు భూషణ్‌తో తొలిపరిచయం విరోధంగానే జరిగింది. అది కూడా కాలేజీ ఫంక్షన్ రోజున - తను నలుగురి మధ్యా వెళ్తుంటే

ఎవరో అడ్డొచ్చారు.

"ఏమిటి? ఇదంతా అందమే!" అంటూ ఒకతను అడ్డొచ్చి ఆశ్చర్యం అభినయించాడు. చుట్టూ మూగిన స్టూడెంట్స్‌లో నవ్వులు పగిలాయి. అవి అంతటా తుళ్లాయి.

"అబ్బ... అందానికి నోరొచ్చింది. కళ్లు పుట్టాయి. చెవులు మొలిచాయి. ఒరే... అందం కదులుతుందిరా, ఓరిదేముడో బంగారు బొమ్మకి ప్రాణంపోశావు. మామధ్య వదిలావు. మమ్మల్ని అల్లరిపెట్టి వినోదిస్తున్నావు. ఓరిముసలి బ్రహ్మ... ఎంత సరదారా నీకు" అంటూ అతనో పాట మొదలెట్టాడు.

కాళ్లమీద కూర్చుని కోతిలా అభినయించాడు. మూతివుండలాచుట్టాడు. చేతులు రెండూ చెవుల దగ్గర వుంచి ఆడించాడు. తర్వాత డిస్కో డాన్సు ఆరంభించాడు. సర్కస్ ఫీట్స్‌లా అన్ని అంగాల్నీ విరిచేశాడు. ఆఖర్న కిందపడి అక్కడ మెలికలు తిరిగి, తర్వాత చేతులు నేలమీద ఆన్చి కాళ్లుపైకి లేపి అలా గాలిలో కాసేపు ఆడించి, తిరిగి అడ్డంగా వాలి కాలిబొటన వేలిమీది నుంచి పైకిలేచాడు. మొత్తం అంగాంగం కదుపుకుంటూ అలా డాన్సు చేస్తూనే పైకిలేచాడు. అసలు ఆ మనిషి కీళ్లు అనేవివున్నాయా లేవా అన్నట్టుంది ఆ డాన్సు.

ఆమె అతనికేసి తీవ్రంగా చూసింది. ఆ చూపులో తీవ్రవేసవినాటి తీక్షణకిరణాలు చురచురలాడాయి. అవి చూపులో, అగ్నిజ్వాలలో అతనికి తెలియలేదు. అవి తూటాలో, నారీశాపాలో అతనికి బోధపడలేదు.

ఆమె విసురుగా చెయ్యెత్తింది. అది జోరుగా దిగి, అతని చెంపని తాకేంతలో అతని చేయి ఆమె చేతిని కలిసి అడ్డుకుంది. ఆమె చేతిని పట్టుకుని తన చేతుల్లోకి తీసుకుని అతను కిందికి దింపాడు. ఆమె చేతి వేళ్లు విప్పి అరచేతిని చాపాడు. ఆ అరచేయి చిగురుటాకులా లేతగా, కొనరుమొలకలా మెత్తగా, ఇంకా ముదురుకురానట్టు పచ్చిగా, అప్పుడే పుట్టినట్టు పసిగా వుంది.

"గిల్లితే ఎర్రగా కందిపోయే చేయి. నొక్కితే లేతగా రక్తం చిమ్మే చెయ్యి. ఈ చేత్తో కొట్టడమే. ఇంకేమైనా వుందా! కొడితే ఈ చేయి ఎన్నాళ్లు మూతపడేనో" అతను బుజ్జగిస్తున్నట్టు నోటితో శబ్దం చేసి, ఆ అరచేతి మీద తన చేతిరెండు వేళ్లూ వుంచి, అక్కడ ఆడించి, వాటిని తిన్నగా చేతిమీదివరకూ పాకించి, అప్పుడు భుజాల గుండా కంఠం మీది నుంచి పెదాల వరకూ తీసుకువెళ్లి అక్కడ ఆపాడు..

ఆమె లేతపెదాల మీద, పల్చని పెదాల మీద, ఎర్రపెదాల మీద అతని రెండు చేతివేళ్లూ వుంచి, మెత్తగా నొక్కి, సున్నితంగా తీసి ఆ వేళ్లను తిరిగి తన పెదాలకు నుతారంగా ఆన్చి ముద్దుపెట్టుకున్నాడు.

ఇప్పుడు అతను పట్టుకున్న చేతిని, తన పెదాల దగ్గరకు చేర్చి అలాగే ఆమె చేతి వేళ్లను, తన పెదాల వరకూ తీసుకువచ్చి మెత్తగా చుంబించి, సున్నితంగా ఆమె పెదాల దగ్గరకు చేర్చబోయాడు.

అంతే! ఇదే అవకాశంగా, అతను వూహించడానికి కూడా అందనంత మెరుపు వేగంతో ఆమె తన రెండో చేత్తో అతని చెంపఛెళ్లుమనిపించింది. తగిలిన ఆ దెబ్బనుంచి వచ్చే శబ్దాన్నిబట్టి అంతవిసురు అంతబలం తనకున్నాయని ఆమె ఆశ్చర్యపోయేంత గట్టిగా తగిలింది ఆ దెబ్బ.

హఠాత్తుగా జరిగిపోయిన ఈ సంఘటనకు అక్కడున్న అందరూ నిశ్చేష్టులైపోయారు. ఇలా అవుతుందని అంతకుముందు ఎవరూ అనుకోలేదు. ఏదో ఆట పట్టించడమేకదా, కాకపోతే అంతకుముందు ఆ అమ్మాయి మనస్తత్వాన్ని పట్టి కాసేపు ఉడుక్కుని, మరికాసేపు ఏడ్చి వెళ్లిపోతుందనుకున్నారు. తర్వాత 'సారీ' చెప్తేసరిపోతుంది. ఇక గొడవ చల్లారిపోయినట్టే అనుకున్నారు.

అతనైతే దాదాపు స్థంభించిపోయాడు. కొయ్యబారిపోయాడు.

"రాస్కెల్... ఎంత ధైర్యం నీకు" ఆమె రౌద్రమూర్తే అయింది. ఆమె గుండెలో అగ్నిపర్వతం బద్దలైంది. కళ్లనుండి విస్ఫులింగాలు దూసుకువచ్చాయి.

ఆ షాక్ నుంచి కొంత తేరుకున్నాక అతనికి బాధ అనిపించింది. కొంతబాధతోనూ, కొంత పౌరుషంగానూ అన్నాడు- "ఔను... నాది ధైర్యమే... ఆ ధైర్యం నాకు పేదరికం నుంచి వచ్చింది. నా పేదరికమే నాకాసాహసం.

నేర్పింది. మీ డబ్బు మీకు పొగరుమప్పు తుంది. తలబిరుసు అలవర్చుతుంది. ఇతరు ల్ని హీనంగా చూడ్డం వంటబట్టిస్తుంది. కాని నా పేదరికం నాకు ప్రేమనేర్పుతుంది. ఇతరు ల్ని ప్రేమించడం మప్పుతుంది. మాకు మన సులుంటాయి. అవి అందరికోసం ఆరా టపడతాయి. మీకు మనసులుండవు. ఆ స్థా నంలో ఇనప్పెట్టెలుంటాయి. బ్యాంకు ఎకౌంట్లు వుంటాయి. లాభనష్టాల ఎకౌంట్సుంటాయి. మీకు ప్రేమించడం చాతకా దు... అసలు తెలీదు. అసలీ ప్రపంచంలో ప్రేమనేది ఒకటుందని అది ఎంతో విలు వైందని మీరెప్పుడూ అనుకుని వుండరు. పువ్వుల్ని ప్రేమించొచ్చని, పసిమనసుల్ని ప్రే మించొచ్చని మీరు ఊహల్లో కూడా భావించి వుండరు. మీ మైండ్ కమర్షియలైజ్ అయి పోయివుంటుందెప్పుడూ. మీలో జరిగేది అంతా వ్యాపారమే. పెళ్లాడితే ఏంలాభం - పిల్లలు పుడితే ఏం లాభం అని ఆలోచిస్తారు. మొగు డూ పెళ్లాల మధ్యేకాదు - తల్లీపిల్లల మధ్య కూడా మీలో సాగుతున్నది వ్యాపారమే... ప్రేమ కాదు. మీ ఆస్తులు కుప్పకూలిపోయినప్పుడు మీలో బంధుత్వాలు కూడా విచ్చినమైపో తాయి... తెగిపోతాయి. కాని మా పేదరికం మాకు మంచితనం మప్పుతుంది. కలి సుండటం నేర్పుతుంది. కళ్లు తెరుచుకో, గుండె తెరుచుకో, చుట్టూవున్న ప్రపంచాన్ని చూడు. ప్రేమించడం అలవాటు చేసుకో, మని షిగామారు మనసున్న మనిషిగా మను"

అతను అనవలసినమాటలు పూర్తిగా అనేసి కొంతసేపు వూరుకుని అప్పుడు ఆలో చించడం ప్రారంభించాడు. ఇంతలో ఆవే శంకూడా పూర్తిగా అణగారిపోయింది. రాత్రికి మంచులో తడిసిన పువ్వులు, సూర్యోదయానికి వయ్యారంగా రేకులువిచ్చుకుని వికసించిన ట్టు అతని మనోనేత్రంముందు జ్ఞానసీమ వెల్లి విరిసింది.

ఔను.. తను చేసింది తప్పే. అతమంది స్టూడెంట్స్‌మధ్య తను అలాచేసివుండాల్సింది కాదు. ఆమెను అవమానించడానికి, కోపింపచే యడానికి. ఆమెచేసిన తప్పేమిటి? ఆమెపట్ల తను అలా ప్రవర్తించడానికి తనకుగల హక్కే మిటి? ఏ చొరవతో ఆమెపట్ల తనలా ప్రవ ర్తించాల్సివచ్చింది.

ఎవరో రెచ్చగొడితే తను రెచ్చిపోవడమే మిటి? మరెవ్వరో రెచ్చగొట్టారని, ఇంకెవరో తన పట్ల ఇదేవిధంగా ప్రవర్తిస్తే తాను నవ్వుతాడా? ఏడుస్తాడా? ఆమె కొక నీతి, తనకొక నీతి వుండదుకదా? ఒకే నీతి ఇద్దరిపట్ల వేర్వేరుగా వుంటుందా? తను ఖచ్చితంగా తప్పుచేశాడు, స్పష్టంగా నేరంచేసాడు.

అందుకు తలవంచుకున్నాడు. చాలా మృ దువుగా, మెల్లగా అన్నాడు "సారీ మిస్... తొందరలో నేను ఆలోచనారహితంగా క్షణికావే శంలో తప్పుచేసాను. అందుకు సిగ్గుపడుతు న్నాను. నేను మీపట్ల అధికచొరవతో ప్రవర్తించా ను. నేను ఈవిధంగా ప్రవర్తించివుండాల్సిందికా దు.

ఈరోజు కాలేజీఫంక్షన్. ఎప్పుడూ ధుమధు మలాడేవారుకూడా ఈరోజు నవ్వుతారు. ఎప్పు డూ రుసరుసలాడేవారుకూడా ఈ రోజు సరదా గావుంటారు. మీరు మాతో కలవడం లేదు సరికదా ఒక ప్రత్యేక హోదా కల్పించుకుని దూరంగా వుండిపోతున్నారు. నగరంలోవుండి కాలేజీలోవుంటున్నప్పటికీ, అడవిలో వున్నట్టు ఒంటరిగా, ఏకాంతంగా, ఒక కృతకవాతావరణా న్ని కల్పించుకుని అందులో లీనమైపోతున్నా రు. అందుకే అందరికీ మిమ్మల్ని ఉడికిద్దా మని, ఏడిపిద్దామని వుంటుంది. కాని మిమ్మ ల్నిచూసి అందరూ భయపడతారు. కారణం మీనాన్నగారు జిల్లాజడ్జి. పోలీసులచేత ఎక్కడ తన్నిస్తారోనని భయం. ఎక్కడ కేసుపెట్టి జైల్లో తొక్కిస్తారోనని బెదురు. కాని నాకాభయంలేదు. అందుకే ధైర్యంచేసాను. ఇది మిమ్మల్ని నవ్వించడానికి చేసిన ప్రయత్నమేకాని మిమ్మ ల్ని అవమానించాలనికాని, ఏడిపించాలని కాని నా ఉద్దేశంకాదు... ఆ అభిప్రాయం నాకెంతమాత్రంలేదు. ఇందులో కొంతదూరం వెళ్ళినమాట నిజమే. నేను మనఃపూర్వకంగా ఒప్పుకుంటున్నాను. హృదయపూర్వకంగా అర్థి స్తున్నాను. నన్ను క్షమించండి. మీరు విధించ బోయే ఏశిక్షకైనా నేను సిద్ధంగావుంటాను. అమలుచేయడంలో మీదే ఆలస్యం- శెలవ్... బై"

అనేసి అతను వెళ్ళిపోయాడు- వెనక్కి

తిరిగిచూడకుండా వెళ్ళిపోయాడు.

ఆమె స్థాణువైంది నిశ్చేష్టఅయింది ప్రాణంలేని రాతిబొమ్మే అయింది; ఈ జరిగిన సంఘటన ఆమెను కలచివేసింది. అతలాకుతలంచేసింది. ఈ సంఘటన ఇలాజరగకూడదు. అసలు జరిగివుండాల్సింది కాదు.

తనొక పొగరుమోతు, పార్టు టెంపర్మెంటు- అని అందరూ అనుకుంటారు. తనొక జడ్జి కూతురుకావడంచేత, తమ చుట్టూ పోలీసుయంత్రాంగం పరిభ్రమిస్తూ వుండటంచేత తనకు తలబిరుసు అనుకుంటారు.

కాని అది నిజంకాదు. తను రిజర్వుడు. ఎవరితోనూ మాట్లాడదు. ఎవరితోనూ కలిసుండదు. ఒకర్తే విడిగా కూర్చుంటుంది. కాబట్టి అయినా కాకపోయినా తనొక పొగరుమోతు. ఇదీ బయటకు కనిపించే తన బాహ్యస్వరూపం. కాని తన అంతరంగమధనం ఎంతమందికి తెలుసు. తన మానసిక క్షోభ ఎంతమందికి కనిపిస్తుంది. తన అసలు కథ ఎవరికైనా ఎలాతెలుస్తుంది. తానెలా చెప్పుకోగలదు.

పుట్టగానే తల్లిప్రేమ అంటే ఏమిటో తెలియకుండా పుట్టింది. పెరుగుతూ బంధువుల ఆసరా ఎలావుంటుందో ఎరగకుండా పెరిగింది. ఎవర్ని పలకరించాలో, ఎలా పలకరించాలో అసలు తెలియనేతెలీదు. ఆడుతూ, పాడుతున్న వయసుల్లోకూడా సోఫాలమీద కూర్చుని, పిల్లోమీద పడుకుని, ఒకర్తే ఏకాకిగా చదువుకోడమే తనకు తెలిసింది. బిక్కుబిక్కుమంటూ చీకట్లో భయపడుతూ, వెల్తుర్లో బొమ్మల్ని చూసుకుంటూ, ఆ బొమ్మలే- ప్రాణంలేని బొమ్మలే, చలనంలేని బొమ్మలే స్నేహితులుగా తలచుకుంటూ మౌనంగా పెరగడమే తనకు తెలిసింది.

బహుశా ఆ ఒంటరితనమే తనకు తెలీకుండానే తనలో తెగింపు, పెంకితనం, పుట్టుదలతెచ్చాయి. నాకెవరూ లేరు నేనెవరికీ అక్కర్లేదు, ఎవరికీ ఏమీకాను- అనే భావమే తనలో ఒకర్ని ఖాతరుచేయని భావాన్నిపెంచి పోషించింది.

దీని కారణంగానే తను నవ్వులపాలవుతున్న సంగతి ఇప్పుడీ బాంబు బద్దలవడంతో స్పష్టంగా తెలిసిపోయింది.

నిజానికి అతనెంతో మంచివాడుకాబట్టే తన గురించిన నిజాన్ని తనకు తెలియజెప్పాడు. అతను అంతమంచిగా చెప్పివుండకపోతే, రెచ్చిపోయిన మరెవ్వరయినా రేపు మరోవిధంగా ప్రవర్తించివుండేవారు. తనను ఇంకెంతగా అవమానించివుండేవారో అప్పుడు తాను దిక్కుతోచక కుమిలిపోతూ ఎంతటి అఘాయిత్యానికి తలపెట్టివుండేదో- అంతటి ఘోరం తప్పించిన విశాలమూర్తి ఇతను. ఒకరకంగా ఇది తనకు మేలుచేసినట్టే. నిజానికతను సున్నితంగా, హాస్యంగానే ప్రవర్తించాడు. తానే తొందరపడి రెచ్చిపోయి బాధ్యతారహితంగా అతణ్ని అవమానించింది. అతణ్ని ఎలాగైనా కలుసుకుని క్షమాపణవేడుకోవాలి అనుకుంది.

ప్రసూన మెల్లగా రెయిలింగ్ పట్టుకుని మెల్లగా మెట్లు దిగింది. అలా దిగుతున్నప్పుడు ఆమె మనసులో సుడిగుండం ఏర్పడి ఆమెను లాక్కుపోతోంది. కదలికెరటాలు అల్లకల్లోలం చేసి వదిలిపెడుతున్నాయి. ఆమెలో స్తబ్దత అలుముకుంది. నిస్సత్తువ ఏర్పడిపోయింది.

ఇక ఆమెఅలా ఎంతోసేపు మెట్లు దిగలేకపోయింది. అయినా తప్పదు. జనాలకి అడ్డు. మెల్లగా ఒక్కో మెట్టూ దిగి కిందికివచ్చేసింది. అప్పుడు మరి కనపడలేనని తేల్చుకున్నాక మెట్లపక్కకి తప్పుకుంది. అక్కడ కూర్చుంటే పదిమందిలో పరువు తక్కువ, నిల్చుంటే కాళ్లు నొప్పెట్టుకుపోతున్నాయి. తెగపీకుతున్నాయి. అయినా అలానే సత్తువకూడదీసుకుని ఒంటరిగా నిల్చుండిపోయింది.

ఆమె మనసులో ఆరాటం ఉధృతమైంది. గాలికి ఎగురుతున్న ఎండుటాకులా రెపరెపలాడింది, వూగుతున్న తెరలులా విలవిల్లాడింది.

ఎందుకు జరిగిందిది. ఎలా జరిగిందిది. జరగాలనే జరిగిందా? జరగకూడనిదే జరిగిందా? ఇలా జరగడంవలన ఏర్పడబోయే పరిణామమేమిటి? ఆమె మనసు ఒక నిశ్చయానికి రానట్టు కుతకుతలాడిపోతున్నది.

ఫంక్షన్ కార్యక్రమాలు పూర్తయిపోయాయి. అందరూ వెళ్ళిపోతున్నారు. ప్రతిఒక్కరూ ఆమెను చూసారు. ఎవరికీ పలకరించడానికి ధైర్యంచాలలేదు.




# నాగార్జున సిమెంటు వారి మినీ హాస్యకథ

ఉత్పాదకులు యస్.సి.యల్. ఇండస్ట్రీస్

ఆదిదేవుడు విష్ణుమూర్తి ఏమితోచక, శేషతల్పం మీదపడుకుని గోళ్ళుగిల్లుకుంటూంటే, ఒక ఆలోచన వచ్చింది. వెంటనే బ్రహ్మని పిలిపించాడు. "ఈ మధ్య కలికాలం వచ్చి ప్రజల్లో దేవుళ్ళంటే నమ్మకం పూర్తిగా తగ్గిపోయింది. సో మన ఉనికిని వాళ్ళకి మళ్ళీ తెలియ చేయ్యాల్సిన అవసరం ఉంది కనుక, నువ్వు మళ్ళీ ఒకసారి, భస్మాసురుణ్ణి సృష్టించు. మనం మోహినీ భస్మాసుర ఘట్టం మరోసారి ఏక్టుచేసి, మన గొప్పతనం ఏంటో తెలియ చేద్దాం" అన్నాడు. సరేనని తలవూపి వెళ్ళిపోయాడు బ్రహ్మ. వారు అనుకొన్నదే తడవు, భస్మాసురుడు మళ్ళీ జన్మించాడు. మళ్ళీ తపస్సు చేశాడు యథాప్రకారం శివుడు ప్రత్యక్షమై, ఎవరి నెత్తినైనా చెయ్యి పెడితే వాళ్ళు భస్మమైపోయేలా వరం ఇచ్చాడు. శివుడి నెత్తి మీదనే ప్రయోగించి తెలుసుకుంటానన్నాడు భస్మాసురుడు. శివుడు పరుగులంకించుకున్నాడు. భస్మాసురుడు తరుముతున్నాడు. ఇక విష్ణుమూర్తి తమ పాత్ర పోషించవలసిన టైమొచ్చిందని, ఆదారిలో, ఓ చెట్టు దగ్గరికి వచ్చి వైట్ చేస్తున్నాడు. ఏమైందో కాని, ఎంత వేచిచూసినా, శివుడు పరిగెత్తుకొంటూ




అక్కడికి రాలేదు. ఒకరోజు గడచి పోయింది. విసుగెత్తి విష్ణుమూర్తి వెళ్ళిపోబోతుంటే, శివుడు విలాసంగా నందినెక్కి అక్కడికి వచ్చాడు. విష్ణుమూర్తి ఆశ్చర్యపోయాడు. "ఏమిటయ్యా, భస్మాసురుడిడి, నేను మోహినీ అవతారం దాల్చకుండానే, నువ్వే ఫినిష్ చేసేశావా" అన్నాడు. "అదేంకాదు స్వామి భస్మాసురుడి బారినుండి తప్పించుకోవడానికి, యథాప్రకారం పరిగెడుతుంటే, మధ్యలోనే, ఆయాసం వచ్చింది. కాసేపు అలసట తీర్చుకుందామని, ఒక మేడలోకి దూరబడ్డాను. తలుపులు బిగించాను. ఆశ్చర్యం, వైష్ణవ మాయకన్నా అద్భుతం జరిగింది. భస్మాసురుడు తరుముకుంటూ వచ్చి, ఆ మేడ మీద చెయ్యి పెట్టాడు. కానీ అది భస్మం కాలేదు. పాపం రాత్రంతా ట్రై చేశాడు. కానీ అది భస్మం కాలేదు. విసుగెత్తి వెనక్కి వెళ్ళి పోయాడు. తరవాత నేను, ఆరాతీస్తే తెలిసింది, ఆ మేడ నాగార్జున సిమెంటుతో కట్టారుట. అందుకే ఆ మేడ భస్మం కాలేదుట" అని విన్నవించాడు శివుడు. విష్ణుమూర్తి తెల్లబోయాడు. "ఈ మానవులు మన వర ప్రభావాన్ని కూడా వమ్ము చేయగల నాగార్జున సిమెంట్ని కనిపెట్టారంటే, వీళ్ళు మనకన్నా తెలివైన వాళ్ళు, పదండి స్వామి పోదాం" అన్నాడు శివుడు. విష్ణుమూర్తి కూడా శివుడి వెనక నంది నెక్కి కూర్చున్నాడు. ఇద్దరూ అదృశ్యమయ్యారు.

MAM 112

ఆఖర్న అతను వెళ్లిపోతూ హఠాత్తుగా ఆమెను చూసి ఒక్క నిమిషం ఆగాడు. ముందడుగువేయబోతూ ఒక్కక్షణం ఆలోచించాడు. తటపటాయిస్తూ వెనక్కిఅడుగులు వేసి ఆమెను సమీపించాడు. ఒక్కసారి ఆమె ముఖంకేసి చూసాడు.

ఆమె ముఖం పాలిపోయివుంది. అతనికి బాధకలిగింది. ఇతరుల మాటలకు విలువిచ్చి, అనవసరంగా అవమానించి తప్పుచేసానని పించింది. అతను కరిగిపోయాడు.

ఇక ఒక్కక్షణం ఆలస్యంచేయలేదు. "సారీ మిస్... మీరింతలా బాధపడతారని తెలిస్తే ఈ చొరవతీసుకునేవాడినికాదు. ఫంక్షన్‌రోజుగదా! ఏదో లైట్‌గా తీసుకుంటారనుకున్నాను. ఐయామ్ రియల్లీ సారీ! మీకెలా క్షమాపణలు చెప్పాలో తెలియడంలేదు" అన్నాడు గాద్గదికంగా.

ఆమె తలెత్తి చూసింది. అతని ముఖంలో నిజాయితీ వుంది. గుండె ధైర్యం, ఆత్మవిశ్వాసం కూడా వుంది. తెగింపు, పెదాలమీద మాసిపోని చిరునవ్వు కష్టాల్ని ఎదుర్కొగలనన్నంత ధీమాగా వుంది. కళకళలాడుతూ వెలిగిపోతున్న ఆ ముఖం మొత్తం ప్రపంచాన్నే ఛాలెంజ్ చేయగలంత శక్తివంతంగా వుంది.

రాజ్‌భూషణ్ ప్రేమలోనే కాదు - వ్యక్తిత్వంలో కూడా రాజసం వుట్టిపడుతున్నది.

ఆమె అతడ్ని ఆశ్చర్యంతోనూ, విభ్రమంతోనూ చూస్తూ వుండిపోయింది.

అతను మరోసారి అన్నాడు "నన్ను క్షమించలేరా? అంత దయ మీలోలేదా?"

అప్పుడు ఆమె తేరుకుని ఈ లోకంలోకొచ్చింది. తొట్రుపాటుపడింది. మాటలు గలగల రావడంలేదు. తొలిసారిగా సిగ్గు అంటే ఏమిటో అనుభూతిలోకి వచ్చింది. మొదటిసారిగా స్త్రీపురుషుల మధ్య ఉండే పరస్పర ఆకర్షణ సన్నగా వొణికిస్తూ నరాల్లోకి పాకింది.

ధైర్యం కూడదీసుకుని- "లేదు... నేనే మీకు క్షమాపణచెప్పుకోడానికి ఇంతసేపూ ఇక్కడవున్నాను" అంది- వొణుకుతున్న గొంతుతో మాటలు తడబడగా.

భూషణ్ తేలిగ్గా నవ్వేశాడు. అతనిలో వున్న ఆ కాస్త బరువూ దిగిపోయినట్లయింది. "భలే వారే - జడిపించేశారు. తప్పు నేనుచేస్తే మీరు క్షమాపణ చెప్పుకోవడమేమిటి?"

"పదిమందిముందు మిమ్మల్ని కొట్టాను కదా"

"అలా కొట్టడానికి గల కారణం నా ప్రవర్తనలోనే వుంది. మరేం ఫర్వాలేదు"

"ఏమైనా సరే... ఒక స్త్రీ ఒక పురుషుడి మీద చెయ్యిచేసుకోటం..."

"అబ్బో! మీలో కూడా ఆడతనముంది!" భూషణ్ అన్నాడు నవ్వుతూ.

"ఏం?... నేను ఆడదాన్ని కాననుకున్నారా?" ప్రసూన మరింత సిగ్గుపడుతూ అంది.

"కారనే ఇన్నాళ్లూ అనుకున్నాను" మరింత కొంటెగా అన్నాడు భూషణ్.

"అదేం కాదు - నాకు మనిషి ఎదటపడి మాట్లాడ్డం అలవాటులేదు"

"కొంత తెలుసు, కొంత వూహించాను"

"మరి అయితే నాలో తప్పువుందని మీరెలా అనుకున్నారు?"

"నేనయితే అనుకోను కాని మిగిలినవారంతా నాలాంటివారే కాదుకదా"

"మీరనుకోకపోతే నాకంతేచాలు"

"ఏమిటట నాలో ఆ ప్రత్యేకత" అతనికి అంతులేని ఆశ్చర్యం వేసింది.

"మనసున్న మనిషిగా"

"అదేమిటి- నా ఒక్కడికేనా మనసున్నది. మిగతా మనుషులు మనసులులేకుండానే బతికేస్తున్నారా- థాంక్‌గాడ్"

"ఏమో... నాకు తెలీదు. పోనీ మీరు నా గురించి ఏమీ అనుకోరుగా"

"అనుకుంటాను"

"అదేమిటి?"

"బయటకి గంభీరంగా కన్పించినా లోపలంతా డొల్లేననీ, చాలా మెత్తటి మనసనీ, చాలామంచి మనిషనీ, పుట్టతేనెలా కల్మషంతా కని సౌందర్యమనీ"

ఆమె ఇప్పుడు వూపిరి పీల్చుకుంది. అతన్ని కొట్టేయాలనిపించింది "పోండి - మీకు అబద్ధాలాడ్డం వచ్చు, మాటలతో ఏడిపించడం




తెలును''

"ఇంకొకటి కూడా తెలును. ఇది మాత్రం నాకు తప్పవేరెవ్వరికీ తెలియనిది"

"ఏమిటది?" ఆమె ఇంకా ఎక్కువ ఆశ్చర్య పోయింది.

"మీకిన్ని మాటలొచ్చని, మీలో ఇంత వకాబ్యులరీ వుందని"

"ఔను... నిజమే. నేనిన్ని మాటలాడానేమిటి ఈరోజు. అనలిన్ని మాటలు నాకెలా తెలిసాయబ్బా? ఔను... నిజమే మీరు చెప్పేవరకూ నేనే తెలుసుకోలేకపోయాను"

"మాట్లాడండి, ఇంకా ఎక్కువ మాట్లాడండి. అలసిపోయేంతవరకూ మాట్లాడండి- వన పిట్టలా మాట్లాడండి. అందరూ ఆశ్చర్యపోయేంతగా మాట్లాడండి. నవ్వండి ఇంకా నవ్వండి. అలా నవ్వుతూనే వుండండి. మీకేం భయంలేదు. నేను పక్కనుంటాను" అతను యధాలాపంగా భరోసాయిచ్చాడు.

కాని ఆ భరోసాయే ఆమె అభయంగా తీసుకుంది- "నిజంగానా?"

అప్పటికిగాని అతనన్నదేమిటో అతనికి అర్థంకాలేదు. "ఏమిటి?"

"మీరు నా పక్కన వుంటారా?" ఆమె ప్రాధేయపూర్వకంగా అడిగింది.

"ఎందుకు?" ఇప్పుడు అనుమానించడం అతని నంతైంది.

"నాలో భయం పోగొట్టడానికి" అది ఆమెలో దృఢనంకల్పం.

"ఇప్పుడుపోయింది కదా?" ఇప్పుడు అతనిలో భయం మొదలైంది.

"కాదు... ఇంకా పోడానికి, నేను మనిషిగా మారడానికి" ఆమె ధైర్యంగా అంది.

"ఇప్పుడు మీరు మనిషికారా?"

"కాను... నేనూ ఒక మనిషనే జీవం వున్న శవాన్ని. నడుస్తున్న అస్థిపంజరాన్ని. ఇలాక్కాదు నేనుండవలసింది. మీరు ఉపన్యాసాలిస్తుంటారే అందులో మనిషిగా" అలా అంటున్నప్పుడు ఆమె కళ్లు మెరిసాయి. ముఖం వెలిగింది.

ఆమె అలా చూడ్డంతో భువన్‌లో ఎక్కడలేని ధైర్యం వచ్చింది. ఆమె అలామారుతున్నందుకు ఎంతో సంతోషం కలిగింది. ఆ మార్పుకి తనేకారకుడైనందుకు ఎంతో గర్వం వచ్చింది. ఒక మనిషినైనా మార్చగలిగాను కదా అన్న ఆనందం కలిగింది. ఆ మారిన మనిషికి వెన్నుదన్నుగా నిలవాలనిపించింది. అంతే! ఇక ఆలోచించలేదు.

"ఉంటాను... నిర్భయంగావుంటాను. మీరొకమనిషయేంతవరకూ వెన్నుదన్నుగా వుంటాను. నేను మీ పక్కనుండగా మీరెలాంటి సంకోచంలేకుండా ముందడుగు వెయ్యండి. మీరు వేసిన ప్రతి అడుగు మీద నా అభయహస్తం వుంటుంది. పెనుతుఫానులకు పెనుగాడ్పులకు, ప్రళయ భూకంపాలకు, విలయ విధ్వంసమారణకాండకు వెరవక ముందు చూపు మాత్రమే కలిగి ముందడుగు వెయ్యండి. అన్ని విషయాల్లోనూ మీవెంట నేనుంటాను. రాణీరుద్రమలాదూకండి. ఝాన్సీలక్ష్మిలా పోరాడండి. అసలైన భర్తకు సిసలైన భార్యలా నిలవండి. ప్రతి అన్యాయాన్ని ప్రతి అక్రమాన్ని ఎదిరించి నిలవండి. మీ పక్కనేనుంటాను. నేనుండగా మీకెలాంటి భయాలూ వద్దు"

అతని ప్రతిమాటా ఆమె రక్తంలో ఇంజెక్టయింది. అతని ప్రతిపలుకు ఆమె నరాల్లో శక్తినింపింది. ఒక వింతతేజస్సు ఆమెను ఆవహించుకుంది.

అతను చేయి అందిచ్చాడు. ఆమె చేయి అందుకుంది. చేతిలో చేయికలిపింది. చేతి మీద చేయిపెనవేసుకుంది. చేతిలో చేయి ముడుచుకుంది. బిగించిన పిడికిలిలో సత్తువ కేంద్రీకరించింది. బలం ఉక్కుదిమ్మలా ముద్ద కట్టింది.

ఆ చేయి ఆమెను వినువీధుల్లో తిప్పింది. ఆకాశపు అంచుల్ని తాకింది. అవనీ అంబరం ఏకమైన చోటకు తీసుకువెళ్లింది. నర్వలోకాల్నీ చూపెట్టింది. సమస్త ప్రపంచాన్నీ ఆవిష్కరించింది.ఆ చేయి ఆమెలో భయాల్ని పోగొట్టింది. ఆ చేయి ఆమెను మనిషిని చేసింది. ఆ చేయి ఆమెను సర్వమానవమూర్తిగా మలిచింది. ఆ చేయి ఆమెకు రాక్షససంహారం నేర్పింది.

ఆ చేయి, ఆ చేయి ఔను సరిగ్గా ఇప్పుడు

ఆ చేయి ఆమెను విడిచెయ్యబోతున్నదా, వది లెయ్యబోతున్నదా 'హే భగవాన్ ఇప్పుడు నాకే దిదిక్కు'

ఆమెలో ఆందోళన, ఉద్వేగం కట్టలు తెంచుకున్నాయి. పిడికెడు ప్రేమకోసం ఆరాటపడింది. పట్టెడు ప్రేమకోసం ఆశపడింది. గుప్పెడు ప్రేమకోసం ఎదురుచూసింది. అవి చేతికి అందుతున్నంతలో చేతినుంచి జారిపోతున్నదా?

ఆమె పరుగులో కంటిముందు తెరలా నిలిచిన గతం కరిగిపోయి ఎదురుగా లాన్స్పష్టంగా కన్పించింది. లాన్‌లో అతను నిల్చుని కనిపించాడు.

పరుగుపరుగున వెళ్ళి అతణ్ని కలుసుకుంది. అలసటతగ్గాక ఒక్కసారి వూపిరి తీసుకుంది. "పదభూషణ్ - ఎక్కడికైనా దూరంగా వెళ్లికాసేపు కూర్చుందాం"

పదినిమిషాల తర్వాత ఇద్దరూ ఫైవ్‌స్టార్ హొటల్‌కి సమీపంలో, సముద్రానికి అతితక్కువ దూరంలో ఎవరికీ కనిపించని చోట కూర్చున్నారు.

ఏకాంతం దొరికేసరికి ఆమెలో ఒక్కసారిగా ఆవేశం పెల్లుబుకింది. అతని గుండెల మీద పడి వెక్కివెక్కి ఏడ్చింది. కన్నీరు కాల్వలు కట్టినట్టు ఏడ్చింది. జీవితంలో మొదటిసారి ఏడవడం వల్లనేమో వున్న కన్నీళ్లన్నీ పొంగివచ్చేవరకూ ఏడ్చింది. ఏడ్చిఏడ్చి ఏడవడానికి మరి సత్తువలేనప్పుడు ఆగిపోయింది.

"చెప్పు భూషణ్- మా నాన్నగారు అన్నమాటలకు నీ ఆత్మాభిమానం దెబ్బతిందికదూ.



పడిచి పడితావా? ఎదలస్తావా? ఇప్పుడు నన్ను కాదంటే మధ్యలో నేనేమైపోవాలి. చెప్పు భూషణ్ మాట్లాడవేం''.

అతను కొంతసేపు పోనిచ్చి, చాలా ఆలోచించిన తర్వాత ఇలా అన్నాడు-

''నువ్వు ఇంతదూరం తీసుకువస్తావనుకోలేదు ప్రసూనా! స్నేహం వరకే పరిమితమై అక్కడే ఆగిపోతావనుకున్నాను. ఇందులో నా తప్పు కూడా కొంత వుంది- కాదనను. కాని సృష్టిలో వున్న ఒక్క నిజాన్ని నువ్వు గుర్తించడంలేదు ప్రసూనా! ప్రపంచంలో ఏ రెండు శక్తులయినా కలిసి ఉండొచ్చు... వుంటాయి. కాని ధనికులు, పేదలు మాత్రం రెండు వర్గాలుగా విభజన జరిగిన నాటినుంచి ఈ నాటివరకూ కలిసి వుండలేదు. సైన్సులో రెండు పరస్పర విరుద్ధశక్తులు కలిసినప్పుడు అక్కడ ప్రళయం పుడుతుంది. తర్వాత మంచి జరగవచ్చు - అది వేరే సంగతి. నన్ను ప్రేమించడంలో నువ్వు తప్పుచేశావనడంలేదు. కాని ముందు వెనకలు ఆలోచించకుండా దూకేశావు. మన ప్రేమ నా చావుకు వస్తుంది. నేను చచ్చిపోతే పోయేదేంలేదు. కొందరు రోగులు బతుకుతారు. కాని నీకు అపకారం జరగరాదన్నదే నా విచారమంతా, ఆలోచనంతా''

ప్రసూన ఏంమాట్లాడలేదు మౌనంగానూ, శ్రద్ధతోనూ అంతా విన్నది.



''బాబుగారూ-టీ''

అన్న నౌకరు పిలుపుతో సగం కళ్ళు తెరిచారు జడ్జిగారు.

వాలని లేకపోయినా ఒక రివాజుగా అడగాలనిపించి అడిగారు.

''బాడ్మెంటనుకు వెళ్ళారు. కాసేపట్లో తిరిగి వచ్చేస్తారు''

ఆ బాడ్మెంటెను ఎలాంటిదో వారు స్వయంగా చూసేవున్నారు గనక ఇంకేమీ అడగలేదు. టీ తాగడం అయాక కప్పు, సాసరూ వాడికి అందించారు.

వాడు వినయంగా అందుకుని అక్కడ నుంచి వెళ్ళిపోయాడు.

మళ్ళీ కళ్ళుమూసుకుని వారు ఆలోచనలో పడిపోయారు.

ఈ రెండు విషయాలూ తన చెయ్యిదాటిపోయిన పరిస్థితి వారికి అర్ధమైపోయింది. ఏ పిచ్చివాడైతేనో తప్ప ఇందులో వేలుపెట్టడం అనవసరం అనే సంగతీ స్పష్టంగా తెలుస్తూనే వుంది. కాగలకార్యం గంధర్వులకు వదిలెయ్యకుండా, తనుముందు ఆలోచించి రూపొందించుకున్న పథకం ప్రకారం అమలుపరచడమొక్కటే గత్యంతరం లేనిమార్గంగా తోస్తోంది. ఇంకా ముదరనిస్తే అసలుకే ఎసరొస్తుంది. కొంప నిలువునా తగలబడిపోతుంది. కట్టుకున్న ఆశాసౌధాలు, పేకమేడల్లా కూలిపోయి, గాలిబుడగల్లా పేలిపోతాయి. ఇక తప్పదు... ఆలస్యం అమృతం విషం.

వారి ఆలోచనలో ద్వేషం, వ్యూహాల్లో కసి, భావాల్లో పగ, సాధించి తీరాలన్న పట్టుదల, ఈ వ్యవహారం ఇక ఒక అడుగు కూడా ముందుకు సాగడానికి వీల్లేదన్న గట్టి తెగింపు వూపిరి పోసుకున్నాయి.

కళ్ళు తెరిచేసరికి వరండా, హాలు గదులు ఆవరణా లైట్ల సింగారింపుతో వెలుగులు నింపుకుని చూడముచ్చటగా వుంది.

ప్రసూన ఎప్పుడు వచ్చిందో తెలియదు. గదిలో టేబుల్ లైటు వెలిగించుకుని, వెల్లకిల్లా పడుకుని ఏదో మెడిసిన్ నోట్సు కాబోలు చదువుకుంటోంది.

ఉలోగా తన చెవుల్ని తానే నమ్మలేకపోతున్నట్టు, మీది గది నుంచి వీనుల విందుగా, ఒక వీణానాదం సన్నగా హాయిగా వినిపించింది. వీణ సవరిస్తున్నట్టు తీగలు మీటుతున్నట్టు అనిపించి వారు షాక్ తిన్నట్టు ఆశ్చర్యపోయా

రు.

ఆ వీణ కోడలు పిల్లతోపాటు వచ్చింది. కొద్దిరోజుల్లోనే సంవత్సరం పూర్తిచేసుకోబోతోంది. అది మోగగా వారింతవరకూ వినలేదు. ఇప్పుడు కొత్తగా మోగుతుంటే, కొత్తరాగాలు ఆలపిస్తుంటే, కొత్త స్వరాలు వెతుక్కుంటోందేమోనని వారి భయం.

ఒక్క ఉదుటున లేచి మెట్లెక్కి, తిన్నగా కోడలు పిల్ల గదిదగ్గరకొచ్చి, ఆగిపోయారు. తలుపు మీదచేతి వేళ్ళు మెల్లగా ఆడించి నెమ్మదిగా పిలిచారు.

"అమ్మా... ప్రమీలా" అన్నారు మృదువుగా...

"రండి మామయ్యగారూ" అంది కోడలు పిల్ల లోపలినుంచే.

తలుపు తెరచి లోపలికి అడుగుపెట్టారు జడ్జిగారు.

వారికి పాలిష్ క్లాత్‌తో వీణ తుడుస్తూ ప్రమీల కనిపించింది.

"ఎప్పుడొచ్చావమ్మా?"

"ఇప్పుడే వచ్చానండి. బాడ్మెంటిన్‌కు వెళ్ళి, అక్కడనుంచి ఒక ఫ్రెండ్‌ని చూసి రాబోయేసరికి ఆలస్యమైంది" ప్రమీల జవాబు.

ఆ ఫ్రెండు ఎవరో తాను స్వయానా చూసేవున్నాడు. ఇంకా లోతులకు వెళ్ళడం ఇష్టంలేదు- "ఎప్పుడూ లేనిది ఇప్పుడెందుకమ్మా వీణ తీశావు?"

"వూరకనే- కాలక్షేపానికి. గంటలతరబడి ఒంటరిగా కూర్చుంటే ఏం తోచడం లేదు. ఒక్క పుస్తకాలే చదువుతూ ఎంతకని? బోరనిపిస్తోంది. వెరైటీగా వుంటుందని, తోడుగా కూడా వుంటుందని దీని దుమ్ముదులుపుతున్నాను. అదీగాక మా పెళ్ళయి మరో పదిరోజుల్లో సంవత్సరం పూర్తికావస్తోంది. ఆరోజుతో నా మైనారిటీ కూడా తీరిపోతుంది. పుట్టినరోజే పెళ్ళిరోజు కావడం ఎవరికోగాని జరగదు- అదినాకు జరిగింది. ఎందుకో ఆరోజు కొంచెం సరదాగానూ, ఆనందంగానూ వుండాలని నాకనిపించింది. అందుకే ఈ ప్రయత్నం మామయ్యగారూ" అంది.

ఇలా చెప్తున్నప్పుడు ఆమె కంఠం రుద్ధమైంది. కళ్ళు సజలాలయ్యాయి. ముఖం అవనతమైంది.

అంతటి జడ్జిగారు కూడా తుళ్ళిపడ్డారు. తప్పుచేసినట్టు భుజాలు తడుముకున్నారు. ఆ ఆందోళన మనసులోనే తొక్కిపెట్టుకుంటూ బయటికి మాత్రం గుంభనంగా "పడుకో అమ్మా... చాలా రాత్రయిపోయింది- వెళ్తాను" అంటూ వెనుతిరిగారు.

మెట్లు దిగుతుండగా వెనకనుంచి కోడలు మాటలు వినిపిస్తున్నాయి.

"మీరు ఇంతవరకు ఎందుకు మేలుకుని వున్నారు? అసలే మీ ఆరోగ్యం అంతంతమాత్రం. పైగా రేపు ఉదయం కోర్టుకు వెళ్ళాలాయె"

మామగారు మెట్లుదిగి వెళ్ళడం ప్రమీలకు స్పష్టంగా వినిపిస్తోంది. ఆమె తలుపులు దగ్గరకు చేరవేసి ట్యూబ్‌లైటు ఆర్పి బెడ్‌లైటు వెలిగించింది.

వీణదగ్గరకొచ్చి హృదయానికి గాఢంగా హత్తుకుంది. దగ్గరకు తీసుకుని ముద్దుపెట్టుకుంది. దాన్ని గోముగా మీటుతూ 'నిన్ను నవరించి నాద మధురిమ తరంగాలు ప్రసరింపచేశాను. నా హృదయవీణ మీటి అనురాగమంజరులు సృష్టించేదెవరు? రాగహీనమైన ఈ బతుకు పై రాగఝురులు కురిపించేదెవ్వరు?'

వీణ వేదికమీద నుంచి లేచింది ప్రమీల. బాత్‌రూమ్‌వైపు నడిచింది. అలసిన మేనుని నులివెచ్చని నీటితో సేదదీర్చింది. తర్వాత ఒంటికి టవల్ చుట్టుకుని డ్రెస్సింగ్ టేబుల్ ముందుకూర్చుంది. తడి జుత్తుకు దగ్గర్లో ఫాను తిరుగుతోంది.

ఒంటికిలవండర్‌స్ప్రే చేసింది. మూలల్లో ఘుమఘుమలాడే సెంటు చుక్కలు చుక్కలుగా అద్దింది. తర్వాత ఒంటినిండా పౌడర్ జల్లుకుని నైటీ వేసుకుంది. అలావేసుకుంటూ కూనిరాగం తీస్తున్నప్పుడు యాధృచ్ఛికంగా డ్రెస్సింగ్ టేబుల్‌మీదవున్న ఫొటోవైపు చూసింది.

అంతే... టక్కునరాగం ఆగిపోయింది.

మెల్లగా నడుచుకుంటూవచ్చి మళ్ళీ ఆ

టేబుల్‌ముందు కూర్చుంది. ఈసారి భర్తఫొటో వంక తదేకంగాచూసి దాన్ని మృదువుగా చేతుల్లోకి తీసుకుంది.

"ఏమండీ... నేను చంచలననుకున్నారా, చపలననుకున్నారా? మీరెందుకు నన్నింతచులకనగా చూస్తున్నారు. చెప్పండి- పెళ్ళయి సంవత్సరం కావస్తున్నది. మొదటి వార్షికోత్సవం జరుపుకోబోతున్నాం. అయినా ఈ సంవత్సరంలో మనమెన్నిసార్లు కలసిభోజనం చేశాం? ఎన్నిసార్లు కలిసి షికార్లకెళ్లాం? ఎన్నిసార్లు షాపింగు చేశాం? ఎన్నిసార్లు సినిమాకెళ్లాం? నన్నెందుకింత దారుణంగా హింసిస్తున్నారు. చిత్రవధ చేస్తున్నారు. నేనెంత చిత్తక్షోభ అనుభవిస్తున్నానో మీకెలా తెలుస్తుంది!

"మన పెళ్లయిన మరుక్షణంనుంచి పాతజ్ఞాపకాలు మరిచిపోదామనుకున్నాను. కొన్నాళ్లుపాటు అతణ్ని పూర్తిగా మరిచిపోయాను కూడా. అన్నీ మరిచి, గతాన్ని విస్మరించి మీతో కలిసి ప్రయాణం చేద్దామనుకున్నాను; మీతో జీవితం పంచుకుందామనుకున్నాను; ఆదర్శగృహిణిగా నాకాపురం నిలుపుకుందామనుకున్నాను. కానీ... కాని నా ఆశలు వమ్ముచేశారు మీరు. నా ఆదర్శాలు తలకిందులుచేశారు మీరు. నా త్యాగాన్ని అపహాస్యం చేసారు మీరు. అసలు మీరు నన్నెందుకు పెళ్లిచేసుకున్నారు? పెళ్లిచేసుకున్నాక భార్యగా ఎందుకు చూడలేదు? భార్యగా చూడనప్పుడు ఇంట్లో ఎందుకు వుండనిచ్చారు.

"తిరిగి మీ ప్రవర్తన కారణంగానే అతని జ్ఞాపకాలు బలవంతంగా నా ఎదలోకి చొచ్చుకువచ్చాయి. నన్ను అతనికి పునరంకితమయ్యేటట్టు చేశాయి. ఇప్పుడు చెప్పండి- నావైపు నుంచి తప్పేమైనా వుందా నా నేరమేమైనా వుందా? నన్నొక దోషినిచేసి ప్రశ్నిస్తారా?"

ఆమె బెదిరిపోయిన మనసుతోవచ్చి మంచంమీద వాలిపోయింది. కలిచివేసిన ఆలోచనలతో ఆమెకు చాలాసేపటివరకూ నిద్రపట్టలేదు. అసహనంగా అటూయిటూ పొత్తిగిలుతోంది. ఆ కుదుపుకి, ఆ వూపుకి ఆమె మెడకి వున్న లాకెట్‌జారి కిందికి వేలాడింది. ఆమె ఒక్కసారి దానివైపు సంభ్రమంగా చూసింది. చిమ్మచీకటిలో ఫ్లాష్ కొట్టినట్టు అస్తవ్యస్తపు ఆలోచనలకు స్పష్టమైన ఒక వెలుగుదారి ఏర్పడింది. సంకోచాల నడుమ కర్తవ్యబోధనలా విజయసంకేతంగా గోడగడియారం జేగంటకొట్టింది, శుభం పలికింది.

ఆమె రెండుచేతుల్లోకీ ఆ లాకెట్‌ను తీసుకుంది. ఒక్కసారి ముద్దుపెట్టుకుని తెరిచింది. ఆ లాకెట్‌లో బొమ్మరూపంలో దాగున్నవాడు ఆమె ప్రియుడు రాజ్‌మోహన్. నవ్వుతూ పలకరిస్తున్నాడు. రమ్మని ఆహ్వానిస్తున్నాడు.

ఆమె మనసు పురివిప్పుకున్న మయూరమే అయింది. రేకులు విచ్చుకున్న మందారమే అయింది. మీదిమీదికి ఎగబాకుతున్న అరుణారుణ సూర్యబింబమే అయింది. సప్తవర్ణశోభిత ఇంద్రధనుస్సే అయింది. రాగడోలిక మనోహర మేఘమాలికే అయింది. వెలుగు స్నానం చేస్తున్న ప్రకృతిసీమే అయింది. వనకన్యే అయింది.

"రాజా... నువ్వు రాజువి. నా హృదయాన్ని శాశ్వతంగా గెలుచుకున్న రారాజువి. నా మనసులో నీకు తప్ప మరొకరికి చోటులేదు. ఈ తనువూ, నా సర్వస్వం నాకు నేనుగా నీకు అర్పించుకున్న నైవేద్యం, ఇచ్చుకున్న నీరాజనం, పులకరించిన ఈ మేను నీకు అమర్చిన పూలతల్పం, పరిమళ భరితమైన ఈ యౌవ్వనం నీకై వారాల వింజామరం, ఈ నును లేత సొగసులు, ఈ పసిడి నిగారింపులు నీవు విశ్రమించే చాందినీ! రాజా... నీ స్థానం ఎక్కడో చెప్పనా, చెప్పేసేదా - అబ్బ... మరి ఆగలేనుబాబు"

ఆమె అలాఅలవోకగా తీయని తలపులతో తేలిపోతూ, వెర్రిఆనందంలో వూగిపోతూ, మత్తుగా, మెత్తగా కలలకౌగిట్లో ఇమిడిపోయింది. పాపం పుణ్యం ఎరగని, కల్లాకపటంతెలీని ఆమె హాయిగా నిశ్చింతగా నిద్రపోయింది.

* * *

ప్రమీల అలాపడుకుంది. ప్రసూన అలా చదువుతోంది. అప్పుడు న్యాయం వాకిట దాని కాపలాదారుని గదిలో టెలిఫోను మోగింది.

"యస్... ఐయామ్‌ది డిస్ట్రిక్టు జడ్జి శ్యామ్ సుందర్. హూఆర్‌యూ. యస్.పి. యస్.ఐ వాంట్స్ యూ. నేను మీతో ఏకాంతంగా మాట్లాడాలి. మీచుట్టూ ఎవరైనా వున్నారా? అలా




వుండకూడదనే మీ ప్రోగ్రాం నోట్‌చేసుకుని ఈ టైమప్పుడు మీ ఇంటికి ఫోనుచేసింది. దిసీజ్ ప్యూర్లీ మై ఫామిలీ ఎఫైర్ బికేర్. డోంట్ లూజ్ అథర్స్‌లిసెన్‌మీ''

ఆ రాత్రప్పుడు, అర్ధరాత్రి కూడా దాటిపోయిన సమయాన్న, ఒక ఘోరాతి ఘోరసంఘటనకి, ఒక దారుణాతిదారుణ సన్నివేశానికి పథకరచన జరిగిపోతోంది.

★ ★ ★

''చూడు... మిస్టర్ నీపేరిమిటన్నావ్?''

టెలిఫోను రిసీవర్ ఎడం చేత్తోపట్టుకుని, కుడిచేతివేళ్లని టేబుల్‌మీద లయవిన్యాసం చేయిస్తూ అడిగిందామె.

ఒకకాలు నేలమీదఆన్చి, మరోకాలు కుర్చీమీద వుంచి టెలిఫోన్‌వున్న టేబుల్‌మీద చాలా రెక్‌లెస్‌గా కూర్చుని ఉందామె.

పైటతొలగిపోయి, స్లీవ్‌లెస్ బ్లౌజులోని వక్షోజాలు వున్నతంగా వుబికిరాగా మందుకొట్టిన వాడి కళ్లకు కేలండర్‌లోని దేవకన్య నేలమీదకు నడిచొచ్చినట్టుగా వుంది. పానపాత్రతో వయ్యారాలు వొలకబోస్తున్న అరబ్బీకన్యలా వుంది.

ఆమె ఈ లోకాన్ని లక్ష్యంచేయనట్టు, ధిక్కరించినట్టువుంది. ఈలోకమనగా ఎంత, అది నాకాళ్లదగ్గరుంది దాని నెత్తిమీద నేనున్నాను. ఈలోకాన్ని శాసించగలపవర్లు, పగ్గాలు నాచేతిలో వున్నాయి. కోరలు నాచేతిగోళ్లసందుల్లోవున్నాయి. ప్రజలప్రాణాలూ నాగుపెట్లో మూసివున్నాయి అన్నట్టుందామె.

ఆమె ఎవరికో రింగ్‌చేయగా, అవతలివైపునుంచి రెస్పాన్స్ ఇంకావచ్చినట్లు లేదు. ఆ వెయిటింగ్‌తో ఆమె అనీజీగా వుంది.

''యస్ మాడమ్‌బ... సత్యారావ్ ఈజ్‌మై నేమ్'' అన్నాడతను బిర్రబిగుసుకుపోయి.

''బావుంది... మంచిపేరు. చూడు 'సత్యారావ్ నేనుచెప్పిన ఏర్పాట్లన్నీ పూర్తయ్యాయా? ఇంకేమైనా మిగిలివున్నాయా?'' ఆమె వొయ్యారంగా, సాధికారికంగా ప్రశ్నించింది.

''అన్నీ పూర్తయ్యాయ్ మాడమ్. గోడలకుపట్లుదులిపించాను, గదంతా క్లీన్‌చేయించాను. అపుడే లాండ్రీనుంచి తెచ్చిన తెల్లటి దుప్పట్లు, దిండ్లూ వేయించి, వాటిమీద మీకు ఆహ్లాదంగా వుంటుందన్జెప్పి 'ఇంటిమేట్' సెంటు జల్లించాను. నాలుగు స్కాచ్ బాటిల్స్ 'షివాశ్ గల్స్' కస్టమ్సునుంచి మినిస్టర్‌గారి పార్టీ కనిచెప్పి తెప్పించి, ఆల్మరాలోవుంచాను. జర్మన్‌బీర్ ఒకడజను నేవల్ ఆఫీరుద్వారా సంపాదించి అదే ఆల్మరాలోవుంచాను. తాండూరి చికెన్, చికెన్‌జాయింట్స్, గ్రీన్‌పీస్, మసాలా మనఆర్డరులో వున్నాయి. అర్ధరాత్రి అయినాసరే అవిమీకు తాజాగాఅందే ఏర్పాట్లుచేశాను. బిరియానీ వైట్‌రైస్ మీకు ఏక్షణంలోనైనా అందుబాటులో వుంటాయి. మధ్య మధ్య మీకు అవసరముంటుందని బోయిల్డ్ ఎగ్ ఆఫ్‌బాయిల్డ్ ఎగ్, సింగిల్ డబుల్ ఆమ్లెట్స్, రోస్టెడ్‌వి మీరుకోరుకున్న మరుక్షణం మీకు అందేఏర్పాటుచేసాను. వేయించిన కాజూనట్స్, జీడిపప్పుపకోడి పాకెట్స్ కరకరలాడుతూ మీరుచేరుకున్న మరుక్షణం మీముందు వాలతాయి. అన్నట్టు చెప్పడం మరిచాను. మీమనోభావాలకు అనుగుణంగా ఫ్లవర్‌వేజెస్ అన్నిటిలో తాజాపువ్వులు, కొత్తపరిమళాలు వెదజల్లుతున్నవి మార్పించాను. మీరు కోరుకున్న వస్తువులు మీటనొక్కితే అందుబాటులో వుండే అంతగా సమీపంలో ఏర్పాటుచేయించాను కాని ఆయన బ్రాండ్స్ సిగరెట్స్‌ఏవో నాకుతెలీదు. అవిమాత్రం తీసుకురాలేకపోయాను'' ఏకరువుపెట్టాడా పిల్ల అధికారి.

''ఆవైపూ, ఈవైపూ ఎవరూవుండరు కదా?'' ఆమె భయపడినట్టుకూడా లేదు. ఏదోకాజువల్‌గా అడిగినట్టు అడిగింది. అంతే!

''మీకలాంటి అనుమానమే అవసరంలేదు మేడమ్. కుడివక్కరూమ్ నాపేర్న, ఎడంపక్క రూమ్ ఒక యస్.ఐ. పేర రాయించాను. ఆయన ఈరోజు బందోబస్తుకి వస్తున్నాడు. మనకి నమ్మకస్తుడు'' అతను అన్నీ వివరించాడు.

''మరి నారూమ్ ఎవరిపేర రాయించావు?'' ఇంకా ఆమెకు చిన్నఅనుమానం.

''నిన్న వెళ్లిపోయిన ఎమ్మెల్యేగారి రికార్డులో వెళ్లకుండాచేసి గవర్నరుగారు వెళ్లిపోయేంత వరకూ ఇక్కడే వుంటున్నట్టు పొడిగించాను''

''ఏంబుర్ర నీది. ఇలా చురుగ్గావుండాలి. ఇనస్పెక్టర్లంటె ఒకటిచెపితె రెండు చేసుకురా

వాలి. మళ్లీ రెండోదానికోసం వెళ్లనక్కర్లేకుండా" అని చిన్న ప్రశంసలాంటిదిపారేసి మళ్లీ ఏదోజ్ఞాపకం వచ్చినట్టు "నేనక్కడ రెండ్రోజులుండాలి సుమా?' అంది.

"అది నాకువేరే చెప్పాలా మాడమ్. దొరగారిప్రోగ్రాం రెండురోజులంటే మీరక్కడ రెండు రోజులూ వుండితీరాల్సిందే కదా. అందుచేత ఆరెండు రోజులషీట్సూ దగ్గరుండి ఫిలప్ చేయించాను" అన్నాడతను చిన్న ఎడ్వంచర్ చేసినట్టు.

"ఎవరికైనా తెలిస్తే గొడవవుతుందేమోనయ్యా- అయ్యగారి పరువుపోతుంది. తర్వాత చాలారభసైపోతుంది. ఎందుకైనా మంచిది. ఎవరూ రాకుండా కట్టుదిట్టంచేశావా?"

"మొత్తంగేట్లు మూసేయమన్నాను. మీరు తప్ప ఎవరొచ్చినా, చివరికి అయ్యగారూ, గవర్నరేవచ్చినా గేట్లు తెరవొద్దని చెప్పాను. అలాచేశాడో, లాకప్పులోపడేసి, పస్తుల్తో పడుకునేటట్టు చేస్తానన్నాను.ఎందుకైనామంచిదని బక్షీస్‌కి వందరూపాయలుకూడా విదిల్చాను"

"వీటన్నిటికి నీకు డబ్బెలావచ్చిందయ్యా, నేనివ్వలేదుకదా?"

"ఏదోలెండి మేడమ్... సర్దేశాను. ఇలాంటి చిన్నచిన్న వాటికి కూడా మిమ్మల్ని అడిగితే ఏంబావుంటుంది"

"నేనిక్కడనుంచి బయల్దేరినట్టుగాని, అక్కడకిచేరినట్టుగాని ఎవరికీతెలీకూడదుసుమా. ఏదైనా సివిల్‌కారుంటె తీసుకురా. ముఖ్యంగా నువ్వు సివిల్‌డ్రస్సులో వుండటం చాలాఅవసరం. అది గుర్తుంచుకో. అన్నట్టు మరిచాను! అక్కడ ఆఫీసు సిబ్బంది ఎవరైనా వుంటారా, అక్కడ నాకేదైనా అవసరంపడితే హెల్ప్ ఎవరయ్యా?"

"మొత్తం ఆఫీసుతలుపులు కూడా మూసివుంటాయి. సిబ్బంది ఎవరూ వుండరు. ప్యూన్‌కీ. క్లర్కుకీ ఈరెండురోజులూ శెలవిప్పించేశాను. ఇన్‌చార్జ్ కూడా వుండడు. శెలవు పెట్టి, పెళ్లాన్ని తీసుకుని ఏదోవూరు చెక్కేస్తాడు. గేటుదగ్గర ప్యూన్‌వేషంవేయించి మనఫోర్ట్వెంటీని కాపలాగా వుంచాను. ఈరెండు రోజులూ అతనే మీకు హెల్పర్‌కూడా. అతనుతప్ప ఈరెండురోజులూ ఆచెట్లమీద పిట్టలుకూడా వాలవు" అన్నాడు గర్వంగా.

"చాకులాంటి బుర్రయ్యా నీది. పాదరసంలా పనిచేస్తుంది"

"థాంక్స్ మాడమ్" అతను కాసేపు వూరుకుని, తర్వాత అతివినయంతో, కొద్దిపాటి సిగ్గుతో, "మరి నా ప్రమోషన్ సంగతి. మీరు వాగ్దానంచేశారుకదా".

"ష్యూర్, తప్పకుండా. నేను మాటంటే మాటే. మాటయిచ్చి తప్పడం మీపోలీసుబుద్ధి. పోలీసుఆఫీసర్ భార్యనైనా నాకింకా ఆబుద్ధి అబ్బలేదు. ఈ లిస్టులో నీపేరు వుండేటట్టుచూస్తాను. ఔనూ పెర్సనల్‌ఫైల్లో నీమీద రిమార్క్సు ఏమీ బాడ్‌గాలేవు కదా?"

"అది నాకెలా తెలుస్తుంది మేడమ్. దొరగారిదగ్గరేవుంటుంది కదా ఆఫైలు"

"సరిసరి... అదికూడా చూస్తాన్లే. ఒకవేళవున్నా తీయించే ఏర్పాటుచేస్తాను"

ఇంతలో అవతలివైపునుంచి కనెక్షన్ అందినట్టుంది. ఆమె వదనం రేకులువిచ్చుకున్న కమలంలా వికసించింది. రిసీవర్‌ని నోటిదగ్గరకు తీసుకుంది.

"హలోరాయ్- నేను లక్ష్మిని మాట్లాడుతున్నాను. గంటయింది రిసీవర్‌పట్టుక్కూర్చుని. ఎక్కడతగలడ్డావ్? టెన్నిస్ ప్రాక్టీసా? మళ్లీ ఏమొచ్చిందయ్యా మొన్ననేకదా గోల్డ్‌కప్పు కొట్టుకొచ్చావ్. ఇప్పుడు కాంపిటీషన్స్ స్విడ్జర్లాండులోనా, అలెక్కన ఈఊర్లో నువ్వెన్నిరోజులుండేట్టు? ఒక పనిచెయ్ - శుభ్రంగా పెళ్లిచేసుకోడం మానెయ్. మళ్లీ ఇంకొకరి వుసురు కూడా ఎందుకు. ఏమిటీ నేనుండగా పెళ్లెందుకంటావా, డబ్బుదండగంటావా! ఏం... నీకంటికి నేను 'కాల్‌గర్ల్'లా కన్పిస్తున్నానా? నేనంటే ఎవరనుకున్నావ్? నాకు వీలున్నప్పుడు, కోరికవున్నప్పుడు ఏదో పాతస్నేహితుడివని పిలుస్తున్నానుకాని, లేకపోతే ఇదే నాకువృత్తి అనుకున్నావా- షటప్ యువర్ మౌత్‌ఫస్ట్.

"సరే... నాకు వీలైన సమయానికి నువ్వు దేశంలో వుండొద్దూ నీకు వీలయినప్పుడు నాకూ తీరిక దొరకాలంటే సాధ్యమా? మొగుడు చాటుదాన్ని పరులకంటపడితే పరువుపోదూ. ఔన్లే, ఇంకేమంటావ్?"

"అదిసరేగాని- టంచన్‌గా ఆరుకొట్టేసరికి









# నీలమేఘశ్యాములు

**మా**తృత్వం పొందబోయే ఏ తల్లైనా తనకు పుట్టబోయే బిడ్డ పసినిమ్మ పండురంగులోనో, పదారువన్నెల బంగరు ఛాయలోనో ఉండాలని కోరుకుంటుంది. అయితే అందరూ అలాకాక లేత గులాబీవర్ణంలో, గోధుమవర్ణంలో నలుపు రంగుతో కూడా శిశువులు జన్మిస్తుంటారు. అయితే నీలంరంగులో వుంటే మాత్రం తల్లి దండ్రులు వారిని నీలమేఘశ్యాముడైన రాము నితోనో, శ్యామసుందరుడైన కృష్ణునితోనో పోల్చు కుని మురిసిపోలేరు. నీలంరంగులో పుట్టే శిశువులు ఓ అరుదైన వ్యాధుతో బాధపడు తుండటం ఇందుకు ఒక కారణం.

మనిషి గుండెను నాలుగు అరలుగా శా స్త్రజ్ఞులు విభజించారు. పైభాగంలో రెండు అరలు, క్రింది భాగంలో రెండు అరలు-వెరసినాలుగు. పైఅరల్లోని కుడి అరలోకి మలిన రక్తం చేరి అక్కడినుండి ఊపిరితిత్తు ల్లోకి ప్రవేశించి పరిశుభ్రం చేయబడుతుంది. అలా పరిశుభ్రమైన రక్తం పైగదుల్లోని ఎడమ అరలోకి చేరి అక్కడి నుండి శరీరంలోని అన్ని భాగాలకూ సరఫరా అవుతుంది.

పుట్టుకతోనే కొందరు పిల్లలు గుండె అర లకు రంధ్రాలు ఏర్పడి మరీ పుడుతుంటారు. పై అరలకు ఈ రంధ్రాలు ఏర్పడితే 'ఎ.యస్ డీ' అనీ, క్రింది అరలకు రంధ్రాలుంటే 'వి.యస్.డీ' అనీ అంటారు. ఈ రంధ్రాల ద్వారా మంచిరక్తం, చెడు రక్తం కలిసిపోయిన ప్పుడు కొన్ని చర్యలకులోనై శిశువు మేని వర్ణం నీలంరంగులోకి మారిపోతుంది. ఈ నీలవర్ణు లకు జ్వరం రావటం, శ్వాస ఆడకపోవటం, విపరీతంగా దగ్గురావటం, స్పృహకోల్పోవ డంలాంటివి జరుగుతుంటాయి. డాక్టర్లు 'ఇకో కార్డియోగ్రాం' ద్వారా శిశువు గుండె స్థితిగతు ల్ని క్షుణ్ణంగా పరిశీలించవచ్చు. ఆధునికకా లంలో వైద్యరంగం సాధించిన అభివృద్ధి ఫలి తంగా ఖర్చుతో కూడినదే అయినా ఈ సమస్య కి పరిష్కారం లభిస్తోంది. చికిత్సచేసి ఈ శిశువులని మామూలుగా చేయగల్గుతున్నారి ప్పటి డాక్టర్లు. పూర్వం ఈ వ్యాధిగ్రస్తులై ఎంద రో శిశువులు మృత్యువాత పడేవారు.

మనం తీసుకునే ఆహారంలో అపరిశుద్ధ మైన పదార్థాలు వుంటాయి. జీర్ణమండలం ఈ మలినపదార్థాల్ని తొలగించుకుని స్వచ్ఛమైన పదార్థాల్ని సంగ్రహిస్తుంది. దీనికిగాను అదెంతో శ్రమించవలసి ఉంటుంది. కాని అపరిశుద్ధపదార్థాలు ఎలాగో జీర్ణమండలంలో కి ప్రవేశించటంతో రకరకాల వ్యాధులు వస్తుంటాయి. పరిశుభ్రమైన ఆహారం స్వీక రించటం ఒకటే దీనికి విరుగుడు. ★

నువ్వు ట్రావెల్స్ బంగళాదగ్గరవుండాలి. ఈరోజూ, రేపూ నీకక్కడ రెస్టు. ఈ రెండ్రోజులూ అక్కడ లాకప్పులో, నాకష్టడీలోవుండాలి. అప్పు డు అసలు టెన్నిస్ కట్టిపెట్టి మన టెన్నిస్ ఆడదాం ప్రోగ్రాం ఈజ్ ఆల్‌రెడీసెటిల్డ్. ఇంకే మీ ఎంగేజ్‌మెంట్స్ పెట్టుకోక, డోన్ట్‌మిస్."

"అన్నట్టు నీకేమైనా కావాల్సి ఉంటే ఇప్పు డేచెప్పు- అక్కడ మనకు కావలసినవి తేడాని కి, సవర్యలుచేయడానికి బోయ్స్ ఎవరూ ఉండ రు"

ఆమె ఫోనుదించేసి తృప్తిగా నిట్టూర్చింది. విలాసవంతంగా ఊపిరితీసుకుని అప్పుడు సత్యారావుని గుర్తించినట్టు అతని వైపుతిరి గింది. "చాలా థాంక్స్ మిస్టర్ సత్యారావు! ఇంకేమీ వాంటింగ్స్‌లేవుట. ఇప్పుడు వెళ్ళి అయిదున్నరకురా. జాగ్రత్తసుమా, బయటికి పొక్కకూడదు. అయ్యగారికి తెల్సిందంటే 'మా రణహోమం' జరిగిపోగలదు. మర్డర్సయిపో తాయ్".

"మీరు ఇన్నిసార్లు చెప్పాలా మాడమ్! అది నాడ్యూటీకాదా. ,శెలవుతీసుకుంటాను" అని ఒక శాల్యూట్‌కొట్టి వెనక్కితిరిగి కిందికివచ్చి జీపెక్కాడు.

జీపు పెద్దపులిలా గాండ్రించి రోడ్డెక్కింది.

జీపులో వెళుతూ ఆలోచనలోపడ్డాడు. ఊరందరిపెళ్ళాల్నీ ముండలకిందరాసి, లాక ప్పులోతోసి, కోర్టుకీడుస్తున్నాను. ఇపుడు నేనే ఇంకోడిపెళ్ళాన్ని తీసుకెళ్ళి దాని రంకుమొగు డిపక్కలో పడుకోబెడుతున్నాను. ఇదా పోలీసో డి ఉద్యోగం. ఊర్లో పులైపోయిన ఇన్‌స్పెక్టర్ పైఅధికార్లదగ్గరకొచ్చేసరికి పిల్లిఅయిపోతు న్నాడే! పోనీ వాడిదగ్గరైనా అర్థముంది. వాడిపె ళ్ళాందగ్గరకూడా లోకువైపోవాలా! ఇలా ఉంటాయి బతుకులు, ఈ పాటిదానికి నేనేదో రాక్షసుడైపోయినట్టు ఈ దిక్కుమాలిన ప్ర పంచంఅనుకుంటుందేం"

స్టేషన్‌ముందు జీపు ఆగింది. సత్యారావు దిగి హుటాహుటిని స్టేషన్‌లోకి నడిచాడు. స్టేష న్లో పెద్దసందడేమీలేదు. మొత్తం బలగమంతా సెంటర్స్‌లోనూ, హత్యదగ్గర బందోబస్తుకోసం వెళ్ళిపోయింది. ఒక్క సెంట్రీమాత్రం ఉన్నా డు. రైటర్‌ఇన్‌ఛార్జిగా ఉంటూ కాళ్ళుబార్లాచాపి కూర్చున్నాడు.

సి.ఐ. గార్ని చూడగానే లేచినుంచొని ఒక శాల్యూట్‌కొట్టాడు. అంతవరకూ కంప్లైయింట్స్ ఏమీ రాలేదు. బతుకుజీవుడా అనుకుని హుషా రుగా ఈలవేసుకుంటూ జీపెక్కారు. అలా తన పరిధిలోగల స్టేషన్లన్నీ ఒక్కగంటలో పూర్తికాని చ్చేశారు.

టంచనుగా అయిదున్నర అయ్యేసరికి యస్.పి. గారి బంగళాముందు జీపుఆగింది. సత్యారావు లోనికి పరుగెత్తాడు. మేడమ్ కని పించింది. శ్యాలూట్‌చేశాడు.

గ్లాస్‌డోర్ నుంచి జీపులోవుండగానే మేడమ్ సత్యారావును చూసింది. ఈయన్ని చూస్తూనే- "ఒకే... నేను బయల్దేరిపోతున్నాను. నువ్వు కూడా వెంటనే బయల్దేరు. ఇద్దరం ఒకేసారి అక్కడకు చేరుకుందాం బై" అని ఫోను దించేసి నిలబడింది.

సి.ఐ.గారు ముందురాగా, అతి దర్పంగా కారువైపు నడకసాగించింది.

అప్పటికే సివిల్ కారొకటి కొత్తది అక్కడ విడిదిచేసివుంది. డోర్‌తెరిచి పట్టుకోగా దర్జాగా ఆమె లోపలదూరింది.

కారు కదిలింది.

తరలివెళుచున్నది తరణీమణి అభిసారిక వోలె ప్రణయసీమకు, అనుకున్నాడు- సత్యా రావు.

కారు బంగ్లాచేరేసరికి మెయిన్‌గేటు దగ్గరే స్వాగతంచెప్పాడు తుషాల్‌రాయ్

"మిస్టర్ సత్యారావు... ఇక నువ్వువెళ్ళవ చ్చు. అక్కడ మీ ఆవిడ ఎదురుచూ స్తుంటుందేమో. తిరిగి రేపు ఉదయం ఎనిమి దిగంటలకురా" అంటూ మెట్లవైపు నడి చింది.

సత్యారావు వెనుదిరగ్గానే ఇద్దరూ గదిలో దూరి తలుపులు బిగించుకున్నారు.

★ ★ ★

ఆరోజు డిసెంబరు 31. పాత సంవత్సరాని కి ఆఖరురోజు. మరునాడు కొత్తసంవత్సరానికి తొలిరోజు. తరవాత ఆదివారం. వారారంభం నరదాదినం. అలా మూడు రోజులు శెలవు కావడంతో జనం పెట్రేగిపోతున్నారు.




తమ తమ బహుమతులతో ఆఫీసర్లని లొంగదీసుకోవాలనో, కనీసం మెత్తబరచుకోవాలనో ఎగబడుతున్న ఉద్యోగులతో బేకరీలు, బ్రాందీషాపులూ రద్దీగా ఉన్నాయి. వర్తమానానికి వీడ్కోలు, నూతనత్వానికి స్వాగతం చెప్పడానికి అరుదెంచే వినియోగదారులతో కిక్కిరిసిపోతూ విద్యుత్తువైభవంతో వెలిగిపోతున్నాయి అవన్నీ.

సత్యారావు తిన్నగా కారుతీసుకొని దొరగారి బంగళాకు చేరుకున్నాడు. అక్కడ ఆ సివిల్‌కారుని దాని అసలు డ్రైవర్‌కు అప్పగించాడు. తర్వాత తన జీపుతీసుకుని ఇంటివైపు దారితీశాడు.

రోడ్డుమీద పనీపాటూలేని జనం ఈలలతో, అరుపులతో మహానందడిగాఉంది. కూలీనాలీ చేయడానికి ఇష్టపడని సోమరిపోతులూ, ఒళ్ళొంచడానికి అంగీకరించని అమాంబాపతు సరుకూ, చదువుఅబ్బిరాక ఒళ్ళుపెంచుతున్న కుర్రకారు కొందరూ, రోడ్డుమీదికొచ్చి కేకలూ పెడబొబ్బలతో వీధుల్ని పిచ్చాసుపత్రిగా మారుస్తున్నారు. ఎగసినసముద్రకెరటాల్లా గట్టుతెంచుకున్న ప్రవాహంలా, పాపం పగిలి దానికొరలు బయటికొచ్చినట్టు రోడ్డుఈనినట్టు ఉప్పొంగి వరదలా ముంచుకొస్తున్నారు. రోడ్లపై బీభత్సం సృష్టిస్తున్నారు.

వారిని చెదరగొడుతూ పోలీసులతో వ్యానులు, ఆ వ్యానుల్ని చూసి సరదా పెరిగి మరింతగా రెచ్చిపోయినవారి భీతావహం, లాఠీలు, తూటాలు, ఏడుపులు, పెడబొబ్బలు, ఈలలు, విజిల్స్, నవ్వులు, వెక్కిరింతలతో అదో యుద్ధవాతావరణంలా ఉంది. ఒక్కొక్క గుంపూ దాటిపోతున్నకొద్దీ- ఒక్కొక్క సుడిగుండందాటిపోయిన ఉత్సాహంతో, రెట్టించిన ఉద్వేగంతో మరింత వేగంపుంజుకుంటున్నాయి వ్యానులు.

నాగరికత అంటించిన వికృతపుమచ్చ ఈ డిసెంబరు 31. రాత్రంతా మేలుకుని కొత్త సంవత్సరానికి స్వాగతం చెప్పడం అనేదొక ముసుగు. ఆ రాత్రి ఎన్నిఘోరాలు జరిగిపోతాయో? ఎందరి కన్నీళ్ళు నేలమీద మడుగుకట్టి ఇంకిపోతాయో!

ఇంటిదగ్గరకొచ్చేసరికి జీపు రోడ్డువారని ఆపి ఉషారుగా దిగాడు సత్యారావు. గేటు తీసి జోరుగా అడుగులేస్తూ మెట్లెక్కి ద్వారం సమీపించాడు. కాలింగ్‌బెల్‌మీద చేయివేయబోతుండగా.....

ఇంతలో అతను ఆశ్చర్యపోయేలా పక్కగది తలుపులు తెరుచుకున్నాయి. గుమ్మంలోంచి ఉషారుగా ఒక వ్యక్తి పక్కగేటు గుండా బయటకు నడిచాడు. ఎక్కడా పరాయికొంప అన్న సంకోచం కూడా అతనిలోవున్నట్టు లేదు.

సత్యారావుకి చాచి లెంపకాయ కొట్టినట్టయ్యింది. తలతీసేసినట్టయింది. ఇది పోలీసు కొంప. బార్లా తలుపులు తెరిచి వున్నా ఏ ఒక్కదొంగా ఇంట్లో ప్రవేశించడానికి సాధ్యపడని సందర్భం. అలాంటిది వీడెవడో పార్కులో దూరి, దర్జాగా కూర్చుని శుభ్రంగా గాలిపీల్చి సంతృప్తిగా వెళ్ళిపోతున్నట్లు ఇదేమిటి.....? అతను మరి ఆలోచించలేకపోయాడు.

ఇంట్లోకి వెళ్లబోతూ తీసివున్న తలుపుల్లోంచి చూశాడు!

ఆమె డ్రెస్సింగ్ టేబుల్‌ముందు కూర్చుని టాయ్‌లెట్ అవుతోంది. ఎక్కడికో వెళ్లబోతున్నట్టుగా కొత్త బట్టలతో, కొత్తరకం ముస్తాబుతో సంధించిన బాణంలా వుందామె. రసికమనసుకి విందుభోజనంతోవున్న వెండిపళ్ళెంలా నిండుగా వుందామె.

ఆమెనలాచూసేసరికి సత్యారావుకి అవమానం, ఆగ్రహం భళ్ళున చిమ్మింది. పౌరుషం పెల్లుబికింది. అందర్నీ నేలకూల్చినవాడు ఓ బక్కవాడి చేతులోచావుదెబ్బ తిన్నట్టు దుఃఖం పొంగుకొచ్చింది.

"ఇది ఇల్లనుకున్నావా, సానికొంపనుకున్నావా? నువ్వు ఒకడిభార్యననుకున్నావా, కాల్‌గర్ల్‌ననుకున్నావా?" అతని గొంతు అతనికి తెలీకుండానే అరిచింది.

అద్దంలోంచే భర్త రాకను పసికట్టి వుందామె. ఆమె కూర్చున్న భంగిమలో తలుపులు తెరిచివుంచితే రోడ్డు సహితం దర్శనీయమౌతుంది.

భర్త పులి అరుపులకి ఆమె బెదిరిపోలేదు. కానీ కొంచెం అసీజీగా కనుబొమ్మలు ముడిచింది.

మౌనంగానే బుగ్గలకు ఆఖరిసారిగా గులాబీ

పౌడర్ అద్దింది.పెన్సిల్ తో కనుబొమ్మలు మరోసారి టచ్‌చేసింది. లిప్‌స్టిక్ పెదాలకు సరిపోయిందోలేదో చివరిసారిగా చూసుకుంది. మరోసారి సెంటు స్ప్రేచేసింది.

జుత్తు మరింత విశాలంగా భుజాలమీదికి విరబోసుకుని, స్లీవ్‌లెస్ బ్లౌజు సరిచేసి, పైట మరోసారి వక్షోజాలు ఆకర్షణీయంగా కన్పించే రీతిలో సర్దుకుని, హాండ్‌బ్యాగ్ అతినుతారంగా భుజానకు వ్రేలాడవేసి అప్పుడులేచి నిల్చుంది.

ఆఖరిసారిగా తన ఆకారాన్ని అలంకరణని, భంగిమని అద్దంలోనిండుగా చూసి, పూర్తి సంతృప్తికలిగిన తర్వాత గుమ్మం వైపు తిరిగింది.

ఆమెకు ఎదురుగా భర్త కనిపిస్తున్నాడు. అతని వెనక రోడ్డు కనిపిస్తోంది. రోడ్డుమీద అతను కనిపిస్తున్నాడు. అతని పక్కనే గేటువారగా ఆపి నిల్పోపెట్టిన స్కూటర్ కనిపిస్తోంది. ఆమెలో ఉత్సాహం ఉప్పెనలా ఎగసిపోయింది.

అంతే! అతని వునికినే గమనించనట్లు అతని పక్కనుంచే విసురుగా వెళ్ళిపోబోయింది. ఆమెనడకలో ఎలాంటి తొట్రుపాటులేదు. తొందరవుంది, అంతే!

సత్యారావులో అసహనం అంచులుదాటింది. అవమానం బుసకొట్టింది.

"నేనింతగట్టిగా అరుస్తుంటే నీకు వినిపించలేదా? నేనసలు నీకంటికి కన్పించడంలేదా?" అతనురెచ్చిపోతూ గర్జించాడు.

ఆమె ఆగింది. ఒకేఒక్క నిమిషం ఆలోచించి వెనక్కి తిరిగింది. వెటకారంగా– "చూడండీ... మీరింతగట్టిగా అరవడంవలన మీకు వచ్చేదీ... నాకుపోయేది ఏమీలేదు. ఇప్పుడు నాకీవూళ్ళో అత్యుత్తమ ఇల్లాలు నారీ శిరోమణి లాంటి బిరుదులేమీలేవు. కాకపోతే మీకే అవమానం మిగుల్తుంది. కిందివాళ్లదగ్గర ఇంకా హీనమైపోతారు. మీకీపాటి స్థానంకూడా దక్కదు" అంది ప్రశాంతంగానే.

అతనికి ఏడుపు పర్యంతం అవుతున్నది. "నాకు గౌరవం మాత్రం ఏం మిగిలిందిలే. నిన్ను కట్టుకున్న మరుక్షణం అది ఎగిరిపోయింది. ఊర్లో పులి, ఇంట్లో మేక. అన్నట్లుంది. నన్ను బఫూన్‌నిచేసి తోలుబొమ్మలా ఆడించావు. అప్పుడే పోయింది నా పరువు. ఇంకేమైనా మిగిలివుందనుకుంటే అది ఈరోజిలా ఇంకిపోయింది. ఇంతదారుణమైన పగ సాధించడానికి నేనుచేసిన నేరమేమిటి? నీపట్ల నేను ప్రవర్తించిన అపరాధమేమిటి? నన్నిలా అవమానిస్తూ నువ్వేలా వినోదించగలుగుతున్నావు. ఇలా నన్ను అవమానించడానికేనా నన్ను పెళ్లిచేసుకున్నావు?"

అతని పరిస్థితి దయనీయంగా వుందనిపించిందామెకు.

ఆమె చాలా అసహ్యంతో చూసింది. అతణ్ని వుడికించాలని ఆమెకు అనిపించలేదు. ఆ క్షణంలో అతనివాలకం చూసి ఆమెకు జాలిమాత్రం కలిగింది. అయినా ఈదేవిరింపు ఆమె ఒంటికి సరిపడనిది. అందుకే అర్థవంతంగా నవ్వింది.

"చూడండీ... నేను కావాలని మిమ్మల్ని పెళ్ళిచేసుకోలేదు. అలాగని ఇప్పుడు ద్వేపించడంకూడాలేదు. నేను అవమానిస్తున్నాననుకుంటే అది మీ తప్పు. మీస్థానంలో ఎవరున్నా ఇదే జరిగేది. 'ఒకే మొగుడూ ఒకే పెళ్ళాం' అనే సూత్రంమీద నాకు నమ్మకంలేదు. ఒక మొగుడు దగ్గరవుంటూ, మరో మగాడి కౌగిట్లో నలగడం తప్పని నాకుతెలుసు. కాని నా భర్తకు నాకన్నా ఇతర్లూ, వాళ్ళ అవసరాలూ ముఖ్యం, అవసరం. అది తీరాకా కృతజ్ఞత మనిషిని లొంగదీస్తుంది. కర్తవ్య విముఖుణ్ని చేస్తుంది. పిరికివాణ్ణి చేస్తుంది. నన్ను గృహిణిగా చూసుకునే నువ్వు నన్ను భార్యగా చూడలేవు. కాని నాకు అన్నీ కావాలి. అందుకే వీధిలోకి విరుచుకుపడ్డాను.

"ఇలాంటిపనులకు మొగుడనేవాడొకడు, తెరచాటు గుడ్డలా అడ్డం అంతే! అపుడే అన్నీ ఏఅడ్డూఅదుపూ లేకుండా సజావుగా సాగిపోతాయి. తమాషాలెన్నయినా నిర్భీతిగా చేసెయ్యొచ్చును"

"ఈ ఇల్లునాది. నువ్వు వేసుకుని షికార్లు తిరుగుతున్న ఆ ఖరీదైన గుడ్డలునావి. ఆఖరికి నువ్వు తినేతిండి కూడా నాదే. నీ చదువుకు లక్ష రూపాయలు ఖర్చయింది. నీ ఉద్యోగం సంపాదించడానికి యాభైవేలు కావల్సి




వచ్చింది. చివరికి నీ ప్రమోషన్‌కి పాతికవేలు ఇవ్వాల్సి వచ్చింది. నీసొంత ఖర్చులకింద మరో పాతికవేలు పోయాల్సి వచ్చింది. ఇప్పుడు నువ్వు ఏదిక్కుమాలిన ఏరియాకు వెళ్ళినా ఆ రెండు లక్షలూ నెలల్లో గడించేసి నాము ఖాన పారెయ్యవచ్చును. కాని లెక్కపెట్టుకోడానికి క్కూడా లక్షపైసలు నీదగ్గరలేని రోజుల్లో సరిగ్గా సమయానికి అవకాశం చేయిజారిపోకుండా, నిన్ను ఆదుకుని, కాపాడి నీకంటికి దేవతలా కన్పించాను.

"అప్పటికే నాకోర్కెలేమిటో నాకుతెలుసు. అవి తీరేమార్గమేమిటో నాకుతెలుసు. అందుకే నిన్ను నేను పెళ్ళిచేసుకున్నాను. దీని మూలంగా నీహోదాకు దెబ్బతగులుతుందని, నీ 'పవర్ పెర్సనాలిటీ'కి నష్టం చేకూరుతుందని నాకుతెలుసు. కాని నేనేమీ చేయలేను. నువ్వు నాభర్తవి కావడం నీ దురదృష్టం. అందుకు నేను జాలిపడుతున్నాను కూడా.

"కాని, డోన్ట్‌వర్రీ! ఒకరోజు, అదెప్పుడైనా కావొచ్చు. నేను కోరుకున్నది, నాకిష్టమైనది సమయానికి అందించినప్పుడు అప్పుడు నాకు నువ్వు కావాల్సినవాడివవుతావు. దేవుడివీ అవుతావు. మన్మధుడివీ అవుతావు. అప్పుడు నిన్నే పిలుస్తాను. నాభర్తగానే కాక కోరికలు తీర్చేవాడిగానూ పిలుస్తాను. అంతవరకూ కొంత రెస్టు తీసుకో"

"బాగాఅలసిపోయినట్టున్నావు. వంటలు కొత్త రుచులతో ఘుమఘుమలాడుతున్నాయి. వంటవాడు నీకోసం వెయిట్ చేస్తున్నాడు. కమ్మగా తిని సుఖంగా పడుకో. వేరే ఆలోచనలు పెట్టుకుని మనసుపాడుచేసుకోకు. వస్తా... బై.." అనేసి సమాధానం కోసమైనా ఎదురుచూడకుండానే గేట్‌వైపు నడిచింది. వెళ్ళి కూర్చోగానే స్కూటర్ కొండచిలువలా రోడ్డుమీద జారింది.

సత్యారావు నిశ్చేష్టుడైపోయాడు. తనదెంత హీనమైన బతుకు! ఎంత దయనీయమైన జీవితం. అతడు అవమానభారంతో కృంగిపోయాడు. శిరస్సు ఒరిగి నేలలో కూరుకుపోతున్నది.

ఆమె తనకాలు కొరికింది. నిస్సత్తువైనా భరించాడు. కాని ఇపుడు గుండెను గాయంచేస్తున్నది. తూట్లుతూట్లు పొడిచి దొలిచివేస్తున్నది. ఎలా, ఎలా. దీన్నెలా భరించడం? ఈ మంటల్ని ఎలా చల్లార్చుకోవడం. ఈ అవమానగరళాన్ని దిగమింగడంఎలా? ధైర్యంగా శిరసెత్తి ప్రపంచాన్ని ఠీవితో చూడ్డానికి తనమానసమే అడ్డొస్తున్నది. ఇక ఎవరో ఏమో అంటారని అనుకోడమెందుకు? తన దీనబతుకు తనకే అసహ్యంవేస్తున్నది. వెగటు పుడుతున్నది.

పై అధికారి పాదాలచెంత పడివున్న ఈ హోదా! భార్యదయాదాక్షిణ్యాల్లో నలిగిపోతున్న శరీరం. ఏనాటి పాపఫలమో!

కోపం... పగ, ప్రతీకారం. అసహనం అతనిలో పరాకాష్టకు చేరుకున్నాయి. లాఠీతో గోడల్ని బద్దలుకొట్టేస్తూ ఇష్టమొచ్చినట్టు స్వైరవిహారం చేశాడు. చేతులు పీకిపీకి అలసిపోయాడు. ఒళ్లంతా చెమటలుపట్టి, నరాలన్ని తీవ్ర ఆవేశంతో కొట్టుకుని అలిసిపోయాయి. నిస్సత్తువుగా కుప్పకూలిపోయాడు.

అద్దాలు, సామగ్రి విరగ్గొడితే మళ్ళీ ఎక్కడ తిరగబడుతుందోనని అదోభయం. ఉన్న ఈపాటి కాస్త సంబంధాన్ని తెంపేస్తుందేమోనని అదో దిగులు. తన అసమర్ధతకు, చేతకానితనానికి అతనికి అతనే తెగతిట్టిపోసుకుని, వెర్రికోపంతో పైకిలేచాడు. సత్తువకూడదీసుకుని, లేని పౌరుషం కల్పించుకుని, ఆ అలసటతోనే, చెమటతోనే, ముఖమైనా తుడుచుకోకుండా జీపెక్కాడు.

స్టేషన్లో దిగుతూనే ఉగ్రుడైపోయి– "సెంట్రీ ఎక్కడ? రైటరెక్కడ?" అని రెచ్చిపోయి అరిచాడు.

ఆయాసంతో రొప్పుతూ వగరుస్తున్నాడు.

ఈ పక్క నుంచి ఒకడూ, ఆ పక్కనుంచి ఒకడూ పరుగెత్తుకుంటూ వచ్చారు. వారిని చూస్తూనే మరింత రెచ్చిపోయాడు సి.ఐ- "ఏరా... ఈరోజు డిసెంబరు 31 అని మరచిపోయారా, స్టేషన్లో వుండాలని తెలీదా. మీ ఇద్దరికీ డ్యూటీ అప్పగిస్తే టీ తాగడానికి వెళ్ళిపోయినవాడొకడు, బీడీ కాల్చడానికి సందులో దూరినవాడొకడు. ఇదీ స్టేషన్లో మీ నిర్వాకం. వయొలెన్స్ జరిగి ఈ ఆర్మ్స్ దోపిడీ జరిపితే?"

రైటర్ ఈ ప్రవాహానికి ఆనకట్ట వేయకపోతే లాభంలేదని ధైర్యం చేసాడు- "నిజంగా



వయొలెన్సే జరిగితే మేమిద్దరముండి అడ్డేగలమేటండి. వీటినికాపాడ్డం మా తరమా? మాప్రాణాలే గాల్లో వుంటాయి'' అన్నాడు తెగించి.

ఇది విన్నట్టు నటించాడు సి.ఐ. అయినా రోషం మాత్రం తగ్గించలేదు. ''ఏడీ- దానుగాడెక్కడ?'' అని పెద్దపులిలా హూంకరించాడు.

''ఇక్కడే వున్నానండి'' నక్కుతూ ఓ మూల నుంచి వచ్చాడు దాను.

''ఏం... ఒళ్ళు బలిసిందా?''

''బలిస్తే ఇలా ఎందుకుంటానండి''

''నోర్ముయ్... మళ్ళీ జవాబుచెప్తే మక్కలిరగదన్ని బొక్కలో తోసేగల్ను. ఈ రోజు ఏ రోజనుకున్నావ్- ఎక్కడ చచ్చావింతవరకూ''

''నాకిదేం గవర్నమెంటు కొలువేటండీ... మీ కంటే జీతాలొస్తాయి. నాకేటొస్తది- తిట్లు తప్ప. ఇంతవరకూ ఇక్కడే కునికిపాట్లు పడుతున్నానండి''

పకపకనవ్వింది దో గొంతు. ఆ గొంతు విని అదిరిపడ్డాడు సత్యారావు. ఇక్కడ తాము నలుగురుకాక అయిదో గొంతు కూడా వున్నదన్న మాట. ''ఎవడాడు- హేయ్'' అంటు వెనక్కితిరిగాడు. తిరిగిచూశాడు.

డస్ట్ దగ్గర ఒక వ్యక్తి కూర్చుని వున్నాడు. అంత ఎదురుగా ఇంత మనిషిని వుంచుకుని చూడలేకపోయాడు. ఎంత ఆవేశంలో వున్నాడు తను. అక్కడ ఎవరున్నదీ గుర్తించలేనంత స్థితిలో వున్నాడు. తనున్న స్థితికి తానే సిగ్గుపడ్డాడు సత్యారావు.

''ఏమిటి? కుర్చీలు, బెంచీలు తెగబాదేస్తున్నారు. నిప్పుల కుంపటి మీదున్నట్టు రెచ్చిపోతున్నారు. ఇంట్లో పెళ్ళాంచేతిలోగాని దెబ్బతిన్నావేటి గురూ! అంత ఉద్రేకంలో వున్నావ్'' వెటకారంగా నవ్వాడు ఆ అయిదో మనిషి.

''నోర్ముయ్... నోటికొచ్చినట్లు వాగావంటే ఏ కీలుకాకీలు తప్పించిగలను. స్టేషన్లో నాకెదురుగా ఎంతధైర్యం నీకు- జాగ్రత్త!''

''నోరు పారేసుకోకు గురుడా! డైలాగులు నాకూ తెలును. తెలుగుభాష- అందులోనూ అచ్చ తెలుగు భాష. పైగా ముదరనాటు భాష మరికొంచెం ఎక్కువ తెలును. మీరేమైనా అంటే దులిపేసుకోగలం. చిన్నవాళ్ళం కాబట్టి మేమేమన్నా అన్నామంటే మాత్రం మీ గుండెల్లో డైనమేట్ పేలిపోద్ది. గునపంలా నాటుకుపోద్ది. బాకులా గుచ్చుకుపోద్ది'' కాళ్ళు రెండూ కూర్చున్న బెంచీమీద బార్లాచాపి చేతులు రెండూ తల వెనక్కి వేసి ముడిచి మరింత ధిక్కారంగా కూర్చున్నాడతను.

''వీడు సూరిగాడని ఓ ఛోటా లీడరండీ! మొన్న రిక్షాలకి, ఆటోలకిచిన్న కొట్లాట జరిగింది చూడండి... అందులో ప్రశ్నించడానికని మీరేకదా పిలిపించమన్నారు. అందుకే రప్పించాను'' రైటర్ సంజాయిషీ ఇచ్చుకున్నాడు.

''అదా వీడి టెంపర్‌మెంటు. వీడినేమైనా చేస్తే రిక్షాల ఊరేగింపు, స్ట్రయిక్, హర్తాలు, బంద్, పికెటింగు- ఇంకా ఎక్కువైతే లూటీలు, దోపిడీలు- అదిరా నీధైర్యం. ఏం... నువ్వీ వూరికి మొనగాడివనుకుంటున్నావా?'' మరింత ఆవేశంగా అన్నాడు సి.ఐ.

''ఆ ప్రశ్నే నేనడిగితే మీరేం సమాధానం చెబుతారు? ఏమిలటరీ పాలనలోనో వున్నట్టు అధికారం చెలాయిస్తున్నారే! పౌరపాలనలోనే మీరింత రెచ్చిపోతుంటే మిలటరీ పాలన వచ్చిందంటే అప్పుడు తుపాకీ గుండులా తయారవుతారు కాబోలు''

''వీణ్ని లాకప్‌లో పెట్టండిరా. గొప్ప బుర్రతిరుగుడుగా వుంది''

సి.ఐ. గారినోట నుంచి ఆర్డరు రావడమే తరువాయి రైటరూ, సెంట్రీ సూరిబాబుని పట్టుకొని తీసుకువెళ్లబోతుండగా అతను వాళ్ళని విసురుగా తోసేశాడు- ''నేను కేటుగాణ్ని గూండాని అనుకుంటున్నారా! లేక స్మగ్లర్ని బ్లాక్ మార్కెట్‌దారుణ్ణి అనుకుంటున్నారా- లాకప్‌లో పెట్టడానికి'' అంటూ బిగ్గరగా అరిచాడు.

అప్పుడు మూడోవాడు కూడా వారిద్దర్లో చేరాడు.

ఎక్కడ పడితే అక్కడ తనకు నమస్కారంపెట్టి టీనీళ్ళు అడుక్కునే ఈ అప్పిగాడి చేయి కూడా ఒంటిమీదపడేసరికి సూరిబాబు ఉగ్రుడైపోయాడు. ''ఒరే... నువ్వు కూడా్రా... బ్రోకరు నాకొడకా! నన్ను బయటకు రానీరా-




నీవని చెప్తాను. రిక్షావాళ్ళతో చెప్పి ఒక దరువే యించేసి, ఏ కీలుకాకీలు విరగ్గొట్టి హాస్పిటల్‌కు పంపిస్తాను. మళ్ళీ నువ్వు తిన్నగా నడిస్తే ఒట్టు''

ఇక తప్పని పరిస్థితుల్లో సత్యారావు కూడా కలుగచేసుకున్నాడు. మొత్తం నలుగురూ కలసి నూరిబాబుని బలంగానెట్టి సెల్‌లోకి తోసి తాళంవేశారు.

సత్యారావు కొంత రిలాక్సుఫీలయ్యాడు. నెమ్మదిగా వచ్చి కుర్చీలో కూర్చుని కాళ్ళు రెండూ బారచాపి టోపీతీసి టేబుల్‌మీద వుంచాడు. లాఠీ టేబుల్‌మీదపెట్టి ముఖానికి పట్టిన చెమటను కర్చీఫ్‌తో తుడుచుకున్నాడు.

ఒక్క పదినిమిషాలతర్వాత కొంత స్వస్థత చేకూర్చుకుని మంద్రస్వరంతో ''ఒరే అప్పిగా''... అని పిలిచాడు.

ఈలోగా రైటర్ ఫ్లాస్క్‌లో కాఫీ సి.ఐ.గారికి చ్చాడు. వేడి వేడికాఫీ గొంతులో పడినతర్వాత నరాల్లోకి కొత్త ఉత్సాహం ఎక్కింది. కొంత హాయి ఫీలయ్యాడు.

''యస్సార్'' దానువచ్చి ఎంతో వినయంగా చేతులు కట్టుకునిల్చున్నాడు.

వాణ్ణి ఇంకా దగ్గరగా పిల్చి వంగోమన్నట్టు సైగ చేసాడు సత్యారావు.

వాడు దగ్గరగా వచ్చి వంగున్న తర్వాత వాడి చెవిలో రహస్యం చెప్పినట్టు చెప్పాడు.

''ఎర్రగా బుర్రగా వున్న ఒక కొత్త గుంట కావాల్రా! కొంచెం ఒళ్ళుండి జబ్బుల్లేకుండా వుండాలి. ఒక్క పిసరు అందంకూడా వుంటే మంచిదే'' అన్నాడు అది అత్యవసరంఅన్నట్టు.

దాసు ఒక్కసారి ఎగిరి గంతేసాడు! సి.ఐ. దారిలోపడినందుకూ, అంతటివాడికి కూడా తన అవసరంవచ్చినందుకు వాడు సంతోషించాడు! మహదానందపడిపోయాడు

''అదెంతపనిసార్... కొత్త పిట్టొకటి పల్లెటూరినుంచి ఎగిరివచ్చి ఒక గూటిమీద వాలింది. మరీ చిన్నపిల్ల. పెద్దమనిషి అయినట్టుకూడా పోల్చుకోలేం. దాని అందంగురించి ఎంతచెప్పినా, అది చందమామని తక్కువ వర్ణించడమే అవుతుంది. పాలుతాగేవయసుకాదు కాని-'' అంటూ వర్ణించాడు.

సత్యారావు మనిషి ఎదుట వున్నట్టుగానే భ్రమించిపోయాడు. ఉత్సాహం పురకలు వేసింది. ఉద్రేకం ఉప్పెనలా లేచింది-మరైతే '' ఏమిటి ఆలస్యం? ఇంకెవరికైనా బుక్కైపోద్ది. అందులోనూ ఈరోజు ఎలాంటిరోజు- వెళ్ళు... తొందరగా వెళ్ళు''

''ఇదిగో- ఇప్పుడే వెళ్తున్నాను'' అంటూ దాసు హుషారుగా ఒక్క గంతువేసి అక్కడి నుండి కదిలిపోయాడు. ఈ నెపంమీదనైనా ఒక అరగంట అలా షికారు కొట్టి చిల్లరఖర్చులకు ఏదైనాజేబు కొట్టొచ్చని వాడి సరదా.

సత్యారావు కోరికతో సలసల కాగిపోతున్నాడు. పెనంమీదమాడిపోతున్న ఉల్లిపెసరట్టులా వేగిపోతున్నాడు. సేదతీర్చుకుంటేతప్ప ఒళ్ళు చల్లబడదు. తాపం తగ్గి మామూలు మనిషిఅయితేతప్ప ఈ అవమానాన్ని దించుకోడం కష్టం.

అతను ఆలోచిస్తూ రెచ్చిపోతున్నాడు. రెచ్చిపోతూ ఆలోచిస్తున్నాడు. రెండూచేస్తూ రంకవేస్తున్నాడు. రంకవేస్తున్న అతని కంటిముందు భార్య కోరల పులిలా, కొండచిలువలా పరమ కౄరంగా కన్పిస్తోంది.



''దిగేలంజా... నీరోగం ఇక్కడ కుదురుద్ది'' అంటూ అప్పిగాడు రిక్షా దిగాడు. వాడు కాస్త మందుపట్టులో ఇంకొంచెం పూనకంలో వున్నాడు. వాడికి అయ్యగారి మెప్పుతప్ప ఆ మెప్పుకోసం చేయబోయే ఘనకార్యంలోని అన్యాయం పట్టనట్టు కరకుగా, మొరటుగా వున్నాడు.

ఆమె రిక్షాదిగలేదు. అలాగని మొరాయించనూలేదు. అలా మొరాయించిన

రెండుమూడు సందర్భాలు ఆమెకు గుర్తు న్నాయి. లాడ్జీలముందు రిక్షా ఆగినప్పుడు దిగనని మొండికెత్తింది. ఆ ఏడుపేదో ఇంట్లోనే ఏడిస్తే ఛస్తే చూడ్డానికి, ఏడిస్తే ఓదార్చడానికి సాటి అభాగినులున్నారు. ఈ లాడ్జీల్లో దిగినవా ళ్ళందరూ సంపన్నమూర్ఖులు. డబ్బంతా ఎలా ఖర్చుచేయాలో తెలీక ఇలా విచ్చలవిడిగా బారుల్లోనూ, మారుమూల్లోనూ ఎగబడుతున్న దౌర్భాగ్యులు.

పైగా ఒక్కడుగాదు - ఇద్దరు ముగ్గురేసి వుంటారు. అంతా ఒకేసారి మూకుమ్మడిగా మీదపడతారు. ఒకడు పిసుకుతాడు. ఒకడు రక్కుతాడు. ఒకడు లాగుతాడు. ఇంకోడు ము ద్దులనుకుంటూ గాట్లుపెట్టి, పెదాలు, బుగ్గలు అన్నీ కొరికేస్తాడు. ఆ పశుత్వం భరించలేక ఒకటిరెండుసార్లు మొరాయించినా అవి ఫలి తాల్నివ్వలేదు. పైగా చితకపొడిచి, పెడరెక్క లు విరిచికట్టి, కాళ్ళూచేతులూ పట్టుకొని, బల వంతాన మోసుకెళ్ళి గదిలో పారేసేవారు. అక్క డనుండి మరింత కక్షతో, కసితో ప్రారంభమ య్యేది వారి సవారీ. అదో రాక్షస రతి.

అందుకే ఇప్పుడు మొరాయించలేదు. కాని ఇక్కడ తనకెలాంటి మర్యాద జరగబోతోందో నని అంచనా వేసుకునేందుకు రిక్షాలోంచి ముఖం కొంచెం పైకితీసి, ఆఇంటికేసి తొంగి చూసింది.

అది ఇల్లుకాదు. లాడ్జికాదు. సాదాసీదా బంగ్లా అసలేకాదు.

అది పోలీస్‌స్టేషన్! సమస్త ప్రజల సర్వరక్ష ణాకేంద్రం.

శాంతిభద్రతలు, సుఖశాంతులు ప్రసాదించే న్యాయనిలయం. గూండాల గుంపునుంచి కీచ కాధముల నుంచి మానప్రాణాలకు గొడుగుపట్టే రక్షావలయం.

ఆమె మనసు ఎండలోనుంచి మంచులోకి వచ్చిన పువ్వులా వికశించింది. ఆమె పల్లెటూ రుచిన్నది. అమాయకపు ముగ్ధ. నిజాయితీ, నీతి పుణికిపుచ్చుకున్న వరాలమూట. మంచిత నానికి మరోపేరు...

ఆమే వరాలు.

ఆ స్టేషన్ చూసేసరికి ఆమె ముఖం విప్పా రింది. పునర్జన్మ ఎత్తాననుకుంది. కష్టాలుగట్టె క్కాయనుకుంది. పీడకలలాంటి ఈ నెలరోజు లూ తన వండంటి నూరేళ్ళ పచ్చనిబతుకును నిర్దాక్షిణ్యంగా ముక్కలుముక్కలుగా నరికివే శాయి. ఆ ముప్పయి రాక్షసరాత్రులూ మరచి పోవచ్చుననుకుంది.

కాగల కార్యం తీర్చడానికి గంధర్వులే ఈ రూపంలో దిగివచ్చి తన అదృష్టం పండించార నుకుంది. ఇక తను నిశ్చింతగా, నిర్భయంగా తన వూరెళ్ళిపోవచ్చుననుకుంది. తన బతుక్కి పట్టిన ఈ గ్రహణం ఇంక తొలిగిపోతుందను కుంది.

అంతే! రెట్టించిన ఉత్సాహంతో ఒక్క వుదు టన కిందికి ఉరికింది. ఒక్కగంతులో స్టేషన్‌లో పలికి పరుగెత్తింది.

పరుగెత్తి హాలుమధ్యకు వచ్చి ఠక్కున ఆగి పోయింది. ఆగిపోయి బెదురుచూపుల్తో లేడిక ళ్ళతో ఆ వాతావరణం గమనించి తాను పులి గుహలోకి ప్రవేశించలేదుకదా అనుకుంది; పడుకున్న సింహాన్ని లేపడానికి రాలేదుకదా అనుకుంది.

అక్కడ ఎదురుగా పులితోలు సాపుచేసి కుట్టించుకున్నట్లున్న కాకీబట్టలు. సింహపు మీ సాలు తెచ్చి అతికించుకున్నట్లున్న మీసాల్తో, వేటగాని కళ్ళతో ఆకలిగొన్న ఖడ్గమృగపు చూపు ల్తో, భారీయెత్తుగా వెయ్యి శవాలమీదనైనాసరే నిశ్చింతగా నిల్చోగలనన్నంత భీకరంగా ఇన్ స్పెక్టర్ సత్యారావు నిల్చుని వున్నాడు.

టేబుల్‌మీద చేయి ఆన్చి ఒంటికాలుమీద నిల్చొని రెండోకాలు అటూఇటూ ఆడిస్తూ దర్జాగా, హుందాగా, ఠీవిగా, ఈ లోకాన్ని ధిక్కరి స్తున్నంత గర్వంగా, పొగరుగా నిల్చునివున్నా డు. మొదటిచూపులోనే ఆమెను అంచనావేసి, తన అవసరాలకు మించిపోయిందని తెలుసు కున్నవాడై ఇక కార్యక్రమం ప్రారంభించాలని నిశ్చయించుకున్నాడు. అంతే... ఒక్క అడుగు ముందుకువేశాడు.

అంతలో! ఆమె అతని కాళ్ళమీద ఒక్కసా రిగా కట్టెలాపడిపోయింది. అతని రెండుకాళ్ళు ఆమె రెండుచేతుల్తోనూ చుట్టేసుకుంది. కన్నీ రు వాగులైపారగా హోరున ఏడ్చింది.

అది ఏడుపుకాదు, భూనభోంతరాళాలు దద్దరిల్లేఘోష, పేగులు తెంపుకుని పెల్లుబి




కిన ఆక్రందన, ప్రతి అన్నకూ చెల్లెలుగా, ప్రతి తమ్ముడికీ అక్కగా, ప్రతి తండ్రికీ కూతురుగా, ప్రతి భర్తకూ ఆదర్శగృహిణిగా గౌరవంగా పెరిగే ఆడమనిషి, బాధ. డైనమైటుపెట్టి పేలిస్తే పేలి తుళ్ళినట్టు, జలపర్వతం పగిలి ఎగిరినట్టు బయటకు ఉబికిన లక్షోపలక్షల కన్నీటి మొగ్గలకథ... వెరసి ఆడజాతి జాలికథ.

"బాబూ రక్షించండి తండ్రీ... రక్షించండి. నాకు మీరుకాక ఎవరుదిక్కు" ఆ నరకంనుండి తప్పించండి. నాకు విముక్తి ప్రసాదించండి. ఆసాముల నూతిలోనుండి తమరే దేవుడిలా నన్ను బయటికి లాగాలి. మోసపోయానుబాబూ! ఆ తార్పుడుగాడు మొగుడుకాదు యముడు. పెళ్ళిచేసుకున్నాడు, పెద్దలందరి సమక్షంలో తాళికట్టాడు. ఇదిగోనండి దానికి నిదర్శనం ఈ పసుపుతాడు. సిన్నమెత్తు ఈ బంగారంరేకులు. కాపురానికనిచెప్పి పట్నం తీసుకువచ్చాడు.

కాపురం చెయ్యలేదు సరికదా సానికొంపకమ్మేశాడు. అది సానికొంపకాదు బాబు- అగ్నిగుండం! నాలాంటి జీవులక్కడ ఎన్ని మాడిపోయాయో, మసైపోయాయో అది ఆడది కాదుబాబు... రాక్షసి. అది మనిషికాదు బాబూ... దెయ్యం. డబ్బు పిశాచి మమ్మల్ని హీనంచేసి, నుగ్గు చేసి, కైమాచేసి ఆ రక్తపుమడుగులోంచి అది రూపాయినోట్లు నొల్లుకుంటోంది బాబూ!

తమరు ధర్మప్రభువులు. మాలాంటివారి పాలిట దైవస్వరూపులు. ఆ వూబిలోనుంచి బయటికితీసి తమరే నన్ను కాపాడాలి. నన్ను మావూరు పంపించెయ్యండి. తండ్రీ! కూలిచేసుకు బతుకుతాను. కలోగంజో తాగి బతుకుతాను. ఉంటే తింటాను, లేకపోతే పస్తులుంటాను. ఎలా బతికినా అది బతుకుబాబు. అదే గొప్ప బతుకు. అదే దర్జాబ్రతుకు. అదే రాజాబ్రతుకు. ఇదేంబ్రతుకు. ఛీ, కుక్క బతుకు ఇదీ ఒక బతుకే? మా వూర్లో పందులు కూడా బతుకవు బాబూ ఇలా! ఈ దీనురాలిపట్ల దయచూపండి, కనికరం చూపించండి తండ్రీ"

ఆమె మనిషి! రక్తమాంసాలున్న మనిషి! అది ఏడుపు కాదు- కన్నీటి కెరటాలుగా పెల్లుబికిన రక్తం. అవి మామూలు మాటలు కావు- గుండెల్లోంచి దూసుకొచ్చిన బాకులు.

కానీ సత్యారావుని ఇవేవీ కదిలించలేకపోయాయి. అప్పటికే ఆయన శరీరం కామతీవ్రతతో కుతకుతలాడిపోతున్నది. ఇదేమిటి పెంట- అన్నట్టు మహాఇబ్బందిగా బాధపడిపోతున్నాడాయన. శుభమా అని దీన్ని రప్పిస్తే లెక్చరు దంచేస్తోంది. తనిక్కడ తీరిగ్గా కూర్చున్నది, అందునా ఈ సమయంలో ఇందుకేనా!

కొమ్ములు తిరిగిన సంపన్న సుందరాంగులే రిపోర్టు ఇవ్వడానికి స్టేషనుకొస్తే లక్ష్యంలేకుండా వారివంక గీరచూపులు చూడ్డానికి అలవాటుపడ్డ జాతి తనది. పోలీసోడి చేతిలో తుపాకీ వున్నంతవరకూ మహామహులే, జాతినేతలే తలొంచాల్సిన దేశం ఇది. ఆఫ్ట్రాల్... బిచ్చిస్, అందునా ఒక పికిలిగుంట, నిన్నకాక మొన్న కళ్లు తెరిచిన ఒక పసిగుంట- దీన్ని కేర్ చేయటమా! ఆయ్- అనుకున్నాడు సత్యారావు. అలా అనుకున్న వెంటనే అతని బుర్ర పాదరసంలా పనిచేసింది. ఆలస్యం అమృతం విషం. అందులోనూ ఈరోజెలాంటిది? కాలం గడుస్తున్నకొద్దీ ఎవడో ఒకడు రావచ్చు.

సత్యారావు ఇక ఆగలేకపోయాడు. అతనిల సహనం చచ్చిపోయింది. గడిచిపోతున్న నిమిషాలు అతడిని హెచ్చరిస్తున్నాయి.

అంతే! అంత మనిషి పూనకం పట్టినట్టు వూగిపోయాడు. బూటుకాలితో గట్టిగా ఒక్కతోపు తన్నాడు. అది ఆమెకు బలంగా తగిలి అంత దూరాన్న వెల్లకిల్లపడిపోయింది.

అదే అదనుగా హెచ్చరికగా బాస్ కనుసైగతో రైటర్ ఆమెను బరబరా ఈడ్చుకుంటూ చీకటి కొట్లోకి తీసుకెళ్లి అక్కడ ఎత్తి కుదేశాడు. తర్వాత డిమ్‌లైట్లువేసి అక్కడినుండి వెళ్లిపోయాడు.

అప్పటికే కోరికతో అతలాకుతలమైపోతున్న సత్యారావు ఆతృతతో అక్కడికొచ్చాడు. ఆయన కంటికింకేమీ కన్పించడంలేదు. తిరుగుతున్న గడియారం ముల్లు ఒక్కటే భయం భయంగా కనిపిస్తోంది.

నడుంకి బిగించిన బెల్టు విప్పాడు. ఫాంటు బొత్తాలు వదులుచేశాడు. ఆమె రెండు భుజాలు పట్టుకుని మీదికెత్తి కౌగిట్లో బంధించాడు. ఆమెను చూసిన రాక్షసుడెవడైనా రేప్‌చేయ



కుండా వుండలేదు. ఉంటే వాడు రాక్షసుడే కాదు. ఆమెతన మగతనానికో పరీక్ష. దేవుడనే వాడొకడుంటే, వాడిలో కూడా రాక్షసత్వాన్ని సృష్టించగల శక్తివంతమైనది ఆమె అందం అనుకున్నాడు.

సత్యారావు ఇనుప కౌగిట్లో వరాలు నుగ్గునుగ్గు అయిపోతున్నది. ఈ జరుగుతున్న యావత్తుకథా ఆమెకుఅర్థం కావడంలేదు. అంతా అయోమయంగా వుంది. ఇది పోలీస్‌స్టేషన్ కాదా? వారు పోలీసుబాబులు కారా? ఇది ప్రజారక్షణ మంటపం కాదా? తనున్న సాని కొంపకీ, ఈ పోలీస్‌స్టేషన్‌కూ మధ్య వున్న వ్యత్యాసమేమిటి?

ఆమె ఆయన పాదాలమీద కుప్పకూలిపోయి మరోసారి ప్రార్థించింది. "తమరు దేవుడు... భగవంతుడు. ఇది నీచులు చేయాల్సిన పని. తమరు కూడా ఇలా చేయడమా? నేను తమకు చెల్లెలులాంటిదాన్ని. నాకు తమరు తండ్రివంటివారు. తమరు నాకు న్యాయం చేస్తారనుకున్నాను. నా కష్టాలు గట్టెక్కిస్తారనుకున్నాను. తమరు కూడా ఇలా రెచ్చిపోతారనుకోలేదు. నన్ను రక్షిస్తారనుకున్నాను, తల్లిపక్షిలా రెక్కల్లో దాచుకుని కాపాడతారనుకున్నాను కాని గద్దలా ముక్కున కరిచి, గోళ్ళలో ఇరికించుకోజూడటం తమకు ధర్మమా? ధర్మప్రభువులు నాకు న్యాయం కల్పించండి. నాకు రక్షణ ఇప్పించండి".

ఆమె కన్నీటితో అతని పాదాలు తడిసిపోతున్నాయి.

అతనిలో అనహనం అంచులుదాటిపో యింది. సెక్సు ఉద్రేకం కట్టలుతెంచుకుంది. న్యాయం, ధర్మం ఆలోచించేస్థితిలో లేదు. అమాయకుల్ని చూస్తే ఎవరికైనా జాలివే స్తుంది. క్రూరమృగాలికైనా పిల్లల్ని చూస్తే ప్రేమ కలుగుతుంది. ఆమాత్రం నీతికూడా లేదు, ఇతనిలో.

సత్యారావులో కోపం బుసకొట్టింది. పులి పంజావిప్పి దెబ్బతీసినట్టు బలంగా చెయ్యెత్తి విసురుగా ఆమె చెంపమీద ఒకేఒక దెబ్బవేశా డు. అది అతిమొరటుగా కసాయివాడి కత్తిలా పడి వేటగాడి బాణంలా తగిలింది.

అంతే! గది యావత్తూ గజగజలాడింది. ఆమెబుగ్గ కంది ఎర్రగా మారిపోయింది. పళ్లు కదిలి నోటినుంచి రక్తం స్రవిస్తోంది. అది బాక్సింగ్‌లో పడిపొన్న దెబ్బ.

ఉద్రేకంతో ఊగిపోతూ బెల్టు చేతిలోకి తీసు కున్నాడు. దాన్ని పొజిషన్లో పెట్టి ఒక్కసారి గాల్లో తిప్పి ఆడించాడు. ఆ సవ్వడికి గాలే జలద రించి రివ్వున పరుగెత్తింది. ఒక భయంకర వాస్తవం చూడ్డానికి ఆ గది తనను తాను సిద్ధపరచుకుని బిగుసుకుపోతున్నది. భయంతో కళ్లుమూసుకున్న గది చీకటిగా వుంది. చీకటిగావున్నగదిలో డిమ్మలైటు ఒంటి కంటి రాక్షసిలా వెలుగుతోంది.

సత్యారావు వూగిపోతున్నాడు. అతని కళ్లు ఎర్రగా నెత్తుటిజ్యోతుల్లా వున్నాయి. అతని చూపుల్లో కామంకోరలు కాటువేయడానికి పొంచివుంది. అతని చేతుల్లో ప్రభుత్వం ఇచ్చిన బలంవుంది. దాన్నుంచి తప్పించుకో డానికి చట్టం కల్పిస్తున్న లొసుగులున్నాయి.

ఆయన్నలా చూసేసరికి వరాలుకు మతిపో యింది. తాను రెండోసారి మోసపోయానను కుంది. తాను భ్రమపడినట్టు అది పోలీసుస్టేష న్కాదా? అయితే మరేమిటి? ఆయన ఇన్స్పెక్ట రు బాబుకాడా? కాకపోతే మరెవరు? ఇది మరోరకం గూండాల స్థావరమా? ఆయన బరి తెగించిన హంతకుడా? కొలిమిలా మండుతు న్న ఆయన కళ్లనూ, కత్తుల్లా దూసుకుపోతున్న ఆ చూపుల్నీ రౌద్రభీకరంగా భూతప్రేత పిశా చంలా వున్న ఆ వికృతాకారాన్నీ అలా చూసేస రికి ఆమెకు నెలరోజులక్రితంనుంచీ వరుసగా జరిగిన, రాక్షససంఘటనలు, పైశాచిక సన్నివే శాలూ ఒక్కొక్కటి కళ్ళల్లో మెదులుతున్నాయి. అక్కడ అప్పుడు మాత్రం ఏం జరిగింది?

★ ★ ★

నూకరాజు ఇంట్లో ఆమర్నాటి ఉదయం లేస్తూనే వరాలుకు తన పరిస్థితి అర్థమైపో యింది. ఒళ్లంతా పచ్చిపుండుగా వుంది. ఎముకలన్నీ పిప్పిపిప్పి అయిపోయినట్టు న్నాయి. మాంసభాగాలన్నీ ముక్కలుముక్క లుగా నరికినట్టు వుంది. పొత్తి కడుపు కింది భాగం, వక్షం, ఆమీదిభాగం దూదిలా సాగదీసి నొప్పులుగా వున్నాయి.

తిన్నతిండి కూడా సహించలేదు. రాత్రి తాగిన థమ్సప్, దానితోపాటు వెళ్లిన రమ్ము కూడా కడుపులో ఇమడలేదు. కళ్ళు తిరిగినట్ట యింది. ఒళ్లు తూలినట్టయింది. ఎవరో సూదు లుపెట్టి పొత్తికడుపులో గుచ్చుతున్నట్టు అయింది. నరాల్లో కత్తులు దించుతున్నట్ట యింది.

మరోసారి భళ్లున వాంతిచేసుకుని తిరిగి మంచంమీద కట్టెలా విరుచుకుపడిపోయింది. ఆ పడిపోవడం పడిపోవడం సాయంత్రానికి గాని లేవలేకపోయింది. లేచిచూస్తే కడుపులో వికారంగా వుంది. గతరాత్రిని తలుచుకోగానే ఏడుపు ముంచుకొచ్చింది. 'ఎలా జరిగిందిది? ఎందుకు జరిగింది ఇలా? ఇలా జరగడానికి కారణమేమిటి? తానెక్కడ తప్పుచేసింది. విధి తనతో ఇంతక్రూరంగా ఎందుకు ఆడు కుంటోంది? తానుచేసిన నేరమేమిటి?'

ఆమె ఇలా ఆలోచిస్తూ వుండగానే గదంతా చీకటి అలుముకుంది.

అప్పుడే మేలుకున్నట్టు ఇంట్లో సందడి మొదలైంది. లైట్లు వెలిగాయి.

అప్పుడు అక్కవచ్చి తలుపు తట్టింది. ఎంతో ఆప్యాయత ఒలకబోస్తూ- "అమ్మా వరం... ఇంకా లేవలేదూ?" అభిమానం నటించింది.

అనవ్యాంగావున్నా తలుపుతీయక తప్పిందికాదు.

"అదేమిటి -ఇంకా అలానే కూర్చున్నావు!" చోద్యంగా అంది. అదో వింత అయినట్టు.

"ఒంట్లో అదోలా వుంది. కాస్త జ్వరంకూడా తగుల్తున్నట్టుగా వుంది"




"అలవాటులేని ప్రాణం. కొత్తకదా- ఒకటి రెండురోజులు ఇలాగే వుంటాదిలే! నెమ్మది నెమ్మదిగా అదే సర్దుకుంటుంది. ముఖంకడుక్కుని చీర మార్చుకుని అలా వరండాలో నలుగురి మధ్యా కూర్చో... సందడిగా వుంటుంది" ఇదో లెక్కలోది కాదన్నట్టు విసవిసలాడుతూ వెళ్ళిపోయింది అక్క.

కాని వరాలు లేవలేదు. అలానే కూర్చుండిపోయింది. లేవాలన్నా ఆమెలో సత్తువలేదు. కాలూచేయీ రావడంలేదు. కడుపులో ఆకలి గిరగిరలాడుతున్నది.

రాత్రి తొమ్మిదిగంటలైంది. అపుడే మగవానన ఇల్లంతా అలుముకున్నది. అగరొత్తుల వానన నాలుగుగోడలకూ తగిలి, తుళ్లి అన్నిగదులూ ఆక్రమించుకుంటున్నది. చీరల పరవరలు, పౌడర్లు, కారాకిళ్లీల ఘాటు, నాటుసారా కంపు ఇల్లంతటినీ కళకళలాడిన్తున్నది.

అప్పుడు వచ్చారు ఇద్దరు అమ్మాయిలు ఆ గదిలోకి. అందరి బుకింగులూ పూర్తయినాక ఆఖర్నగాని వారివంతురాదు. అందుచేత నగం రాత్రివరకూ వారు ఖాళీగానే వుంటారు. వచ్చి లైటువేసి వరాలును బుజ్జగించి మీదికి లేవనెత్తారు. మెల్లగా నడిపించుకుని బాత్రూం వైపు తీసుకువెళ్లారు.

అక్కడ కుండీ దగ్గర సబ్బుబిళ్ళతో ముఖం కడిగి, ఉన్నంతలో మేలిరకం పౌడరు ముఖానికి దట్టించి, ఒక మోస్తరు చీరకట్టించి, కొంచెం ముస్తాబులాంటిది అనిపించి తిరిగి ఆమెను గదిలోకి తీసుకువచ్చారు.

మధ్యలో "ఆకలేస్తోంది" అంది వరాలు.

"చపాతీ, కూర, బిరియానీ, మందుబాటిలూ నీగదిలోవుంటాయి. ఈవారం రోజులూ కంట్రాక్టుకదా- రాజభోగమే. నువ్వు మనను సరిపెట్టుకుని కోరుకోవాలేగాని" అంటూ ఒకర్తె కిసుక్కుననవ్వింది. రెండో ఆమె ముసిముసిగా నవ్వింది.

గదిలోకివచ్చిచూస్తే అప్పటికే గదిలో మందుతో కైపెక్కిన ఆ ఇద్దరు మార్వాడీ రసికసామ్రాట్టులున్నారు.

అంతే! కరెంటుషాకుతిన్నట్టు మెరుపువేగంతో బయటికి పరుగెత్తింది. లావా వెన్నాడుతున్నట్టు, భూకంపంలో ఆశ్రయంకోసం పరుగులుతీసినట్టు, మృత్యువు తరుముతున్నట్టు, సింహాలు వెన్నాడినట్టు ప్రాణభీతితో పరుగెత్తింది.

పరుగేపరుగు... ఒకటేపరుగు! వాయుమనోవేగాలతో పరుగెత్తింది. కాళ్లు చక్రాల్లా కదుల్తున్నాయి, గుండె రైలింజనులా కొట్టుకుంటోంది. మనను శాంతికోనం ఆక్రోశిస్తోంది, భవిష్యత్తుకోనం ఆరాటపడుతోంది, భద్రతకోనం వెతుకులాడుతోంది.

అలా పరుగెత్తుకుంటూ వెళ్లి ప్రతిగదిదగ్గరాఆగి తలుపులు అదేపనిగా బాదింది. ప్రతి గదిముందూ ఆర్తనాదంచేసింది. అరిచి గోలపెట్టింది. పేగులు తెగేలా రక్తగానంచేసింది. నరాలుతెంపి బాధల వీణమీటింది. దీనంగా... కడుదీనంగా ప్రార్థించింది.

"అక్కలారా... నన్ను రక్షించండి. అమ్మల్లారా... నన్ను కాపాడండి. మీ తోడబుట్టిన చెల్లెల్లాంటిదాన్నినేను. నేనింకా పువ్వునుకూడాకాను మొగ్గనే- వికశించనేలేదు. రెమ్మలుకూడా విప్పుకోలేదు. నన్ను నలిపేస్తున్నారు వీరు. చిదిమేస్తున్నారు వీరు. చంపేస్తున్నారు వీరు. చెప్పండి... మీ తోబుట్టువు నాలాగే చచ్చిపోతే వూరుకుంటారా? ఈ అన్యాయాన్ని సహిస్తారా? ఈ అక్రమాన్ని ఆమోదిస్తారా? మీ జీవితాలు ఎలాగూ నాశనమైపోయాయి, ఈ పాపకూపంలో బలైపోయాయి. కనీసం నన్నయినా కాపాడలేరా! నా ఒక్కర్తికోసం ఆమాత్రం ధైర్యంతెచ్చుకోలేరా! తల్లుల్లారా... నన్ను ఈ మంటల్లో శలభమై మాడిపొమ్మంటారా?

పుట్టాను...పెరిగాను. తండ్రి తెలీదు, తల్లీ తెలీదు. అమ్మమ్మ రెక్కలచాటున గువ్వలా ఎదిగాను. నాకెందుకీ నరకం? నాకెందుకీ ఉరి. నాకెందుకీశిక్ష? నన్నేమైపొమ్మంటారు. మీ పాదాలచెంత రక్తం కక్కుకుంటూ చచ్చిపొమంటారా?"

అలా ఆమె వలవలా ఏడ్చింది. కన్నీటి కడలి ఘోషగా హృదయవిదారకంగా ఏడ్చింది. కానీ ఏఒక్క జాలిగుండె కరగలేదు. ఏఒక్క స్త్రీ హృదయం కదలలేదు. అవి అంతగా బండబారిపోయియున్నాయి.

అన్ని గదులూ తలుపులు మూసి, గొళ్లేలు పెట్టి ఉన్నాయి. లోపల గాజులు పగులుతు

న్నాయి. గ్లాసులు ఖాళీఅవుతున్నాయి. రవికలు చిరుగుతున్నాయి. నవ్వులు పగలబడుతున్నాయి. నోట్లు కరకరలాడుతున్నాయి.

అన్ని గదుల తలుపులుతట్టడం అయిపోయిన తర్వాత, ఏగదీ ఖాళీగా లేదని తెలుసుకున్నమీదట, అన్ని గదులూ విటులతో కిటకిటలాడుతున్నాయని తెలుసుకున్న పిమ్మట ఆమె ఆశవదులుకుంది. పట్టుచాలించేసింది. ఇక లొంగిపోక తప్పదనుకుంది. ఇక ఆ నరకంలోకి, ఊబిలోకి అడుగెయ్యక తప్పదనుకుంది.

అప్పుడు చివర్ని ఒక మూల లెట్రిన్స్ కవతలసందులో ఒక ఇరుక్కొట్టులాంటిది కనిపించింది. ఆ కొట్టు ఒక మనిషి కూర్చోడానికి మాత్రమే చాలినంత చిన్నది. అందులో విరిగిపోయి పనికిరాని సామానులు పడేసి ఉన్నాయి. చెత్తాచెదారంతో నిండి ఉంది.

ఆ గది కంపుగా, చీకటిగా ఉంది.

ఆ గదిలో ఒక మూల సర్దుకుని ఆమె ఒదిగికూర్చుంది. చీకట్లో తడుముకుంటూ గట్టిగాగెడపెట్టింది. ఒకటేవాసన. కుళ్ళువాసన; గబ్బు వాసన భరించలేనంత దారుణంగా ఉంది.

అప్పుడు ఆమె ఊపిరి పీల్చుకోసాగింది. నసాళానికంటి ఆ ఘాటువాసనను భరిస్తూ ఆయాసం తీర్చుకోసాగింది. ఉచ్ఛ్వాసనిశ్వాసాలు తీవ్రంగా గుండెల్ని నెట్టుకుని ఎగసెగసిపడుతున్నాయి. కళ్ళుమండి కన్నీరు ఆవిరౌతోంది. రక్తం కరిగి నీరై కళ్లనుంచి ఉబుకుతోంది. గుండెల్లో ఒకటే ఆక్రోశం. ఒకటే ఆక్రందన. "ఎందుకు కన్నావమ్మానన్ను. కని నువ్వేమైపోయావమ్మా?"

ఒక్క పదినిమిషాలు భయంకరమైన నిశ్శబ్దంలో గడిచిపోయింది.

ఈ పదినిమిషాల్లో ఆమె ఆవేదన అణచుకుంది. మనసుదిటవు చేసుకుంది. 'ఈరోజుకు ఫర్వాలేదు. రేపు సందు చూసుకుని తప్పించుకోవాలి'

అనుకుంది- అంతలో...!

రెండు చేతులు మొదట మెల్లగా, తర్వాత గట్టిగా తలుపుమీద సవ్వడి చేశాయి. ఆ తర్వాత ఇంకా గట్టిగా ధన్‌ధన్‌మని నమ్మెటదెబ్బల్లా మోగాయి.

ఆమె గతుక్కుమంది. అయినా తన భ్రమగాని ఇది వారి ఇల్లు. వారికి తెలీని స్థలం ఇక్కడేముంటుంది అనుకుంటూ గుండె బిగపట్టుకుంది.

అయితే అవేం తలుపులో, అదేంగెడో రెండుసార్లు గట్టిగా తన్నేసరికి గెడవిరిగిపోయి ఒక్కసారిగా తెరుచుకున్నాయి. విసురుగా తోసివేస్తూ ఇద్దరులోనికి ప్రవేశించారు. ఆ ఇద్దరూ ఆమెను నిన్నవిందుకు తీసుకువెళ్లినవారే.

"ఎందుకు గొడవచేస్తావు బేబీ మంచిపిల్లవు కదా. వచ్చేయమ్మా, తొందరగా, పదినిమిషాలు ఆలస్యమైతే వాళ్లకొకరౌండు తగ్గిపోతుంది" అంటూ నెమ్మదిగా బుజ్జగిస్తున్నట్టు భుజం మీద చేయివేసాడు దారిలో ఒకడు ఆ చెయ్యి ఆమెకు పాముకుబుసంలా అనిపించింది. జడుస్తుకున్నట్టయి ఆ చేతిని విసురుగా తోసివేసింది.

"ఇదిలా లొంగదురా, పల్లెటూరుదికదా. గడుసుపిండం మామూలు కార్యక్రమం ప్రారంభించాలి. అప్పుడుగాని దారికిరాదు" అంటూ ఇంకొకడు విసురుగా చెయ్యెత్తి బలంగా చెంపమీద కొట్టాడు. గొడ్డలి వేటులా బలంగా తగిలింది ఆ దెబ్బ. ముక్కునుంచి రక్తం కారింది. సమస్త ప్రపంచంగిర్రున తిరిగినట్టయింది.

ఈసారి మరొకడు. రెండో చెంప. ఇప్పుడు రక్తం నోటి నుంచి.

అసలే ఆకలితీవ్రత. ఆపైన ఒళ్లు హూనమైపోయిన నిస్సత్తువ. ఒక్కసారికళ్లు గిర్రున తిరిగి పట్టుచాలించేసి కుప్పకూలిపోయింది.

ఒక్కపదినిమిషాలు ఆగి గోనెనంచిని ఎత్తినంత సులువుగా మోసుకెళ్లి ఆమె గదిలోని మంచం మీద విసిరేసినట్టు ఎత్తికుదేసి వెళ్లిపోయారు.

ఆ ఇద్దరు రసికమహరాజులూ ఒకేసారి ఆమె మీదకులంఘించారు.

ఆ మరునటి రోజు తెలతెలవారుతుండగా ఆ రసికశిఖామణులు ఇద్దరూ పరుల కంటపడకుండా వెళ్లిపోయారు. చెరుకు అంతా తినేసిపిప్పి వదిలినట్టు ఆమెను అక్కడ విడిచిపెట్టారు. ఆమె నిద్రమత్తులో




నిస్సత్తువుగా తెలివివచ్చేవరకూ అలానే వుంది.

భళ్ళున తెల్లవారింది. సూర్యోదయమయ్యేన రికి, సొమ్మసిల్లిపోయేవారూ. సోలిపోయేవారూ, నిద్రమత్తులో జారిపోతున్నవారితో ఆ ఇల్లు క్షతగాత్రులతో నిండిన యుద్ధభూమిలా వుంది. యుద్ధంలో పురుషవీరుల చేత ఓడించబడ్డ నారీపరాజితలుగా రక్తసిక్తమై పోయి చెల్లాచెదురుగా పడివున్నారు.,

ఆ ఇల్లు ఆ సమయాననిశ్శబ్దంగా, ప్రశాంతంగా వుంది. అప్పుడు సిగ్గుతో, ఎర్రబడిన ముఖంతో సూర్యుడు వారి మధ్య నుంచి ఎర్రెర్రగా కందిపోతూ మీదిమీదికి లేస్తున్నాడు. కిరణస్పర్శతో వారిని మృదువుగా తాకి మేల్కొల్పుతున్నాడు.

పదిగంటలైంది. ముఖంమీద వడ్డ నీటితడికి, చల్లదనానికి వరాలుకు తెలివి వచ్చింది. కళ్ళు తెరిచి చూస్తే ఎదురుగా చీరలు చుట్టుకున్నరెండు అస్థిపంజరాలు. నిన్న సాయంత్రం తనను తీసుకువెళ్లిన వారే. తమ జీవితంలో యిలాంటి కేసులెన్నోచూసినట్టు చాలా నిర్లిప్తంగా వున్నారు వారు. వారి ముఖాల్లో ఎలాంటి భావసంచలనం కనబడటంలేదు. అసలు ఏ కళ కూడా వున్నట్టులేధు.

వారిద్దరూ ఆసరాగా వరాలును లేవదీసి నెమ్మదిగా నడిపించుకుంటూ నూతిదగ్గరకు తీసుకువెళ్లారు. అక్కడ పళ్ళుతోముకునే పుల్ల యిచ్చి ముఖం కడిగించారు. బట్టలు విప్ప తీసి శుభ్రంగా ఒళ్లుతోమి స్నానం చేయించారు. తువ్వాలుతో ఒళ్లు తుడిచి చీరచుట్టబెడుతున్నప్పుడు చూసింది. వరాలు - లెట్రిన్లు శుభ్రపరచడానికి వీధిలో నుంచి మనిషిరావడానికి చిన్నదారి ఉందని దారి చిన్నదే అయినా వీధి చివరి వరకూ వుంది.

చుట్టూ చూసింది. ఎవరిగదుల్లోవారు దూరిపోయి, టిఫిన్లు చేసి, టీ తాగుతున్నారు అక్కరాచకీయాలు చక్కబెట్టడానికి ఎటో వెళ్లింది. ఇంట్లో సందడి ఏమీలేదు.

అంతే! ఇద్దర్నీ రెండు చేతుల్తోనూ చెరో పక్కఒక్కతోపు తోసింది. ఇద్దరూ పరాగ్గా వున్నారేమో దబ్బునపడిపోయారు. అసలే కొనసున్న ప్రాణాలు వారివి:

ఆ సందుగుండా వరాలు ఒకటే పరుగుతీసింది. కింద విసిరేసిన చెత్తకుప్పలు, కుళ్లిన కాయగూరలున్నాయి. అరటి తొక్కలున్నాయి. వాటి చుట్టూ మూగిన ఈగలున్నాయి. దోమలున్నాయి. వాటిని కెలుకుతూ కుక్కలున్నాయి. పందులున్నాయి.

అయినా వరాలువాటినేమీ చూడలేదు. లెక్కచెయ్యలేదు. పరుగెత్తింది, అలా పరుగెత్తడంలో కాళ్లకింద గాజుపెంకులు విరిగిపోయాయి. సీసాముక్కలు గుచ్చుకున్నాయి.

కాళ్లు రెండూ చీరుకుపోయాయి. సందుపొడుగునా నెత్తుటి దారి ఏర్పడింది. రక్తపు చుక్కలు ముగ్గులేశాయి. అయిపోయింది. సందుఅయిపోయింది. ఇక రోడ్డు వచ్చేస్తుంది. తాను జనంలో కలిసిపోతుంది. దారి వెతుక్కుని బస్సెక్కి తన వూరు వెళ్లిపోవడమే. అదిగో రోడ్డు, అరుగో జనం. కాని కాని

అమ్మో, మరోసారి భూమి బ్రద్దలైంది. రెండు కాళ్లూ చాపి రెండు చేతులూ చాపి రెండుగోడల్నీ పట్టుకొని ఒకరి వెనక ఒకరు ఇద్దరు గుండాలు.

అంతే!

వారిచేతికి ఆమె చిక్కిపోయింది.

గూటిలో పక్షిపిల్ల రాకాశికి అందిపోయినట్టు వారి పట్టులో ఇరుక్కుపోయింది. ఒదిగిపోయింది. వాలిపోయింది.

వారామెను, ఈడ్చుకువెళ్లి గదిలో విసిరేశారు. గది తలుపులు మూసి గడియపెట్టారు. లైటువేసారు. ఒకడి చేతిలో బెల్టు వుంది. చైను వుంది. రెండూ గాల్లో రింగులు తిరుగుతున్నాయి. మరోడి చేతిలో ఇనుపరాడ్ వుంది. రూళ్లకర్ర వుంది. ఆ రెండూ గాల్లో సాముతిరుగుతున్నాయి.

అప్పుడు అక్కడ ఒక్క పదిహేను నిమిషాల పాటు నరమేధం జరిగిపోయింది. ఒక ఆడదాన్ని అమాయకురాల్ని చేసి ఇద్దరు మగాళ్లు మృగయా వినోదం అనుభవించారు. అక్కడ న్యాయం సమాధిచేయబడింది. నీతి కాల్చబడింది. ఆడదాని శీలమర్యాదలకు దహన సంస్కారాలు చేయబడ్డాయి. ఘనతవహించిన భారతీయ స్త్రీత్వం పాతిపెట్టబడింది.



పదిహేను నిమిషాలతర్వాత ఆమె శిరస్సు చిట్లింది. నుదురు కన్నంపడిపోయింది. ముక్కు కదిలిపోయింది. నోరు పగిలిపోయింది. చీర ముక్కలుముక్కలుగా పీలికలైపోయింది. జాకెట్టు చిరిగిపోయంది. ఒంటిచర్మం చిట్లిపోయింది. శరీరమంతా రక్తం ధారకట్టింది. నేల మీద రక్తం మడుగుకట్టింది. ఆ రక్తంమడుగులో ఆమె ఎర్రకలువలా మెరస్తూ రెమ్మలు ముడుచుకుపోయి పడివుంది.

ఆతర్వాత వాళ్లు సూదులు తీసారు. కాళ్ళకూచేతులకూ, ఇరవైవేళ్లకూ గోళ్లకిందా సూదులు గుచ్చారు. ఇంత అపస్మారకదశలోనూ ఆమె 'అమ్మో' అని అరిచింది. బిగ్గరగాఅరిచింది. నాలుగుగోడలూ బద్దలయ్యేలా అరిచింది. వీధి వీధంతా వినిపించేలా అరిచింది. బాధతో కొంకర్లుతిరిగిపోయింది. నొప్పితో మెలికలుతిరిగిపోయింది. ప్రాణాలు గాలిలో కలిసిపోతున్నట్టు ఏడ్చింది.

అప్పుడు కారంపాకెట్టు విప్పి అన్నిగాయాలమీదా కారంగుండ వొత్తుగా కుక్కారు.

ఆమె చావుకేకపెట్టింది. ప్రాణభీతితో విలవిల్లాడిపోయింది. పెడబొబ్బలుపెట్టి గింజుకుంది. ఆఖర్ని తెలివితప్పి కట్టెలా నేలను కరుచుకుపోయింది.

అలా ఎంతసేపు జరిగిందో తెలీదు. తెలివి వచ్చేసరికి పైన బల్బు ఎర్రగా మండిపోతోంది. నేలంతా ఎర్రగా రక్తంతో తడితడిగావుంది. ఒళ్లంతా పచ్చిపుండులా నొప్పులు నొప్పులుగా వుంది. ఒంటిమీద నూలుపోగుకూడా లేదు. తొడలు రక్తపు సముద్రాలావున్నాయి. వక్షం ముద్దకింద ఎర్రగా కందిపోయివుంది.

ఇరువక్కల అలిసిపోయిన ఇద్దరు మదోన్మత్తులు నిద్రపోతున్నారు. ఇల్లంతా తక్కువ వెల్తురుతో తక్కువసందడిగా వుంది.

వరాలుకు దుఃఖం ఆగమన్నా ఆగడంలేదు. మూడురోజులనుంచీ తిండిలేదు. పచ్చి మంచినీరుకూడా లేదు. ఆమెపరిస్థితి ఆమెకు వెగటుగా జుగుప్సగా తోచింది. ఇక ఇక్కడ నుంచి తప్పించుకువెళ్లడం సాధ్యంకాదని తెలిసిపోయింది.

అలా తెలిసిపోయినతర్వాత, ఆ మురికికూపంలోనే జీవిస్తూ మరొక్కక్షణం కూడా బతకాలన్నకోరిక ఆమెలో లేదు. ఆశచచ్చిపోయింది. ఇక్కడ ప్రతిక్షణం చచ్చిపోతూ చావులాంటి బతుకు బతికేకంటే నిజంగా చచ్చిపోవడమే మేలనుకుంది. తాను నిత్యం చచ్చి యజమానురాల్ని బతికించేకంటే, యజమానురాలికి నష్టంవచ్చేవిధంగా తానొక్కసారి చచ్చిపోవడమే మంచిదనుకుంది.

చుట్టూ చూసింది. ఎక్కడా మనిషిఅలికిడి లేదు, ఎవ్వరూ తెలివిగావున్న ఛాయలులేవు. అందరూ నిద్రమత్తులోవున్నట్టున్నారు. విటులు మందుమత్తులో మగువమైకంలో మునిగితేలి నిద్రజడిలోవున్నట్టున్నారు.

ఇదే అదను సమయం మించిపోతే అందరకూ మెలుకువవచ్చేస్తుంది. మరో రౌండుకు రంగం సిద్ధమైపోతుంది అనుకుంది. అనుకున్నదే తడవుగా మెల్లగా జోగారుకుంటూ పాకింది. కాళ్లు కట్టేసినట్టున్నాయి. చేతులు విరిచేసినట్టున్నాయి. అయినా తప్పదు. పూర్తిగా తెగించేసింది. బతుకుమీద విరక్తిపుట్టింది.

అలా పాకుకుంటూవచ్చి మెల్లగాలేచి, నగంవరకూ చేతులెత్తి శబ్దంరాకుండా నెమ్మదిగా గడియతప్పించింది. తలుపుతెరిచి మరోసారి చూసి ఏ అలికిడీలేదని నిర్ధారించుకున్న పిమ్మట అలా పాకుతూ నెమ్మది నెమ్మదిగా నూతిదగ్గరకు చేరుకుంది. కాని అక్కడ నడుం ఎత్తలేకపోయింది. మనిషి లేవలేకపోయింది.

అక్కడ అయిదునిమిషాలపాటు అలానే వుండిపోయింది. ఈలోగా కొంతఆయాసం తగ్గింది. ఊపిరితీసుకుంది. ధైర్యంచిక్కబట్టుకుంది. తెగించి చొరవతెచ్చుకుంది. రెండుచేతులు గట్టుమీదవేసి బలంగా గట్టువట్టుకుంది.

ఒక్కొక్కగదిలో దీపంవత్తి పెద్దదిచేయబడుతూవుంది. గాజులు గలగలమంటున్నాయి. విటులచేతులు కదలుతున్నాయి. మరోసారి ఆ గదుల్లో రసికత నాట్యమాడబోతోంది. శృంగారం గజ్జకట్టబోతోంది.

ఇక లాభంలేదు- సమయంమించిపోతే ఈ అవకాశంకూడా చేయిజారిపోతుంది. ఆమెలో ఏనుగుబలం ప్రవేశించింది. అవే చేతులతో గట్టు గట్టిగాపట్టుకుని నడుంసాయంతో కాళ్లు రెండు గట్టుమీదికి అంచెలంచెలుగా తీసుకు




చమత్కార ప్రపంచం

# ఆమె ప్రతిభ



సంగీతం, నాట్యం, కవిత్వం, చిత్రలేఖనం వంటి చతుష్షష్టికళల్లో నైపుణ్యం పొందటం వరం అంటారు. కళల్లో నిష్ణాతులవటానికి ఏ అంగవైకల్యమూ అడ్డురాదు. అడ్డువచ్చినా మనోస్థైర్యం ముందు అవి వెలవెలబోక తప్పదు. అలాంటి చిత్తస్థైర్యంతో కళను కైవసం చేసుకున్న కళాకారులెందరో ఉన్నారు. అలాంటి వారిలో కర్నాటకకు చెందిన రమాదేవి ఒకరు.

రమాదేవిని పుట్టుకతోనే మూగతనం దెబ్బ తీసినా, చెవిటితనం ప్రభావం చూపినా ఆమెలోని కళాకారిణికివి అడ్డుగా నిలువలేకపోయాయి.

రమ నృత్యం నేర్చుకోవటం కూడా యాధృచ్ఛికంగానే జరిగింది. రమ అక్కలిద్దరూ డి.యస్. కామత్ అనే నాట్యాచార్యుని వద్దకు నాట్యాభ్యాసం కోసం వెళ్ళేవారు. క్లాసు నుంచి ఇంటికొచ్చాక వాళ్ళు ఇంట్లో ప్రాక్టీసు చేసుకుంటూ ఉంటే రమ నిశ్శబ్దంగా వారి నాట్యప్రక్రియల్ని సునిశితంగా పరిశీలించేది. ఆమెలోని కుతూహలాన్ని చూసి ఇరుగుపొరుగువారు రమని కూడా నాట్యాభ్యాసానికి పంపించమని ప్రోత్సహించారామె తల్లిదండ్రులను. కాని నోటమాటయినా రాని తమ తనయకు నృత్యం నేర్పమని అడగటానికి ఆమె తల్లిదండ్రులు మొహమాట పడ్డారు. అయినా ధైర్యంచేసి అక్కలతో కూడా వెళ్ళి దూరంగా కూర్చుని మౌనంగా నృత్యమెళుకువలని గమనించమని మిగతా ఇద్దరు కూతుళ్లతో పంపించారు రమని. మౌనంగా చూస్తూ కూర్చున్న రమలోని జిజ్ఞాసనీ, తపననీ, తెలివితేటల్నీ గుర్తించాడు గురువు కామత్- ఆమెకి విని పించకపోయినా, నోటమాట రాకపోయినా ఆమెకి నృత్యం నేర్పటం ఒక ఛాలెంజిగా స్వీకరించాడాయన. వికలాంగులే ఎంతో తెలివిగలవారనీ, సమర్థవంతులనీ, వారికి నేర్పడానికి కాస్త ఓర్పు చూపాలనీ కామత్ అభిప్రాయం. నిజానికి తొలిరోజుల్లో రమకి నృత్యం నేర్పేటప్పుడు చాలా కష్టపడినా నెమ్మదిగా రమ ఎంతో చురుగ్గా అవగాహన చేసుకుని నాట్యంలోని మెళుకువల్ని అవగతం చేసుకుందంటాడాయన.

రమ కర్నాటకలోని 'కుమటా' నుంచి తమిళనాడులోని సేలం వరకు పర్యటించి ఎన్నో ప్రదర్శనలిచ్చింది. ప్రజల నుంచి, పత్రికల నుంచి ప్రశంసలు ఆమెపై కురిశాయి. రంగస్థలంపై నిల్చున్నప్పుడు తాళం వేసే గురువు కదలికల్ని కళ్లతోనే చూస్తూ పొరబాట్లకు తావివ్వకుండా అత్యంత మనోహరంగా నర్తిస్తుంది రమాదేవి. అన్ని వాయిద్యాలు సహకరిస్తుంటాయి ఆమె నాట్యానికి. ఆ వాయిద్యాల హోరు ఆమెకి వినిపించకపోయినా ప్రేక్షకుల కోసం ఇవి ఏర్పాటు చేస్తారు.

కర్నాటకలోని డెఫ్ అండ్ డంబ్ స్కూలు నుంచి రమాదేవి ఎలక్ట్రానిక్స్‌లో డిప్లొమా తీసుకుంది. తర్వాత భారత్ ఎలక్ట్రానిక్స్ లిమిటెడ్‌లో అప్రెంటిస్‌గా చేరింది. ఆమె రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించే పరీక్షల్లో కూడా విజయం సాధించి బెంగుళూర్‌లోని డెఫ్ టెక్నికల్ ట్రెయినింగ్ స్కూల్లో ఎలక్ట్రానిక్స్ లెక్చరర్‌గా పనిచేస్తున్నది.

రమకి ఆటపాటల్లోనూ ప్రావీణ్యత ఉంది. టేబుల్ టెన్నిస్, షటిల్, బాడ్మింటన్, డిస్కత్రో, షాట్‌పుట్‌లలో ఆమెకి మంచి నేర్పు ఉంది. ఆమె ఇంట్లో బంగారు, వెండి, కాంస్య పతకాలు ఆమెని వరించి వచ్చినవి అనేకం దర్శనమిస్తాయి.

వికలాంగులు సమాజానికి భారం కారు. వారిలోని ప్రతిభను గుర్తించి ప్రోత్సహిస్తే సాధారణ పౌరులకంటే తెలివైనవారమని నిరూపించుకుంటారని రమాదేవి రుజువు చేసింది. ★

వచ్చింది. తర్వాత నెమ్మదిగా నడుం గట్టుమీదకుచేర్చింది.

ఒక్క నిమిషం... ఒక్కటంటే ఒక్కనిమిషం-గట్టుమీద రిలాక్సులా పడుకుంది. ప్రపంచంలోవున్న గాలంతా ముక్కుద్వారా, నోటిద్వారా హాయిగా పీల్చింది. తర్వాత అవతలిపక్కకు మెల్లగా జారింది. అప్పటికేచేతులు పీకుతున్నాయి. నొప్పెట్టుకుపోతున్నాయి. బలం కోల్పోతున్నాయి. ఇక సత్తువలేనట్టుచేతులు వదిలేసింది.

అంతే! నూతిలో ఒక పెద్ద కొండపడినట్టు శబ్దమైంది. అన్నిగదుల్లోనూ లైట్లు వెలిగాయి.



వరాలు కళ్లు తెరిచేసరికి చుట్టూ అందరూ మూగివున్నారు. అందరిముఖాల్లోనూ ఇంతకుముందులా నిర్లిప్తతకాక, ఆమెపట్ల విచారం వ్యక్తమౌతోంది. అక్కడున్న వారందరూ ఇలాంటి సంఘటనలను అంతో ఇంతో చూసినవారే. అయితే ఇంత వెంటవెంటనేకాదు. వరాలు రోజు తర్వాత రోజు సర్దుకుపోతుందని వుదాసీనంగా వూరుకున్నారు. ఇంతలా ముదిరిపోతుందనుకోలేదు.

వరాలు చేత నీరుకక్కించారు. పడిన వెంటనే తీయడంవలన ఎక్కువ నీరుపోలేదు. తర్వాత నాలుగు బొగ్గుపొయ్యిలు రాజేసి ఒళ్లంతా వేడిచేశారు. వేడివేడి టీ తాగించారు. మనస్ఫూర్తిగా ఆ చిన్నపిల్లకు అందరూ సపర్యలు చేశారు.

మూడురోజుల తర్వాత కడుపులోకి వేడివేడి టీ పడటంతో వరాలుకు ప్రాణం లేచి వచ్చినట్టయింది. తొందరగానే వరాలు కోలుకుంది.





అయినా ఆమెకు బతకాలని లేదు. బతుకులో తీపిచచ్చిపోయింది. తేనెదినాలు వెళ్లిపోయాయనిపిస్తోంది. ఆ దినాలు తనను అంటకుండానే, తాకకుండానే పారిపోయాయనిపిస్తోంది.

అక్కమాత్రం రుసరుసలాడింది. పదివేలు పెట్టుబడిపెట్టాను. నాలుగువేలే వసూలయ్యాయి. ఆరువేలు నష్టపోయాను. ఖర్చులు సరేసరి. ముదనష్టపు ముండదొరికింది. అదృష్టంబాగుంది. లేకపోతే పోలీసుకేసులో ఇరుక్కుపోయివుండేదాన్ని.

అక్కడ అందరూ ఎంతో ఓపికగా వరాలుకు నచ్చచెప్పారు. తమతమ కథల్ని విప్పిచెప్పారు. ''చచ్చిపోవాలన్నా నువ్వు చచ్చిపోలేవు, చావుకూడా నీ చేతిలో లేదు వారికి నష్టం వచ్చేవిధంగా నిన్ను చావనివ్వరు. పారిపోదామన్నా ఎంతో దూరం పోలేవు. వెయ్యికళ్లతో గాలించి ఎక్కడికక్కడ వలలువేసి వెతికి వెతికి నిన్ను పట్టి తీసుకువస్తారు. సినిమాలకు వెళ్లి ఆటజరుగుతుండగా పారిపోలేవు. లాడ్జీలకు వెళ్లి విటులసాయంతో తప్పించుకోలేవు. పోలీసుల సాయంకూడా నీకు వుండదు. పైగా వారు నిన్ను వాడుకుంటారు. అవకాశం సద్వినియోగం చేసుకుంటారు.

''నువ్వు ఏమీ చేయలేవు. నీచేతిలో ఏమీలేదు. నీవనుకుంటున్న ఆ కాలూచేతులూ నీవికావు, నీకు ఉపయోగపడవు. కాని వారికి లాభాలు తెచ్చిపెడతాయి. అందమైన నీ అవయవాలు వారికి ముల్లెను మూటకట్టియిస్తాయి. అందరికీ నువ్వొక వినోదవస్తువు, విలాసవస్తువు, విరామవస్తువు, వినిమయవస్తువు. నీకు నువేమీకావు.

మాలో కాలేజీవరకూ చదువుకున్న వారున్నారు. ఉద్యోగాలు చేసిమానేసినవారున్నారు. అన్నిమతాలవారు, అన్నిభాషలవారు, అన్నికులాలవారున్నారు. స్త్రీ బతుకు ముక్కలు చేయడాన్ని ఏమతం అడ్డుకోదు. స్త్రీ జీవితం నాశనం కాకుండా ఏ కులం ముందుకు వచ్చి కాపాడలేదు. అన్ని కులాలూ, అన్ని మతాలూ డబ్బున్న వాడికొలువులో కావలికుక్కలు. పురుషాధిక్యతకు ఆడది ఒక అమాయకమైన చిహ్నం. రక్తమాంసాలువున్న జున్ను ముక్క. ఆమె నాశనాన్ని ఏమతం, కులం నిలవరించలేదు. స్త్రీని అనుభవించడంతో, నిర్దాక్షిణ్యంగా

విసిరివేయడంతో అన్నిమతాలూ, అన్నికులాలూ, అన్ని భాషాసంస్కృతులూ, అన్ని ప్రాంతీయ రుగ్మతలూ ఒకేలా పనిచేస్తాయి.

అటు చూడు... ఆమె పేరు రాధ. ఆమె బతుకులో తీపిలేదు. చేదుమాత్రమే మిగిలింది. ఎదుగుతున్న వయసులో, కోర్కెలు మొగ్గతొడుగుతున్న సమయాన పక్కింటి పిన్నిగారి తమ్ముడు కథలు చెప్పి సినిమాలు చూపించి, శరీరాన్ని తడిమి ఆశలు రేపి అందంకొల్లగొట్టాడు. ఫలితం ఆ పాన్పు ఇక్కడ పరుచుకునివుంది శాశ్వతంగా.

ఆమె హసీనా. ఆడుతున్నప్రాయంలో దొంగిలించుకొచ్చారు. ఆశలపాలను విరిచేసి, అనుభవాల రసగుల్లాను చేసి అందరికీ విందుభోజనంగా మార్చారు. మొగ్గలోనే ఆమె కాలిపోయింది. నాట్యం వచ్చు. సంగీతం వచ్చు. సాహిత్యం వచ్చు. అవన్ని విటుల పొందుకు మాత్రమే ఉపయోగపడుతున్నాయి. ఆమె తనవారిని కూడా ఇప్పుడు మరిచిపోయింది.

ఈమె రీటా... స్వేచ్ఛాప్రియత్వం ఈమెను దారి తప్పించింది. వింటూన్న సంగీతం, చూసిన సినిమాలు వయసుని రెచ్చగొట్టాయి. ప్రియుడికి లేలేత యవ్వనం పట్టుపాన్పుగా పరిచింది. వాడుకున్నంతవరకూ వాడుకుని గిరాకీ తగిలాక ఈ పశువులకొట్టుకు అమ్మేసి చేతులు దులుపుకుని చక్కావెళ్లిపోయాడు. ఇక్కడ ఈమె ఆంగ్లోయిండియన్ గర్ల్‌కింద చలామణీ అవుతోంది. ఇంగ్లీషు ధారాళంగా మాట్లాడగలగడం చేత ఖరీదైన విటుల దగ్గరకు పంపిస్తారు. రేటుకూడా ఎక్కువే.

ఈమె కమల. అరవిరిసిన కమలం. జీవితంలో ఇక పెళ్లికాకుండానే ముసలిదైపోతుందని భయపడి గంపెడు పిల్లలుగల ఒక ముసలి మూడో పెళ్లివాడికి కట్టబెట్టబోయారు. అప్పుడు వీరోచితంగా ఒక హీరో అడ్డునిలిచాడు. కలల్లో రంగుల హరివిల్లుచూపించాడు. ఊహల్లో స్వర్గసీమ నిలబెట్టాడు. ఆకాశం అంచులవరకూ మేఘాలమీద తీసుకువెళ్లాడు. అతని మాయమాటలకు మోహంతో కళ్లు మూసుకుపోయాయి. తెరిచిచూసేసరికి ఇక్కడ పక్కమీదవుంది. పక్కలో అతనులేడు, ఇంకొకడు వున్నాడు. ఇప్పుడీమె అందం, యవ్వనం ఏమీలేకుండా విటులకు కారుచౌకగా దొరికే ఒక వస్తువు''

ఆ కథలన్నీ వింటున్నప్పుడు వరాలుకు మతిపోయింది. అంతటివారికే లేదు దిక్కు. ఇక తానసగా ఎంత? - అనుకుంది. వారి సహచర్యంలో తానీ కష్టాల్ని మరిచిపోవచ్చును కుంది. తిరిగి ఆమెకు బతుకులో ఆశకల్గి కడుపుమీద తీపిపుట్టింది.

మధ్యాహ్నం ఆమెకు మంచి ఖరీదైన భోజనంపెట్టారు. ఆమె ఎన్నాళ్లు తర్వాతనో కడుపు నిండా తిన్నది. శరీరమంతా అలసిపోయి వుండటంచేత వెంటనే నిద్రపట్టేసింది.

సాయంత్రం అయిదయ్యేసరికి అందరూ మరోసారి వచ్చి వరాలును పలకరించి, పరామర్శచేసి టీ ఇచ్చారు. తర్వాత 'నాట్య' ప్రదర్శనకై వరండా మీద నిల్చోడానికి, విటుల్ని ఆకర్షించడానికి షోకేసుల్లో బొమ్మలైవెళ్లిపోయారు.

పది నిమిషాల తర్వాత కుదుటపడుతున్న వాతావరణాన్ని కలతచెందిస్తూ మళ్లీ తలుపులు తెరుచుకున్నాయి. మళ్లీ ఆ ఇద్దరూ రంగ ప్రవేశం చేశారు.

వస్తూనే ఒకడు వరాలు జుట్టుపట్టుకుని మీదికెత్తాడు. విసురుగా కిందికి ఈడ్చాడు "ఏమే నువ్వు చచ్చిపోతావా... చావాలని చూస్తున్నావా? చావుమీద అంతతీపిగా వుందా నీకు" బలంగా చెయ్యిఎత్తిపెట్టి చెంపమీద ఒక్క దెబ్బవేసాడు. మేఘం ఘర్జించింది. పిడుగుపడింది. చెంపఅదిరింది. గూబపగిలింది.

వెళ్లి ఎదురుగా వున్న గోడమీద పడిపోయింది. గోడమీద ఛెల్లున నెత్తురు చిమ్మింది. లేతరక్తం వెచ్చగా జారుతోంది.

ఈసారి రెండవవాడు ఆమె జుత్తు అందుకున్నాడు. అందుకుని గట్టిగా ఎత్తాడు. జుత్తు వూడిపోతున్నట్టు నొప్పిగా వుంది. ఒకటేమంట. "నీమీద పెట్టిన డబ్బు ఏ నీయమ్మరంకుమొగుడు తీరుస్తాడే" అంటూ రెండో చెంప అదరగొట్టాడు. ఈసారి ఉరుములు, మెరుపులతో ఆకాశం దద్దరిల్లినట్టయింది. ఆకాశం ముక్కలు ముక్కలుగా విరిగిపోయి సముద్రం మధ్యన కూలిపోయినట్టయింది.

ఈసారి ఇంకో గోడమీద పడింది. పసిరక్తం ఎర్రగా కారుతోంది.

ఒళ్ళు హూనమైపోయింది. చర్మం బీటలువే సింది. ఒంట్లో సత్తువ ఎక్కడా మిగిలినట్టులే దు. కాళ్లూచేతులూ వేలాడేసి స్పృహకోల్పోయి కుప్పకూలిపోయింది. వాళ్లు ఇనుపరాడ్ అందుకున్నారు.

"అమ్మో" అన్న ఒక్కకేకతో స్పృహ తప్పిపో యింది వరాలు. రెండు కాళ్లముడికెల ఎముక లూ పటేల్‌మని విరిగిపోయాయి. కాళ్లు రెండూ చచ్చుబడిపోయాయి. చీరరక్తంతో తడిసిపో యింది.

ఆఖరిగా ఒకడు రూళ్లకర్ర అంచుకు దట్టంగా కారం గుండదట్టించాడు. ఇంకొకడు చీరమీదికెత్తాడు. వెలుగులో ఆకారం గుండ రాంట్లు తిరుగుతూ చావుకోరల్లా మెరుస్తోంది. కత్తిపదునులా తళతళలాడుతోంది.

వరాలుకు చెమటలుపట్టాయి. చావుభ యంతో గుండె ఆగిపోయింది. ప్రాణభీతితో విలవిల్లాడిపోయింది. మంటల మధ్యమాడిపో తున్నట్లు కంపించింది.

పరమక్రూరంగా, అత్యంత నికృష్టంగా, అతి నిరంకుశంగా ఆ రాడ్డు 'కస్'మని దిగిపో యింది. ఆ భాగమంతా మంటతో భగభగలా డిపోయింది.

"అమ్మో" అన్న ఒక్కకేకతో వరాలు మూర్ఛ పోయింది. ఆ కేక, ఆ పెనుకేక ఆ చావుకేక ఇంట్లోవున్న అందరి జాలిగుండెల్నించీ దూసు కుపోయింది. కాని, అది వీధిని దాటలేదు, వూరును దాటలేదు, దేశాన్ని దాటలేదు, ఆ బాధామయ ఘోషతో ఆక్రందనతో, ఆక్రోశంతో ఆకాశం ఎర్రబడలేదు. కొండలు జేగురించుకు పోలేదు. అడవులు అవమానంతో తగలబడలే దు. సముద్రం కన్నీరుకార్చలేదు.

అలా మనిషిని అసహాయను చేసి, పారిపో లేని స్థితిలో వుంచి, అలాంటప్పుడు నోట్లునొల్లు కునేవారు. రెపరెపలాడే కరెన్సీ వారి బీరువాల్లో కి దూరేది.

ఇష్టంలేని ఈ పని జరిగిపోతున్నా చూస్తూ వూరుకోడం తప్పించి అభ్యంతరం చెప్పి ఎది రించలేని స్థితిలో మూగగా రోదించేది. కళ్లనీ రు నింపుకునేది. నోరుండి మూతపడిపో యింది. కళ్లుండిచూడలేక పోతుంది. కా ళ్లుండి సాయంలేందే నడవలేదు. చేతులుండి ఎదిరించలేదు.

ఈ విధంగా నాశనమైపోయిన బతుకు ధ్వంసమైపోయిన భవిష్యత్‌ను తలచుకుని తలచుకుని రాత్రీపగలూ ఏకధారగా ఏడ్చింది. కుళ్లి కుళ్లి ఏడ్చింది. ఒక్కోసారి ఫిట్స్ వచ్చిపడి పోయేది - నోటనుంచి చొంగలు కారేవి.

అందుకే ఇన్నాళ్లకు అవకాశం వస్తే ఇలా పోలీస్‌స్టేషన్‌కు పారిపోయొచ్చింది.

కొట్టికొట్టి బాగా అలిసిపోయాడేమో రొప్పు తూ, రోజుతూ నిస్సత్తువుగా కుర్చీలో కూలబడి పోయాడు సి.ఐ. సత్యారావు. ఉచ్ఛ్వాస నిశ్వా సాలు పాము శబ్దంచేస్తూ భయంకరంగా వెలు వడుతున్నాయి.

ఒక్క పదినిమిషాలు గుండెల్ని బిగపెట్టి నిశ్శబ్దం తరువాత, అలసిపోయిన మేను విశ్రాంతి పొందిన తర్వాత నెమ్మదిగా కళ్లు తెరిచి గదంతా ఒక్కసారిచూశాడు.

గదిలో ఒంటికంటి రాక్షసి ఆయువు క్షీ ణించిపోయింది. భయంతో అది మరి వెలగలే కపోయింది. ఆవహించిన చిక్కటి చీకటితో గదంతా పరమక్రూరంగా వుంది. గడ్డకట్టిన నిశ్శబ్దంతో కర్కశంగా వుంది. జరిగిన యదార్థా న్ని విప్పిచెప్పడానికి సిద్ధంగా బీభత్సంగా వుంది.

ఇహ లాభంలేదని స్విచ్‌నొక్కాడు. లైటువె లిగింది. ఆ వెలుగులో గది ఒక యుద్ధభూ మిలా కన్పించింది.

చుట్టూ కలియజూసాడు. ఎక్కడా మనిషిలే దు. ఏమైందోనని ముఖం కిందికిదించి చూస్తే - అక్కడ అచేతనంగానూ, కోమాలోకి వెళ్లిపో యినట్టూ, చిత్రకారుడి చిత్రంలో కదలలేని బొమ్మలానూ నిస్సహాయంగా పడి వుంది వరా లు.

ఒకనాడు సమస్త ప్రపంచానికీ పంచి ఇచ్చా మని చెప్పుకునే భారతీయ సంస్కృతీ సాంప్ర దాయాల వెలలేని అత్యున్నతవారసత్వపు వెల్లువ, పురాణాల్లోనూ, వేదాల్లోనూ ఉన్నతోన్న తంగా నిలబెట్టిన నారీ విలువ, ఆవేదాలకే రుధిరనైవేద్యం చేస్తోందన్నట్లుగా చలనర హితంగా పడివుంది వరాలు.

కట్టుకున్న చీర ముక్కలుముక్కలుగా చిరిగి పోయి వుంది. వేసుకున్న జాకెట్టు పేలికలు




పేలికలుగాచెదిరిపోయి వుంది. శరీరమంతా బెల్టు దెబ్బలకు దద్దుర్లెక్కిపోయి వుంది.

ఆమె అప్పుడు ఎర్రకలువలా వుందేగానీ వికశిస్తున్న కలువలా లేదు. సూర్యుడు కొట్టిన ఎండదెబ్బకి రెమ్మలు రాలిపోయి, ముకు ళించుకుపోయినట్టు వేలాడిపోయి వుంది.

ఆమెనలా చూసేసరికి సత్యారావుకి మతిపో యింది. ఇన్ని దెబ్బల మధ్య ఇంత హింసన డుమ ఆమె ఇంత అందంగా ఎలా వుండిపోగ లిగింది.

ఈమెను చూసిన అతని కంటికి ఆదిలక్ష్మి సర్వలక్ష్మి పెనుభూతాల్లా కన్పించారు. సెక్సు ఆకలితో మీదిమీదికి లంఘించి ఎగురుతున్న ఆడరాక్షసుల్లా కన్పించారు. వారిని చంపక పోతే తాము చావడం ఖాయం అన్నట్టు కన్పించారు.

సత్యారావుకు పూనకం వచ్చేసింది. వార్ని తనేం చేయలేడు, కనీసం ఈ పిల్లనైనా హింసించి, వారి మీద పగతీర్చుకోవాలనే ఆలో చన అతనికి తెలీకుండానే అతన్నావ హించింది. మరుక్షణం మనిషి బిర్రబిగుసుకు పోయాడు. కళ్లు చింతచిప్పల్లా మండుతు న్నాయి. తీవ్రఆవేశంతో వెర్రెత్తిపోతున్నాడు. తీక్షణంగా కళ్లు మూసుకుని చూసాడు చీకట్లోకి. ఆ కంటికి ఆ రెండు జంటలూ పులికొండ చిలువల్లా వాటేసుకుని, కాటేసుకుంటున్నట్టు కన్పించాయి. కిందామీదా పడి ఒక్కర్నొకరు ఓడించుకోబోతున్నట్టు కసికసిగా కన్పించాయి.

అంతే! అతను అతిభీకరంగా లేచాడు. చేతులు పులిపంజాలా విప్పాడు. ఆమె బట్ట లు పూర్తిగా లాగిపారేశాడు. ఆమె ఒక పారోప్లా స్టిక్ బొమ్మలా గిర్రున తిరిగింది.

పంజా దెబ్బతగిలినమేక కింద పడిపో యింది. పడిపోయిన మేక మీదికి ఆకలిగొన్న పులి ఆవేశంగా లంఘించింది.

ఓ అరగంటపాటు ఓపిక ఉన్నంతవరకూ పోర్లాక అప్పుడు శరీరం చల్లబడింది. మనసు శాంతించింది. ఆవేశం పూరడిపొందింది.

తర్వాత రైటర్, సెంట్రీ ఇద్దరూ వంతులు వారీగా ఆమెను పంచుకున్నారు.

ఆరోజు సత్యారావు తనుపడిన వేదన అంతా మరచి ఇపుడు ఎంతో హాయిగా వున్నాడు. జీవితంలో మరచిపోలేని ఒక గొప్ప ఆనందం అనుభవించిన తృప్తి దక్కింది- అందుకు ఎంతగానో సంతృప్తిచెందాడు.

ఆ తర్వాత అందుకు కారకుడైన దాసు వురఫ్ అప్పిగాణ్ని అభినందించాడు. పర్సు నుండి రెండు కొత్త వదులుతీసి వాడికి అందించాడు. "లాస్టేఛాన్సు - నువ్వు లాగించు" అన్నాడు. మరోసారి అయితే అలా అనకపోయేవాడు. కాని ఆ సందర్భం ఆయన కి నచ్చింది.

"ఇది నా పెళ్లామండీ, అలా చెప్పడానికి ఇప్పుడు నేను గర్వపడుతున్నానండీ! అయితే ఇది ఎన్నో పెళ్లామని అడిగితేమట్టుకు చెప్పలే నండి. అయినా కూడా ఇంతవరకు ఏ పెళ్లాం పక్కన కూడా పడుకోలేదండి. కాని దీనివక్కన పడుకోకపోతే ఇక ఈ జన్మవృధా అనిపించే స్తందండి. మీ అనుమతితో ఎల్తన్నానండి"

సి.ఐ. ప్రోత్సాహం వాడికి మరింత బలాన్ని వ్వగా ఉత్సాహంగా ముందుకు దూకాడు.

★ ★ ★

సరిగా పన్నెండు గంటలైంది.

కొత్త సంవత్సరానికి స్వాగతం పలుకుతూ రోడ్డుమీద ఒకటే అరుపులు, కేకలు, ఈలలు. ఎదురుపడ్డ మనుషులు ఒకర్నొకరు ఆలింగనం చేసుకుని నూతన సంవత్సర శుభాకాంక్షలు చెప్పుకుంటున్నారు. నేల ఈని నట్టు జనంతో ఒకే నందడి.

"ఛీ... లంజాకొడుకుల్లారా - థూ... లమ్డీకొ డుకుల్లారా, మీకు తల్లులూ, పెళ్లాలూ, కూతు ర్లూ, అక్కచెల్లెళ్లూ లేర్రా! వాళ్లకే ఇంకోడుఇలా చేస్తే మీరు ఊరుకుంటార్రా! కాకీ బట్టల్లోంచి పౌరుషం పెల్లుబికి, లాఠీల్తో తిరగబడి, రెచ్చి పోయి కీచకవధచేసేర్రా మీరు? అప్పుడు శాంతిభద్రతల సొల్లుకబుర్లు చెప్పర్రామీరు! అప్పుడు చట్టం న్యాయం సూత్రాలు వర్తించ వురా మీకు - రంకునాకొడకల్లారా!

ఒక ఆడకూతుర్ని అందునా అంతచిన్న పిల్లని ఇంతమంది ఇంత కిరాతకంగా చెర చడం తప్పుగా కనిపించదురా! ఈ నీచకా ర్యంచేయడానికి మీకు పోలీసుస్టేషన్ దొరి కిందిరా! ఆ పిల్ల అసలు బతికుందో లేక

చచ్చిపోయిందో చూడరేంరా! ముఖంమీద నీళ్లుకొట్టిలేవనెత్తండిరా! గొంతులో కొంచెం నీళ్లు పొయ్యండిరా.

ప్రతి ఆడకూతురుకీ తను కలెక్టరుకు పెళ్లాంగానో, గవర్నర్‌కి కోడలిగానో కావాలనే వుంటుందిరా! కాని దానికర్మకాలి మీలాంటి డాఫర్‌లంజికొడుకులకు పెళ్లాంగా అమరిపోద్ది. అంతమాత్రాన అది లంజకాదురా, రంకునాయాల్లారా! మీరు, నేనూ సమాజం జాలిచూపించాల్సిన, న్యాయం చేకూర్చాల్సిన కన్నెగులాబీరా అది!

నన్ను బయటకు రానీయండి. మీ పని చెప్తాను. రేపు కొత్త సంవత్సరం. మీ రోగం కుదర్చడానికి కొత్త సంవత్సరంనాడే ముహూర్తం పెడతాను. మీ ఆట కట్టిస్తాను, అంతు తేలుస్తాను.

రేపు నా రిక్షావాళ్లతో వూరేగింపు జరుపుతాను. ఎల్లుండి అన్ని పార్టీల్తో కలిసి బంద్‌కు పిలుపిస్తాను. మీ స్టేషన్‌నుంచి కలెక్టరాఫీసు వరకూ వూరేగింపు లేవదీస్తాను. మా ఎమ్మెల్యే చేత ఈ విషయం మీద అసెంబ్లీలో చర్చకు తీసుకువస్తాను. ఇదో చావుబతుకుల సమస్యను చేసి అధికార పార్టీ తలొంచుకునేట్టు చేస్తాను.''

ఆవేశంతో రెచ్చిపోతున్న రిక్షా సూరిబాబును అప్పుడు చూసారందరూ.

అంతవరకూ అతడక్కడ ఉన్నాడన్న సంగతే మర్చిపోయిన సి.ఐ. సత్యారావు అతడి గొంతు విని నిర్ఘాంతపోయాడు. సీటుకింద డైనమైట్ పేలినట్టు కంపించిపోయాడు. జరగబోయే పరిణామాల్ని వూహించుకుని దద్దరిల్లిపోయాడు. వెన్నెముకలో కరెంటు పాకింది. నెత్తిమీద పిడుగుపడ్డట్టయింది. కాళ్ల కింద భూమి దొలుచుకుపోతున్నట్టయింది. తీర్పు కత్తిమెడ మీద దూకడానికి సిద్ధపడుతున్నట్టయింది.

సత్యారావు బుర్ర స్పార్క్‌లా పనిచేసింది.

ఆ ముగ్గురి వైపూ తిరిగి చూపుమాత్రం చేతసైగచేసాడు. అతని వాడి చూపుల్లోని వేడి భావాన్ని ముగ్గురూ పసికట్టారు. ముగ్గురి తలల్లోనూ లైట్లు వెలిగాయి.

అంతే! తక్షణం ఆ కార్యక్రమం నిరాటంకంగా అమలుజరిగిపోయింది.

లాకప్ తాళాలు తీయడం, ముగ్గురూ లోపలికి వెళ్లడం, తలుపు వేసిగెడపెట్టడం రెప్పపాటులో జరిగిపోయాయి. సూరిబాబు తప్పించుకోడానికి వీలులేకుండా, పారిపోడానికి వీలుకలగకుండా ముగ్గురూ ఒకేసారి మెరుపులా అతడి మీద దాడిచేసారు. ఒకడు పెడరెక్కలు వెనక్కి విరిచిపట్టుకున్నాడు. మరొకడు కాళ్లు రెండూ మెలిపెట్టిదగ్గరకు చేర్చితాడుతో కట్టేసాడు. మూడోవాడు తలమీద గుడ్డవేసి మెడవరకూ లాగి, వూపిరాడకుండా చేసి మెడచుట్టూ చేతులు వేసి వేళ్లతో వుచ్చుబిగించాడు.

ఊహించని ఈ పరిణామానికి అప్రతిభుడైపోయాడు సూరిబాబు. ఏం జరుగుతోందో తెలుసుకునేలోపునే అన్నీ జరిగిపోయాయి. అక్కడికీ వీలైనంతవరకూ తీవ్రంగా ప్రతిఘటించాడు. ఏనుగుబలంతో పెనుగులాడాడు. కాని లాభంలేకపోయింది. వూపిరి ఆడటంలేదు. కళ్లు కనిపించడంలేదు. మెడమీద నరాలు వుబ్బిపోతున్నాయి. కండరాలు వదులైపోతున్నాయి. కనుగుడ్లు తేలిపోతున్నాయి.

పోలీసుల శక్తిసామర్థ్యాలు శాంతిభద్రతల నిర్వాకానికి ఉపయోగపడలేదు కాని ఒక అమాయక ప్రాణి గాలిలో కలిసిపోడానికి వుపయోగపడ్డాయి. ఒక సామాన్యుని హత్యకు చక్కగా ఉపకరించాయి. ఏ నరాలు నొక్కితే రక్తప్రసరణ ఆగిపోతుందో, ఏ కండరాలు వదులు చేస్తే ప్రాణవాయువు అంతరించిపోతుందో నేర్చుకున్న పాఠాలు, దొంగలు, హంతకులు దోపిడీదార్ల మీదకాక ఒక కార్మిక నాయకుని మీద అమలుచేయబడ్డాయి.

సి.ఐ. సత్యారావు 'లోనికి ఎవరూ ప్రవేశించకుండా హాలులో పచార్లు చేస్తున్నాడు.

లోపల నిశ్శబ్దంగా మారణకాండ అమలుజరుగుతోంది.

ఒక్కపదిహేను నిమిషాల తర్వాత ముగ్గురూ లాకప్ రూమ్ తలుపులు తెరుచుకుని బయటికి వచ్చారు. అందరి ముఖాలూ చెమటలుపట్టి వున్నాయి. అందరి చేతులూ చేసిన పాపకార్యానికి భయపడి కించిత్ వణుకుతున్నాయి.

సత్యారావు హాయిగా వూపిరిపీల్చుకున్నాడు. బతుకుజీవుడా... అని నిశ్చింతగా వూపిరి




పీల్చుకున్నాడు. 'హమ్మయ్య... అంతా చాలా పకడ్బందీగా జరిగిపోయింది. దేవుడు కూడా పోల్చుకోలేడు' అనుకున్నాడు.

క్షణాలమీద మిగతా పనులు జరిగిపోయాయి. పదినిమిషాల తర్వాత శవంగోనె సంచీలోకి వెళ్లింది. శవాన్ని పెట్టికుట్టిన గోనె జీపులో కూర్చుంది. కప్పను తిన్నపాములా శవాన్నిమోస్తూ జీపునముద్రం వేపుసాగిపోయింది.

కొత్త సంవత్సరానికి స్వాగతం చెప్తూ జనం రోడ్ల మీద ఉత్సవం చేసుకుంటున్నారు - ఆ సమయంలో మరేం పట్టించుకునే ఓపిక, తీరిక లేకుండా.

★ ★ ★

కోర్టు హాలు మహాసందడిగావుంది. కిక్కిరిసిన జనంతో పిటపిటలాడిపోతోంది.

ఒక సామాన్య వ్యభిచారిణి కేసును జిల్లాజడ్జి గారంతటివారు విచారించడం అనేది మొదటి ఆకర్షణ! ఆ కేసులో ఎన్నో విషయాలు చిక్కుముడిగా వున్నాయనేది అదనపు ఆకర్షణ.

దీనినొక ప్రధాన సమస్యనుచేసి, పైకిలాగి పెద్దదిచేసి వూరంతా ప్రచారం చేయించిన వాడు కుర్రప్లీడర్ సత్యసుందరం. ఆయన తను సేకరించిన సమాచారంతో గొప్ప ఉషారుగా వున్నాడా సమయంలో.

ఆయన్ని రాజకీయప్రముఖులు, విద్యార్థి, యువజన, మహిళాసంస్థల నాయకులు చుట్టుముట్టారు. పత్రికావిలేఖరులు ఆయనతో ఇంటర్వ్యూ చేస్తున్నారు. ఫొటోగ్రాఫర్లు ఆయన్ని ఆమెను, కోర్టు దృశ్యాల్ని ఫొటోల్లోకి దించి, సంచలనం సృష్టించడానికి సర్వసన్నాహాలు చేస్తున్నారు.

సత్యసుందరం చాలా శ్రమపడి, డబ్బు వెచ్చించి ఎరాలు స్వస్థలంనుండి కరణం, మునసబునాయుడు, సర్పంచి, ఇతర పెద్దల తోపాటు మరికొందరు ముఖ్యుల్ని కూడా సాక్ష్యం చెప్పించడానికి వీలుగా కోర్టుకు తీసుకువచ్చాడు.

అయితే ఓవిషాద సంఘటన మాత్రం దానంతటదే జరిగిపోయింది.

ఈవార్త విన్న ఆ ముసలి అవ్వప్రాణం విలవిల్లాడిపోయింది. పెళ్ళి చేయకుండా ఆవూరిలో వుంచేసినా బాగుండిపోయేది అనుకుంది. వుడుతూ తండ్రిని, ఎదుగుతూ తల్లిని, పోగొట్టుకుని తన గుండెలమీద ఆడుకున్న చిన్నది అది. చివరికి దాని ఖర్మ ఇలా కాలిపోయింది. ఇంతనష్టజాతకురాలెలా కాగలిగింది?

అసలు తనకి బుద్ధిలేదుఅసలువాడెవడో, వాడిపుట్టుపూర్వోత్తరాలు ఏమిటో, వాడి అడ్రను ఏమిటో తెలుసుకోకుండా వాడిమాటలు నమ్మి అశపోతులా, వాడికిచ్చి పెళ్ళిచేయడం తన తప్పే. అయినా అంతచిన్నపిల్లకి అప్పుడే పెళ్ళేమిటి? ఏం ముంచుకొచ్చిందని కుర్రదాని బతుకులో ఆరనిజ్వాలల్ని రగిల్చి ధ్వంసం చేసింది తను.

అల్లుణ్ని పోగొట్టుకుని, వున్న ఒక్క కూతుర్నీ వల్లకాటికి సాగనంపి, ఆశాదీపంలా, చిరుపాదాలతో వెలుగుల సవ్వడి చేస్తూ, బుల్లిబుల్లి పలుకులతో కనువిందుచేస్తూ వున్న ఆ ఒక్క మనవరాలి ఆశల్ని మండించి, ఇంకా తానెందుకు బతికివుంది. ఇన్ని విషాదవలయాల మధ్య కన్నీటి సుడిగుండాల మధ్య తనింకా ఎలా బతకగలుగుతున్నది.

ఆ అవ్వ గుండెలవిసేలా రోదించింది. గుండెలు బాదుకుని ఏడ్చింది. ఏడ్చిఏడ్చి ఇక ఏడ్చే ఓపిక లేక, ఎగవూపిరితెచ్చుకుని ఆఖరి శ్వాస వదిలింది.

ఈ హృదయ విదారకవిషాదసంఘటనతో మనసుద్రవించిన ఆవూరువూరంతా ఏకమైపోయింది. నోటముద్దదిగని, కంటికి కునుకురాని ఆపల్లెపల్లెంతా కుతకుతలాడిపోయింది. ఒకే బాటమీదనడిచి, ఒకేమాటమీద నిలిచింది. ఈ పైశాచికత్వాన్ని అడ్డుకోడానికి, ఈ అమానుషత్వాన్ని ఎదిరించడానికి, ఇంకా జాతికిధైర్యం చావలేదని నిరూపించడానికి, తిరుగులేని సాక్ష్యం ఎదురులేకుండా చెప్పడానికి పల్లెపల్లె అంతా తీర్థయాత్రకు బయల్దేరినట్టు కదిలివచ్చింది.

దేశంలో జరుగుతున్న సవాలక్షఘాతుకాల్లో ఇదో చిన్న ఘాతుకంగా కొట్టిపారేయడానికి వీలున్నా ఎందుకోతను చదివినచదువు, తను స్వీకరించిన న్యాయవాద వృత్తి మింగుడుపడని ముద్దలా దొలిచేస్తున్నప్పుడు సత్యా

సుందరం బాధ్యత తీసుకుని ఈ సాహసం చేశాడు. తెగువచూపించాడు.

అప్పుడే జైలునుంచి వచ్చిన పోలీసు వ్యాను కోర్టు ఆవరణలోకి ప్రవేశించింది. అందులో వరాలు దిగాలుగా కూర్చునివుంది. ఆమెకిరువైపులా ఇద్దరు జైలుజవానులున్నారు. తాము లేకపోయినా ఆమె తప్పించుకుపారిపోలేదని వారికి తెలుసు. అందుకే వారు కబుర్లు చెప్పుకుంటూ అనాసక్తిగా వున్నారు.

వ్యాన్లో వరాలును ఆ స్థితిలోచూసిన ఆవూరి ప్రజలు దిగ్భ్రాంతి చెందారు. ఆమెను వరాలుగా సరిపెట్టుకోడానికి వారికి టైం కావాల్సివచ్చింది. ఎవరైనా చెపితే తప్ప ఆమెను వరాలుగా సరిపెట్టుకోలేకపోతున్నారు. ఒకప్పుడు తమకళ్ళముందు చెంగుచెంగున గెంతే లేడిపిల్ల రివ్వురివ్వుమని ఎగిరే పావురాయి పిట్ట- ఇప్పుడు ఆమె శరీరమంతా పాలిపోయింది. ముఖం చెక్కుకుపోయి, కళ్ళు, చెక్కిళ్లు లోతుకువెళ్ళిపోయి, జుత్తంతా రేగి అతిదైన్యంగా, దయనీయంగావుంది.

ఇప్పుడా ముఖంలో ఒకప్పటి కళలేదు. కళ్లల్లో ఆనాటి కాంతిలేదు. ఆ వంట్లోపూర్వపు బిగువులేదు. ఒక్కమాటలో అసలు ఈమనిషి ఆమనిషికాదు.

అంతలో 'సైలెన్స్-సైలెన్స్' అన్న శబ్దంతోపాటు, బిళ్ళబంట్రోతు, ఆవెనక పుస్తకాలు, ఫైల్స్ బరువుమోస్తూ ప్యూన్, ఆతర్వాత హవల్దార్, బెంచిక్లర్క్ ప్రవేశించారు.

అప్పుడు ఎవర్నీ లక్ష్యపెట్టకుండా, ఎవరికేసి చూడకుండా జిల్లాజడ్జి శ్రీ శ్యామసుందర వరప్రసాదమూర్తిగారు ఛాంబరునుండి కోర్టు హాల్లోకి వేంచేసారు.

హాలులో నల్లకోట్లు పరివేష్టితమై వున్నాయి. ఆ గొన్లు జడ్జిగారి పట్ల గౌరవసూచకంగా ఒకసారిలేచి, వారు కూర్చున్నంతవరకూ నిల్చుని, వారు కూర్చున్న తర్వాత కూర్చున్నాయి. జడ్జిగారు న్యాయ సింహాసనం అలంకరించారు.

ప్రేక్షకుల బెంచీలమీద, వెలుపలా కిక్కిరిసిన జనం ఉత్కంఠతో వేచివున్నారు.

మరోసారి 'సైలెన్సు- సైలెన్సు' అని అరిచిన తర్వాత అంతటా నిశ్శబ్దం అలుముకుంది.

"నూకరాజు- నూకరాజు" మొదటికేసు పిలిచాడు బిళ్ళబంట్రోతు. ప్రస్తుతానికి 'నూకరాజు'గా పిలువబడే సదరు 'వరాలు'ను ఇద్దరు జవాన్లు అతికష్టంమీద ట్రక్కునుంచి దింపారు. ఆమె కట్టెగా మారితే బరువెక్కుతుందేమోగాని ఇప్పుడు మాత్రం చాలా సన్నంగా, అతితేలిగ్గావుంది. వారామెకు రెండు వక్కలా వుండిచేతులూ, భుజాలు పట్టుకుని మెల్లగా నడిపించుకుంటూ ఒక దశలో ఎత్తి, మోస్తూ ఆమెను కోర్టుహాలులోనికి తీసుకువచ్చారు.

అసలు నూకరాజుకు చెందిన రౌడీగాంగు, కాళ్ళూచేతులూ విరగ్గొట్టగా, ఉద్దండపిండాలైన లారీసామ్రాట్టులు పోలీసులు తగువిధంగా, వారిపద్ధతిలో సత్కరించగా ఆమెఇప్పుడు తనంతతానుగా నడవలేని స్థితిలోవుంది. ఇది ఒక విధంగా పోలీసు వీరుల అసమానప్రతిభా ప్రదర్శన.

ఆమెనావిధంగా చూసిన జర్నలిస్టులు, విద్యార్థులు, యువజనులు, 'ఔరా- కాకీదుస్తుల లారీయజమానుల్లారా, మీరెంతటివార్రా. ఎంతకైనా తగుదుర్రా' అని విస్తుపోయి ముక్కుమీద వేలేసుకోబోయి అంతలోనే ఆగిపోయారు.

సత్యసుందరంలేచి తన దఖలుపత్రాలను జడ్జిగారికి వినయపూర్వకంగా సమర్పించుకున్నాడు.

జడ్జిగారు వాటిని ఓసారి కిందామీదాచూసి, అవిసరిగానే వున్నాయని ఋజువుచేసుకుని, "యస్ ప్రొసీడ్" అన్నారు హుందాగా.

యువలాయర్అందరివైపూ ఓసారి చూసి, ఎడ్వంచర్ సాధించబోతున్న మహోత్సాహంతో ధీమాగా లైట్, కోటు సవరించుకుని ప్రారంభించాడు.

"మిలార్డ్.... నూకరాజు' అనిపిలవబడే ఈమె అసలునూకరాజు కాదు. ఆ నూకరాజువేరేవుంది. ఈమెపేరు 'వరాలు' మాత్రమే. ఈమె వయసు కేవలం పధ్నాలుగు సంవత్సరాలు మాత్రమే. వయసు దఖలు పరిచే జాతకం తమ వద్దవుంది. ఆజాతకం నిజమని నిర్ధారించే కరణం, మునసబు సంతకాలు దానిమీద వున్నాయి. ఇంకామైనారిటీ తీరడాని




కి చాలాకాలం పడుతుంది. కాకపోతే మెచ్యూర్ అయింది. ఈమె అసలు వూరు మానాపురం. పుట్టింది, పెరిగింది, పెళ్ళిఅయిందికూడా అక్కడే.

ఇప్పుడు ఈమెకు ఆపాదించబడుతున్న నేరాలు ఈమె చేసినవికావు. కానీ ఆ నేరాలు మాత్రం యదార్థమైనవే. ఖచ్చితంగా జరిగినవే. అవిచేసిన చేయించిన వ్యక్తి నిఖార్సయిన నూకరాజు. కావాలని ఆనూకరాజును తెరవెనకకు మళ్ళించి, ఈమెను రంగంమీద కునెట్టారు. ఈపాపాల భైరవిలాంటికేసుల నుండి అసలు నూకరాజును రక్షించి, విముక్తి చేసి, ఆవిడవద్దనుండి పెద్దయెత్తున నిధులు రాబట్టడానికి పోలీసులుపన్నిన కుట్రఇది. ఆ నూకరాజు తాలూకు నేరాల పుట్టలఫైల్ క్లోజ్‌చేయడానికి ఈ వరాలును ఒకసాధనం చేసి ముందుకు తోశారు.

ఆ పాపాల భాండాన్ని నెత్తిన రుద్ది చెయ్యని నేరాలకు ఈమెను బలిపశువును చేస్తున్నారు. నేరమొకరుచేస్తే శిక్షమరొకరిపై పడటమనే దాన్నుండి న్యాయాన్ని కాపాడేందుకు ఈమె విషయంలోనేను వాదించదలచుకున్నాను. న్యాయంవైపు నిలిచిపోరాడదలచుకున్నాను. అసలు నూకరాజు ఎవరో, ఆమె చరిత్రఎటువంటిదో నేను బయటపెట్టదలచాను. తత్కారణంగా ఒకవేళ ఆవిడ నన్ను చంపినా చంపించగలదు. ఆ కార్యం పోలీసులద్వారా జరిగినా కూడా ఆశ్చర్యపడాల్సిన పనిలేదు. అందుచేత మిలార్డ్ తమరు వారెంటుజారీచేస్తే, ఆవిడను తీసుకువచ్చి కోర్టు ముందు హాజరుపరచగల సమర్థులు ఒక్క పోలీసుశాఖ వారే. ఎందుకంటే వారే ఆమెకు గొడుగుపట్టి నీడకల్పిస్తున్నారుగనక, వారి కనుసన్నలలోనే ఆవిడపొట్లగిత్తలా బలిసిపోయింది. గనక ఆవాడవాడంతటికీ ఆవిడే నాయకురాలు. మధ్యవర్తి తీర్పరిగనుక''

మధ్యలో జడ్జిగారు కలుగచేసుకున్నారు.

"ఈకేసు విషయంలో మీరెందుకింత ఆసక్తి చూపుస్తున్నారు? మీరే కలుగచేసుకునిఇంత ప్రత్యేకశ్రద్ధతో ఎందుకు చేపట్టవలసి వచ్చింది?'' ప్రశ్నించారు.

"యువరానర్! దేశంలో శతకోటి అన్యాయాలు జరుగుతున్నాయి. వాటన్నిటినీ నేనెదిరించలేను. త్యాగధనుల్లా ప్రజల్ని వుద్ధరించడానికి పుట్టామని చెప్పుకుంటున్న రాజకీయపార్టీలే ఆపనిచేయడంలేదు. నేననగాఎంత? కాని ఎంతచెడ్డా నేను న్యాయవాదిని. న్యాయానికి ఎక్కువ హానిజరగకుండా చూడటం నావృత్తి ధర్మం. నా వృత్తిలోనేను ఎన్నికక్కుర్తులైనా పడవచ్చు. కాని నాకంటిముందే తేటతెల్లంగా కన్పిస్తున్న ఒక పచ్చివాస్తవాన్ని క్రూరమైన అబద్ధంగా మార్చడానికి ప్రయత్నం జరుగుతుంటే నేను చదివిన చదువు, స్వీకరించిన వృత్తి దాన్ని అంగీకరించడంలేదు. ఈమెను చూస్తుంటే ఈమెకు జరగాల్సిన న్యాయం జరగలేదనిపిస్తోంది. చాకులాంటి పిల్లకు తుప్పులాంటి మొగుడు దాపురించాడు. ఫలితం బతుకుఅంధకార బంధురం, కష్టాలవలయం, కడగండ్లవూబి అయింది. జీవితం రక్తసిక్తమయింది. ఈ వైఫల్యానికి సమాజంలో ప్రతిఒక్కరూ బాధ్యత వహించాల్సి వుంది. జవాబుదారీ కావాల్సి వుంది. ఈమెకు జీవితంలో అన్యాయం స్పష్టంగా జరిగింది. దాన్ని నేను పూరించదలచుకున్నాను. తమ తీర్పు వెలువడిన తర్వాత అదెలాగూ ఆమెకు అనుకూలంగా వస్తుందని నాకు తెలును. తమ ఆశీర్వాదంతో ఈమెను నేను పెళ్ళిచేసుకోదలచుకున్నాను.

ఆవిధంగా ఈమె బతుకులో ఏర్పడిన లోటును పూరించదలచుకున్నాను. దీన్ని త్యాగంగా ఎవరూ భావించాల్సిన పనిలేదు. ఈమె ముఖం చూస్తే ఈ అమాయకురాలి కోసం ఏంచేసినా తక్కువే అనిపిస్తుంది''

"ప్లీడరుగారి విప్లవభావాల మధ్య ప్రేమ కూడా చోటు చేసుకుందన్నమాట. ప్రణయం అంకురించడం, అది చిగురించడం కూడా జరిగిపోయినట్లుంది'' జడ్జిగారు విట్టువేశానను కుని చిన్నగా నవ్వారు.

అయనలా అనుకోకపోయినా ఆనవాయితీగా మిగిలిన నల్లకోట్లు కూడా ముసిముసి నవ్వులు చిందించేసరికి ఒక్కసారి హాలు వెలిగినట్టయింది.





యువలాయర్ ముఖంలో చిన్న సిగ్గుతెర తొంగిచూసింది. "ఇక ఎ.పి.పి. వారు తమ వాదన ప్రారంభించవచ్చు" అనేసి కూర్చున్నాడు.

సత్యసుందరం ప్రేమకథ వినేసరికి జడ్జీగారిలో ముద్దాయిని చూడాలనే కోరిక పుట్టింది. సాధారణంగా వారు ముద్దాయిల ముఖాలు పరిశీలనగా చూడరు. చూడకుండానే వాదప్రతివాదాలు వినేసి తీర్పు ఇచ్చేస్తుంటారు— అంతే!

అయితే ఇప్పుడు చదువుండి, లాయర్ హోదా కలిగి, తన వృత్తిలోనివాడయిన ఒక కుర్రలాయరు ప్రేమ వెలగబెడుతుంటే చూడాలని కుతూహలపడ్డంలో తప్పులేదనిపించింది. కాస్త దర్పంగా. కొంచెం క్యూరియాసిటీతో ఓరగా చూసారు. అంతే!

బ్రహ్మాండం బద్దలయినట్లయింది. సీటు కింద బాంబు పేలినట్లయింది. సింహాసనం గజగజ వణికినట్లయింది. ప్రళయఘోషత్తో సముద్రం పెల్లుబికినట్లయింది. ఫెళఫెళార్భాటాలతో భవనాలు కుప్పకూలిపోతున్నట్లయింది.

స్వహస్తాలతో పూడ్చేసిన శవం నట్టింట్లోకొచ్చి వెక్కిరించినట్లు తుళ్లిపడ్డారు.

ఈమె ఎవరు?

కోడలుపిల్ల ప్రమీలకాదుకదా!

ఒక్కగానొక్క కూతురు ప్రసూన కాదుకదా!

ఔను ... ఔను ... సరిగ్గా అలాగే వుంది. ఇద్దరూ నిల్చుని వుండగా వెనకనుంచి చూస్తే తేడా ఏమీ తెలియదు. ముందునుంచి చూ

సినా, దగ్గరగా ముఖంలో ముఖంపెట్టి చూస్తే గాని ఎవరు ఎవరో పోల్చుకోడం కష్టం. కోడలు పిల్ల ముఖం కొంచెం కోలగా వుంటుంది; కూతురు ముఖం కొంచెం గుండ్రంగా వుంటుంది. ఇద్దరి ఒడ్డూ పొడుగూ ఒకటే. ఇద్దరూ బంగారువన్నెతో మెరిసిపోతుంటారు. కుందన బొమ్మల్లా, బంగారు దిమ్మల్లా ముద్దు లొలుకుతుంటారు.

సరిగ్గా అచ్చుగుద్దినట్టు, మూసలోంచి తీసినట్టు ఈమె వారిలాగే వుంది.

కాని– కాని దీన్ని ఎలా నమ్మడం? ఇప్పుడు ఆ ఇద్దరూ లేరే. తన బతుకు ధ్వంసంచేసి, భవిష్యత్తు శూన్యంచేసి, ఇద్దరూ తననుంచి తప్పుకున్నారే! ఇద్దరూ కూడ బలుక్కున్నట్టు ఒకరి తర్వాత ఒకరు వెంటవెంటనే నిష్క్రమించారే! గుండెను తూట్లుతూట్లు పొడిచి నిలువెత్తు గాయంచేసి, నిర్దాక్షిణ్యంగా వెళ్లిపోయారే!

జీవితంలో ఏదైనా కోల్పోవచ్చు. సర్వస్వాన్నీ వదులుకోవచ్చు. కాని ఈ రంపపుకోతని, నిత్యం హోమగుండంలా రగులుతున్న ఈ అగ్నిజ్వాలను ఎలా మరిచిపోవడం? ఎక్కడికక్కడ ముక్కలు ముక్కలుగా నరికేసిన ఈ సంఘటన ఎలా చెరిపేసుకోడం?

అయితే ఈమె ఎవరు? సరిగ్గా అచ్చుగుద్దినట్టు, మూసలోంచి తీసినట్టు ముమ్మూర్తులా వారినే పోలివున్న ఈ చిన్నది ఎక్కడినుంచి వచ్చిపడింది? ఇంకా తను బతికేవున్నాడో లేదో చూసిరమ్మని స్వయంగా ఆ కోడలూ, కూతురూ తమ ప్రతినిధిగా ఆ లోకంనుండి ఈ లోకానికి పంపిన ప్రతిరూపం కాదుకదా! వారి ఆజ్ఞమేరకు ఇక్కడ విచారణ జరిపించడానికి వచ్చిన ప్రేతాత్మకాదుకదా!

వారొక్కసారి బాధగా కళ్లు మూసుకున్నారు.

★ ★ ★

ఒకనాడు ఖచ్చితంగా శనిమహర్దశ జ్వాజ్వల్యమానంగా మండిపోతున్నప్పుడు ఓ తెలవారుజామున ఫోను మోగింది. నైట్‌గౌను సవరించుకుని లేచి ఫోను అందుకున్నారు.

పదినిమిషాలసేపు సంభాషణ తర్వాత తన గుండెలమీది బరువు దించివేసినట్టయింది. పునర్జన్మ ఎత్తి కొత్తలోకాల్లో అడుగుపెట్టినట్టయింది. ఆ భగవంతుడే దిగివచ్చి చావేలేదని వరమిచ్చినట్టయింది. ఈమధ్య తనలో కుతకుతలాడుతూ వుడికిపోతున్న సంక్షోభం కరిగిపోయి, తేలిపోయినట్టయింది. నెత్తిమీదే వేలాడుతున్న పదునుకత్తి పూలదండగా మారినట్టయింది.

జడ్జిగారికి పట్టరాని సంతోషం కలిగింది. ఈలవేద్దామని తెగసంబరపడిపోయారు గానీ సరిగ్గా కుదరక ఆ ప్రయత్నం విరమించుకున్నారు. వారికి కార్పెట్టుమీద నడుస్తున్నట్టుకాక, మేఘాలమీద తేలిపోతున్నట్టు, వూగిపోతున్నట్టు అనిపించి గట్టిగా అరుద్దామనుకున్నారు. కాని అలా అరవడం చిన్నపిల్లల మెంటాలిటీ. తన డిగ్నిటీకి సరిపడదని వూరుకున్నారు.

ఉత్సాహంగా కాలకృత్యాలు ముగించుకుని కోడలు పిల్లని, కూతుర్ని పలకరించి పరామర్శించారు. వారి భవిష్యత్తుకోసం ఆశీస్సులందించి అభినందనలు తెలిపి, చాలా పెందలికడనే ఏదో ముఖ్యమైన పనుందని చెప్పి కోర్టుకు బయలుదేరారు.

కోర్టులో కూడా అంతే! అడిగిందే తడవుగా వాయిదాలిచ్చేశారు. ఇలవేలుపు వరాలిచ్చినట్టు, ఎంతోకాలంగా పెండింగ్‌లో వున్న కేసులు కూడా తీయించి కొట్టిపారేశారు. ముద్దాయిలకనుకూలంగా తీర్పులిచ్చేశారు. 'పోండిరా, బతికిపోండిరా' అని మనసులోనే ఆజ్ఞాపించారు.

'నా ఇంట్లో ఈరోజు పండగ. అది ప్రపంచానికే పండగ' అనుకున్నారు.

కాని ... కాని ... వారికి ఒకటే అర్థంకాని విషయమైపోయింది.

కోర్టు ఇంత కళాహీనంగా ఎందుకుంది? తన సర్వీసులో ఇంత నిర్జీవంగా ఎప్పుడూ చూడలేదు. సిబ్బందికే కాదు అక్కడికి వచ్చిన ఎవరి ముఖాల్లోనూ జీవకళలేదు. శవాల చర్మాలనుంచి సహితం డబ్బు పిండగల నేర్పరులైన వీరెవరి ముఖాల్లోనూ కళాకాంతుల్లేవు. కారణమేమిటి?

లంచ్‌టైమ్‌లో కేరేజ్‌ముందు కూర్చుని ప్యూన్‌ను వాకబు చేశారు. వాడు ప్లేట్లు శుభ్రంగా తుడిచి కారేజ్‌నుంచి సరంజామా ప్లేట్లలో సర్దుతూ చెప్పాడు.

"గొప్ప ఘోరం జరిగిపోయిందండి. అన్యాయం జరిగిపోయిందండి. ఊరికి దరి




ద్రం దాపురించిందండీ! ఊరుకి యువరాజంతటివాడు కనుమరుగైపోయాడండి. దాన ధర్మాలకు పేరుమోసిన కుటుంబమండీవారిది.

పెద్దాయన డాక్టర్ శ్రీనివాసరావు. వారి చేతికి ఎముక లేదండి. అడగనివాడిదే పాపం. చేతికి ఎంత వచ్చిందో చూసుకోకుండా ఎంతొస్తే అంత ఇచ్చేయడమే. నేను దసరా మామూలుకెళ్లి చెయ్యి చాపగానే యాభైరూపాయల నోటు తీసిఇచ్చారండీ! 'ఇదేమిటి బాబూ– ఇంతొటిచ్చేస్తున్నారు. నేను మీకేమిటి చేశాను. ఇంకేమిటి చేయగల్ను' అన్నాను. అప్పుడాయన తాపీగా నవ్వి ఇందులో నాకు పోయేదీమీ లేదురా. ఎందరు తిన్నా ఎంత పారేసినా ఇంకా పదితరాలకు సరిపడా అస్తుంది నాకు. నేను పోయినా ఈ భూమ్మీద ఈ కీర్తి వుండిపోతుంది. అది చాలు నాకు' అన్నారండీ. అంతటి ఉదారస్వభావులండీ బాబూ వారు.

అంతటి మహానుభావుడికి ఒక్కగానొక్క సంతానమండి. ఇప్పుడు ఆ వంశవృక్షం కూలిపోయిందండి. బాబూ ... ఈరోజు ఆ కుర్రాణ్ని చావు పిల్చుకెళ్లిపోయిందండి. ఎప్పుడూ ఎవరికీ అపకారం తలపెట్టని ఆ బాబు ఇంటిని ఇప్పుడు మాయదారి చీకటి కప్పేసి తన కసి తీర్చుకుందండీ. ఆ మహానుభావుడి ఆస్తికి వారసుడే లేకుండా పోయాడండీ!

కోటలా నిటారుగా నిలబడ్డ ఆ ఇల్లు ఇప్పుడు పునాదుల్తో కూలిపోయి రాలిపోయినట్లుందండీ! ఈ దెబ్బకి ఆయన వటవృక్షం కూలిపోయినట్టు నిలువునా కృంగిపోయారు బాబూ! మాటాపలుకూ లేక వంగిపోయారు. మరి లేవలేదు బాబూ ... లేవలేదు. పదిమందికి నీడకల్పించే ఆ ఇల్లు ఇప్పుడు నీడలేకుండా అయిపోయింది. కాలం కాటేసిన మనిషి అయిపోయారు ఇప్పుడు ఆ పెదబాబుగారు.

లాయర్లు, గుమాస్తాలు అందరూ అక్కడికే వెళ్లి వస్తున్నారు. నేనూ ఆ బాబు దర్శనం చేసుకునే వచ్చాను. చెట్టంత మనిషి ఆయన. బంట్రోతుగాణ్ని నేను. ఆ బాబును నేనెలా ఓదార్చగలను. మహామహులందరూ అక్కడే ఆయన పక్కనే వున్నారు. నేననగా ఎంత. ఏదో దూరంనుంచి చూసి వచ్చేసానంతే.

ఏం జనం, ఎన్నికార్లు, తీర్థప్రజ! డాక్టర్లు, ఇంజినీర్లు, గొప్పగొప్పోల్లు, ఊరి పెద్దలు అందరూ అక్కడే - ఆ బాబు దగ్గరే వున్నారు. ఇసకేస్తే రాలడంలేదు. అంతజనం. ఊరువూరంతా అక్కడే వుంది బాబు. గొప్ప ఘోరం జరిగిపోయిందండి. ఈ వూరికేదో పోయేకాలం దాపురించింది''

''ఇంతకీ ఈ ఘోరం ఎలా జరిగింది?'' జడ్జిగారు అడిగారు.

''చినబాబుగారు ఉదయం తోటలో పరుగెత్తడానికి వెళ్లి తిరిగి వచ్చేస్తున్నప్పుడు ఆ బాబు మోటారు సైకులుని ఏదో లారీ గుద్దిందిట. ఆ బాబు కాసుకుని సర్దుకునేలోపునే అంతెత్తు కొండమీదినుంచి తుళ్లిపోయి సముద్రం ఒడ్డున వున్న రాళ్లమీద పడిపోయారట. ఆ దెబ్బకాక ఆయనమీద మోటారుసైకిలు పడిపోయింది. అలా పడిపోయిన మోటారుసైకిలు చక్రాలు ఇంకా తిరుగుతూనే వున్నాయటండి. మృత్యువు అలా ఆ కుర్రబాబును కబళించిందండి బాబుగారూ!''

ఆరోజు జడ్జీగారు కారేజిలో ఏమీ వదలకుండా, ఫ్యాన్‌కి కూడా మిగల్చకుండా లాగించేశారు. కడుపునిండా హాయిగా, తృప్తిగా భోంచేశారు.

చేతులు కడిగి నేప్‌కిన్‌తోనే చేతులు తుడుచుకున్నారు. సుతారంగా మూతికి అద్దుకున్నారు. తూగుటుయ్యాల్లాంటి సోఫాలో ఠీవిగా కూర్చొని ధీమాగా కళ్లు మూసుకున్నారు. అలా ఒక్క పదినిమిషాలు భుక్తాయాసం తగ్గేవరకూ విశ్రాంతి తీసుకుని తరువాత ఆరోజు వచ్చిన న్యూస్‌పేపర్స్ తిరిగేశారు.

పేపర్స్ మామూలే. యధాప్రకారం మంత్రుల శంకుస్థాపనలు, ముఖ్యమంత్రుల ప్రారంభోత్సవాలు, కేంద్రమంత్రుల విదేశీయాత్రలు– రేడియోల్లోనూ, పత్రికల్లోనూ ఇవి తప్ప మరో వార్త వుండటంలేదీ మధ్య.

బహుశా వేకువని జరిగివుండటంచేత కాబోలు ఈ హత్యావార్తలేవీ పత్రికల్ని అలంకరించలేదు. కాని ఒక్క స్థానిక దినపత్రిక మాత్రం రెండు పేజీలలో ఒక ప్రత్యేక అనుబంధ సంచికను వెలువరించింది.

ఆ సంచిక ఒకటి పేపర్ల మధ్యలో వుంది.

బహుశా ఎక్కువమంది చదివివుండటం చేతకా బోలు బాగా నలిగిపోయి వుంది.

అది కావాల్సిన పత్రికగా వారి గుండె తలుపుల్ని ఎవరో కొట్టినట్టయి ఠక్కున అందు కున్నారు. చూస్తే ఏముంది...

మొదటి పుటలో పతాకశీర్షికగా "డాక్టర్ శ్రీనివాసరావుగారి ఏకైక సంతానం రాజ్‌మో హన్ ఉదయం పూట వాహ్యాళికి వెళ్లివ స్తుండగా, సముద్రం ఒడ్డున తన తోట సమీ పంలో ఒక లారీ అతివేగంగా వెనకనుంచి వచ్చి గుద్దుకొనగా, తుళ్లిమోటారుసైకిల్‌తో సహా కొండమీదినుంచి కిందపడి, పదునైన రాళ్లమీద తలపగిలి హఠాన్మరణం" పేజి నిండా ఫొటో సముదాయం.

రెండో పేజీ హెడ్‌లైన్స్‌లో 'చాకులాంటి యువకిశోరం, వైద్యవిద్యార్థి, అత్యంతప్రతిభా వంతుడు; ఫస్టురాంకు, స్టేట్ ఫస్టు గోల్డ్ మెడ లిస్టు రాజ్‌భూషణ్ శరవేగంతో దూసుకుపో యిన ఒక లారీ మోటారుసైకిల్ను ఢీకొట్టగా అక్కడికక్కడే మరణించిన ఘట్టం. యధాప్ర కారం ఫొటోలు.

చివర్నకొసమెరుపులా ఆ లారీని వెతకడాని కి పోలీసుల వేట ప్రారంభమైందన్న వార్త.

కోర్టు ముగిసే వేళకు జడ్జిగారు చాలా ఉల్లాసంగా వున్నారు. వారి ఆనందం ఇంతింతని చెప్పనలవికాకుండా వుంది. వారికి ఆడాలని వుంది. పాడాలని వుంది. కాని ఇది సందర్భంకాదని సమయోచితంగా వుండదని వూరుకున్నారు.

న్యాయమూర్తి మేకప్పు వూడదీసుకుని కార్లో కూర్చునేప్పటికి వారికో ఆలోచన తట్టింది. డాక్టర్ శ్రీనివాసరావు ఇంటిమీదిగా వెళ్లామన్న కోర్కె పుట్టింది. ఇప్పుడా ఇల్లు ఎలావుందో సందర్శించాలన్న క్యూరియాసిటీ పెరిగింది.

కారు అటువైపు పోనివ్వమని ఆజ్ఞ జారీ చేశారు.

కారురోడ్డెక్కిందో లేదో వారి కళ్లను వారే నమ్మలేకపోయారు. రోడ్డు నిర్మానుష్యంగా, కళా విహీనంగా వుంది. దుకాణాలు, హోటళ్లు, సినిమా థియేటర్స్, సమస్త వ్యాపారము మూ యబడివుంది. ప్రజలు యావన్మందీ డాక్టరు గారి ఇంటికి చేరుకున్నట్లున్నారు.

అప్పుడే మెడికల్ స్టూడెంట్స్ ర్యాలీ ఒకటి, చాలా పెద్దయెత్తున పొంగిన జనవాహినితో తరలివస్తున్నది. తమసాటి విద్యార్థి మృతికి సంతాపసూచకంగా ఆ ర్యాలీ జరుగుతోంది. ఆ వూరేగింపులో మెడికల్ స్టూడెంట్స్‌తోపాటు ఇతర విద్యాసంస్థలు కూడా పాల్గొన్నట్లు న్నాయి.

డాక్టర్‌గారి భవనం సంగతి సరేసరి. అదో తిరునాళ్లలా వుంది. ఇసుక వేస్తేరాలనంత జనసమ్మర్దంతో నిండిపోయి వుంది. పక్షి కదలి కల్నిసహితం స్పష్టంగా తెలుసుకునేంత నిశ్శ బ్దంగా వుంది. పెద్ద వూరేగింపుతో శవం కదల డానికి సిద్ధంగా వుంది. అక్కడ ఎవరికి వారే ఒక కార్యకర్తలా ఉన్నారు.

ఒక లారీలో ఎత్తుగా పూలవేదిక నిర్మించా రు. దాని మీద ప్రజలు దర్శించడానికి వీలుగా శవాన్ని పడుకోపెట్టారు. లారీ అంతా పూల దండలతో అలంకరించారు. ఆ లారీనుండి వస్తున్న సుగంధభరితమైన అగరువత్తుల వాసనగాలినిండా వ్యాపించి ముక్కురంధ్రాల ను ఘాటెక్కిస్తున్నాయి.

మరో లారీనిండా అచ్చమైన గంధపు చెక్క లు.

ఊరేగింపు బయల్దేరింది. ఊరేగింపుకు ఫర్లాంగు పొడవునా కార్లు, వూరేగింపు వెనక రెండు ఫర్లాంగుల వరకూ స్కూటర్లు. ఊరే గింపు దాదాపు అరమైలువరకూ వుంటుంది.

ఎటుచూసినా అశేషజనసముద్రం, ప్రజాప్ర వాహం. మానవమయం. నగరానికి నగరమే తరలివచ్చిందా అన్నట్టు అక్కడ విస్తరించిన జనసాగరం. దాదాపు ఆ నగర చరిత్రలోనే మున్నెన్నడూలేనంతగా, మొట్టమొదటిసారిగా అన్ని సంస్థలూ, అందరు వ్యక్తులూ అంతటి కదలికతో తమంత తాముగా స్వచ్ఛందంగా పాల్గొన్న సంఘటన అది ఒక్కటే.

ప్రజల గుండెల్లో దయాళువుగా ముద్రపడి, అందరి కష్టాల్లోనూ 'నేనున్నాను. ఇక మీరు నిశ్చింతగా వుండండి' అనే భరోసాతో అండగా నిలిచే మానవోన్నతునకే కష్టం వస్తే, నష్టం కలిగితే ఒక్కతాడుపేనిన పురిలాగా ఇలా జన మంతా ఏకమౌతారు కాబోలు. ప్రజల హృద యాల్లో శాశ్వతస్థానం పొందిన వారికి అదే గౌరవం దక్కుతుంది, నిలుస్తుంది.





అదంతా చూస్తూ అంతటి దర్పంగల మని షిలోనూ ఇంచుక భీతిలాంటిది కలిగింది. మనసులో చిన్నసైజు అలజడి ప్రారంభ మైంది. ఒక్కపిసరు దడ ఈ చివర్నించి ఆ చివరివరకూ కదిలింది. దగ్గరౌతున్నకొద్దీ అదింకా ఎదిగి మనిషినంతా ఆక్రమించు కుంటుందేమోనని భయమేసింది. పులి లాంటి మనిషికి కూడా చెమటపట్టింది. మెద డు మొద్దుబారసాగింది.

"ఊరేగింపు బయల్దేరిపోయింది. ఇక మనం వెళ్లి ప్రయోజనంలేదు. కారు ఇంటికి వెళ్లిపోనీ" అని ఆజ్ఞాపించారు డ్రైవరును.

ఆ రోజు ఎందుకో వారికి క్లబ్బుకు వెళ్లాలని పించలేదు. బహుశా ఆజనం కూడా ఇక్కడే వుండివుంటారు. అక్కడ తనకి తోడెవరూ వుండరు. ఒక్కడూ 'వన్‌మాన్‌షో' ఆడుతూ కూర్చోవాలి. పలకరించేవారు లేకపోతే సందడి వుండదు.

బంగళా చేరేసరికి అది వారిల్లులాకాక శ్మశా నంలా కన్పించింది. డాక్టర్ శ్రీనివాసరావుగారి ల్లు సంగతేమోగాని, ఇప్పుడు తన ఇల్లే కళా కాంతుల్లేకుండా బోసిగా, దిగాలుగా వుంది. ఎక్కడా దీపాలు వెలిగిన జాడలులేవు. ఒక్క మనిషీ కదలాడుతున్న చిహ్నంలేదు. నౌకర్లు దిగాలుగా కునుకుముఖాలేసుకు కూర్చున్న వారల్లా వీరి రాకతో లేచినిల్చున్నారు. ఎక్కడి వారక్కడ సర్దుకున్నారు.

వారి గదిలో, నడవలో, బాత్రూం, డైనింగ్ హాల్సులో లైట్లు వెలిగాయి.

వారు డ్రెస్సువిప్పి కాళ్లూచేతులూ ముఖం కడుక్కుని, నైట్‌గౌన్ వేసుకుని వచ్చి సోఫాలో కూర్చున్నారు. వంటవాడు వచ్చి వేడివేడి టీ ఇచ్చాడు.

"లైట్లేం వెలిగించలేదు" చేతులు కట్టుకు నిల్చున్న నౌకర్ని అడిగారు.

"పెద్దమ్మాయిగారు, చిన్నమ్మాయిగారు కూడా వద్దన్నారండి" వాడు సంజాయిషీ చె ప్పుకున్నాడు.

ఆ ఇంట్లో కోడలని పెద్దమ్మాయి అనీ, కూతురుని చిన్నమ్మాయి అనీ పిలవడం అందరికీ అలవాటు.

"అమ్మాయిలిద్దరూ ఏం చేస్తున్నారు?"

"పెద్దమ్మాయిగారు మేడమీద, చిన్నమ్మా యిగారు కింద - ఎవరి గదుల్లో వారు పేపర్లు ముందేసుకుని కూర్చునున్నారండీ! ఎవరో చచ్చిపోయారటకదా - ఇద్దరూ ఉదయమనగా వెళ్లి ఇప్పుడిప్పుడే వచ్చి ఇలా కూర్చున్నారు. కాఫీ టిఫిన్ల సంగతి దేవుడెరుగు - పచ్చి మంచినీళ్లు కూడా ముట్టలేదు" ఎంతో బాధగా వివరించాడు నౌకరు.

దాదాపు అపస్మారకస్థితిలో వారు కూర్చును న్నారనే సంగతి జడ్జిగారికి అర్థమైపోయింది. ఆ ఇద్దర్నీ కదిపితే అగ్నిపర్వతాలే బద్దలౌతా యన్న సంగతి వారికి తెలిసిపోయింది.

బాగా పొద్దుపోనిచ్చి, సుమారు పదవు తుందనగా జడ్జిగారు డైనింగ్ టేబుల్ ముందు కూర్చున్నారు. ఒక ప్లేట్లో నేతిలో వేయించిన పూరీలు, మరో ప్లేట్లో ఎగ్‌కుట్టీ వేడివేడిగా తీసుకువచ్చి, వారి ముందు టేబు ల్‌మీద పెట్టాడు వంటవాడు. ఫ్రిజ్ నుంచి తీసిన చల్లని నీరు కెటిల్‌తో తెచ్చి గ్లాసులో నింపాడు.

కడుపునిండా భోంచేసి భుక్తాయాసం తీరాక, తృప్తిగా త్రేన్చేసి చిన్నచిన్న అడుగులే సుకుంటూ తన గదివైపు నడవసాగారు జడ్జిగా రు.

'చిన్నచిన్న విషయాలు వాటంతట అవే సర్దుకుంటాయి. పెద్ద పెద్ద ప్రాబ్లమ్సు సాల్వుకా వడమే అసలు మెయిన్ ప్రాబ్లమ్! అక్కడికది పూర్తయింది కదా, ఇక్కడికిది అనగా ఎంత?'

అని వారికివారే సరిపుచ్చేసుకుని శుభ్రంగా నిద్రకుపక్రమించుతూ మెత్తటి పరుపుమీద సుఖంగా వాలిపోయారు.

హాయిగా ప్రశాంతంగా నిద్రపోయారేమో - క్లబ్బుకు వెళ్లకుండానే, గేమ్సు ఆడకుండానే, హేపీగా స్కాచ్ తాగకుండానే దాదాపు దైనంది నజీవితానికి భిన్నంగా ఆరోజు సంచరించా రేమో, తెలతెల్లారి నాలుగు గంటలకల్లా మెలు కువ వచ్చేసింది.

మత్తు వదలని మనకవెన్నెల సిగ్గుపడు తోంది. ప్రియునిస్పర్శ తప్పించుకుని వెలుగు రేఖలు బద్ధకం ఒదిలించుకుంటున్నాయి. తెలిపోతున్న మంచుతో మంచుముసుగులో దాగుండిపోయిన లైట్లతో వాతావరణం స్నిగ్ధను

కుమారంగా వుంది.

ఇకరోజువారీ కార్యక్రమం మొదలెడదామని లేచి కాసేపు అటూ ఇటూ పచార్లు చేసారు. సడెన్‌గా వారికి కూతురూ - కోడలూ గుర్తుకు వచ్చారు. గాభరాగా వారివారి గదుల్లోకి వెళ్లారు.

అక్కడ కోడలు, ఇక్కడ కూతురు - ఎవరి గదుల్లో వారు, ఎవరి మంచం మీద వారు కూర్చుని, ఆ రోజు పేపర్లు ముందు పడేసుకుని ఆ బొమ్మల మీదే దృష్టి కేంద్రీకరించుకుని కూర్చుని వున్నారు.



ఇక బాగుండదు. ఒకరోజు పూర్తిగా గడిచిపోయింది. ఇంకా పలకరించకపోతే సభ్యతా మర్యాదమాట అటుంచి అన్యాయంగాకూడా వుంటుంది. పరాయిపిల్లకదా మొదటఛాన్సు కోడలుపిల్లకివ్వాలనుకుని ఆ గదిలోకి దారితీశారు.

గది తలుపులు తోయకుండా, కోడలిని పేరుపెట్టి పిలవకుండా ఒక్కక్షణం ఆగారు.

ఆ గది నిశ్చలంగా, భయంకరమైన నిశ్శబ్దంతో నిండివుంది. గాలికూడా కదలడం మానుకుంది. ఆ గదిలో ప్రతివస్తువూ ఏ క్షణాని కేం జరుగుతుందోనని ఊపిరి బిగపట్టుకుని వుంది. నాలుగుగోడలూ బిగుసుకుపోయి భయం భయంగా వున్నాయి.

ఇక తప్పదని జడ్జీగారు లోపలికి అడుగుపెట్టారు. లైటువేసి 'తనరాక మాత్రంచేత వెలుగ స్తుంది' అన్నంత గర్వంగా ఆమెకేసి చూశారు.

తపస్సు భగ్నంకాగా సమాధినుండి లేచినట్టు వులికిపడి లేచింది కోడలు ప్రమీల. పేపరందిన క్షణంనుంచి ఇంతవరకూ కంటికి కునుకులేదు. గొంతులో ఒక మంచినీటి చుక్క లేదు. జుత్తు చెల్లాచెదురుగా రేగివుంది. ముఖం పీక్కుపోయివుంది. నిద్రలేని కళ్లు లోతుగా, చెక్కిళ్లు చారికలతో, పెదాలు పిడచకట్టుకుపోయి, మనిషి కోమాలో వున్నట్టుంది.

ఆమెనలా చూసేసరికి ఇంతటి జడ్జీగారి మనసుకూడా డైనమైటు పేల్చగా వగిలిన హిమపర్వతంలా కరిగి కన్నీటిబొట్లు రాల్చడానికి సిద్ధపడింది. కాని వారు తమాయించుకున్నారు. ఉబుకుతున్న కన్నీటి కెరటాన్ని ఎంతో సాహసంతో నొక్కి వుంచారు.

"అమ్మా! ప్రమీల, ఏవఁమ్మా అలావున్నావ్?" అన్నారు ఎంతో జాలిగా, ఇంకెంతో ప్రేమగా.

ఇరవైగంటల తర్వాత ఆమె మొట్టమొదటిసారిగా గొల్లుమన్నది. అప్పుడే స్పృహవచ్చినట్టు బావురుమన్నది ప్రమీల. అది ఏడుపుకాదు. కట్టల్ని తెంచుకుని, ఒడ్డుల్ని కోసుకుని పొంగుతున్న కన్నీటివాగు. వరదరోదన. అది దుఃఖంకాదు. పెల్లుబికిన మంచులావా! ఫెళ ఫెళ విరిగిన హిమకెరటం!

ఆ హృదయరోదనని, మనోవేదనని వర్ణించడానికి ఏభాషలోనూ పదాలుండవు. ఏ భాషలోనైనా ఎంత గొప్పకవికైనా వాక్యాలు దొరకవు. అదొక కన్నీటి కావ్యం. ఆ దుఃఖగాథకు మన్నూ మిన్నూ గడ్డకట్టుకుపోయాయి. చెట్టూ-చేమా, గట్టూ-పుట్టా ద్రవించి ముద్దకట్టుకుపోయాయి.

ఆమె లేచి నిలబడింది. జడ్జీగారివైపు తిరిగి శిరస్సెత్తింది.

"మామయ్యగారూ! వయసులో మీరు పెద్దవారు. న్యాయమూర్తులు. తప్పు నేనుచేశాను. అదైనా తప్పుకాదని మీ అంతరాత్మకు తెలును. శిక్షించాల్సొస్తే నన్ను శిక్షించాల్సింది. అన్నెం పున్నెం ఎరగని అమాయకుడు. నా కారణంగా అతనెందుకు బలైపోవాలి? సమస్త ఆస్తికీ, సకలవైభవాలకు ఒక్కగానొక్క వారసుడు. అతడు మీకేం అపకారంచేశాడు? అసలు అతడికీ, మీకూ వున్న విరోధం ఏమిటి? నా కారణంగా అతడిని మీరెందుకు అంతం చేయాల్సి వచ్చింది? అంత పౌరుషం దాచుకున్న మీరు. ఒక్కటంటే ఒక్కసారి మీ పుత్రరత్నానికి చెప్పివుండాల్సింది- "నీకో పెళ్లాంవుంది




దాన్ని చూసుకోరా'' అని. అది మీకు చాతకాలేదు. అక్కడ మీకు రాజసం అడ్డొచ్చింది. కాని, అమాయకజీవిని నాశనంచేయడానికి, ఒక నిండుప్రాణాన్ని హరించడానికి మీకే నియమ నిబంధనా అడ్డురాలేదు. మీ వంశపవిత్రత కోసం మరో వంశాన్ని ధ్వంసంచేసి వంశాంకుర మనేదే లేకుండా నిర్మూలనం చేశారు మీరు. అందుకు మీ న్యాయదేవత కళ్లుమూసుకుంది. అక్కడ మీ పగ బుసకొట్టింది. ఇప్పుడా ఇంట్లో చీకట్లు పరుచుకున్నాయి. విషాదం అలుముకుంది. దీనంతటికీ కారణం ఎవరు? ఎవరు? ఎవరు?''

ఆమె ఒక్కసారి పిచ్చిదానిలా అరిచి వెర్రిదానిలా చూసింది. ''ఔను నేనే- నేనే- నేనే- ఆ ఇల్లు పునాదులుతోసహా కూలిపోడానికి. ఆ వంశం నిర్మూలనకావడానికి నేనే కారణం. ఔను... నేనే కారణం నేనే- నేనే- నేనే''

ఆమెనేదో దెయ్యం ఆవహించినట్టు, పూనకం పట్టినట్టు ఒక్కగంతులో పరుగెత్తింది. పులిలా గంతులేస్తూ మెట్లెక్కింది. వడివడిగా మెట్లను తోసుకుంటూ డాబా ఎక్కింది. పరుగు పందాల పోటీల్లోలా పిట్టగోడ చేరుకుంది.

ఈ మనిషి తెప్పరిల్లి, తేరుకుని మామూలు మనిషికావడానికి పదినిమిషాలు పట్టింది. ఇక ఏదో ఘోరం జరిగిపోతుంది అన్న అనుమానం కలగడంతో పెనుభయంతో వెన్నెముక వణికింది. ఒంటిభారం మోసుకుంటూనే అన్నిమెట్లూ ఎక్కి ఆమెను సమీపించబోతున్నంతలో...

ప్రమీల పిట్టగోడ ఒక్కగంతులో ఎక్కడం, అక్కడినుండి ఒక్కవూపులో క్రిందికి దూకడం, కనురెప్పపాటులో జరిగిపోయాయి.

లంగా, చీర మీదికెగసి, అండర్‌వేతో కాళ్లు రెండూ నగ్నంగా, మిగతా భాగంఅంతా చీర పైటా కప్పివేయగా, గాలిలో ఆడుతున్న జుత్తు, మీదికెగిరి ఊగుతున్న పైట, గాలిమేఘాలు ముదుపుతూ ముఖం, ఆమె ఒక రబ్బరుబొమ్మలా, చీరకట్టిన ప్లాస్టిక్ శిల్పంలా, గాలినికోసుకుని, మంచుపొరను చీల్చుకుని, రివ్వురివ్వున కూలిపోతున్న విమానవేగంతో వచ్చి నేలమీద 'దబ్బు'న పడగానే క్రేన్ మీదినుంచి తాళ్లుతెగిపోయిన దిమ్మ నేలమీద పడినట్టయి పెద్దశబ్దం అయింది.

ఆ శబ్దానికి ఇల్లు దద్దరిల్లి అటునుంచి ఇటు కదిలింది. వీధివీధంతా అదిరిపడింది.

ఏంజరిగిందో తెలుసుకునేసరికి భయానకమైన గగుర్పాటుతో ఆయన నిలువెల్లా కంపించిపోయారు. విపరీతమైన భయంతో వణికిపోయారు.

పాపం ఆముసలాయన అంతటి భారీశరీరంతోనూ ముందు డాబామెట్లు, తర్వాత మేడ మెట్లు వడివడిగా దిగి బంగాళా వెనకభాగం చేరుకున్నారు. అప్పటికే నౌకర్లు యావత్తూ అక్కడికి చేరుకున్నారు.

అక్కడి దృశ్యం చూడ్డంతోనే వారికి మూర్ఛవచ్చినంతపనైంది. ఎవరో చేయిపెట్టి కడుపు దొలిచేసినట్టయింది. ముఖం తిరిగి, ఒళ్లు తూలి, భళ్లున వాంతివచ్చినట్టయింది. కెవ్వున కేకవేసి నేలమీద చతికిలబడిపోయారు. కుప్పలా పడిపోయారు.

ఉప్పుబస్తా ఎత్తునుంచి పడి, పిట్లిపోయినట్టు ఆమె చితికిపోయింది. నోటినుంచి, ముక్కులోంచి, కళ్లనుంచి, చెవులనుంచి రక్తం భళ్లున చిమ్మింది. వరదలైపారింది. నేలంతా చిక్కని వెచ్చని రక్తం చెంబులతో దిమ్మరించినట్టుంది. ఆ నెత్తుటికొలనుమధ్య ఆమె చించివిసిరేసిన ఎర్రని బొమ్మలా అమాయకంగా వుంది. ఆ కళ్లు ఇంక తెరిచేవుండి, ఇంతకంటే మంచిలోకాన్ని కుళ్లు, కుట్ర, కపటంతెలీని అమాయకపు లోకాన్ని వెతుకుతున్నట్టున్నాయి. ఈలోకపు దౌర్జన్యానికి బలైపోయిన కన్నెగులాబీ మరోప్రేమ బతికివున్న లోకాన్ని వెతుకుతున్నట్టున్నాయి. ఈ పాపిష్టిలోకంలో ఇమడలేకపోయినట్టు నిశ్చలంగా, ప్రాణరహితంగా పడివుందామె.

నౌకర్లు జడ్జీగారిని మీదికెత్తి ధైర్యం చెప్తున్నంతలో ఆయనకు ఒక్కసారి కూతురు గుర్తుకువచ్చింది. మళ్లీ అంతేవేగంతో కూతురుగదిని సమీపించారు.

ఆ గదిలో గాలికూడా స్థంభించిపోయి బెంగతో బితుకుబితుకుమంటున్నది. ఆయన కీడుశంకించి ఆదుర్దాగా తలుపులు తోసుకుని, లోనికి వెళ్లి లైటు వేసారు. వేసిచూడబోతే ఆమె ఎలావుంది!?

కదిపితే పడిపోయే శవంలా వుందామె.





Spectra Pleasant




Spectra Pleasant

ఆమె కనురెప్పలు ఆడకుండా పేపర్‌మీదనే కేంద్రీకరించి వున్నాయి.

ఆ చూపులు తన ప్రియుని ఫొటోమీద నిలిచివున్నాయి. ఆ కళ్లు గత ఇరవైగంటలూ ఏడ్చిఏడ్చి వుబ్బివున్నాయి. నిద్రలేమిచేత ఎర్రగా, లోతుగా మండుతున్న కాగడాల్లా వున్నాయి. ముఖమంతా పీక్కుపోయివుంది. జుత్తు చెదిరి, మనిషి అలసిపోయివుంది. రోజురోజంతా తిండిలేనికారణంగా నీరసించిపోయి నిస్సత్తుగా వుంది.

జడ్జిగారికి ఏడుపొచ్చినంతవనైంది. ఇక నిభాయించుకోడం వారికి కష్టమైపోతున్నది. ఒక్కగానొక్కకూతురు. తల్లిలేనిపిల్ల. తానే తల్లయి పెంచినపిల్ల. "అమ్మా! ప్రసూనా ఏమిటమ్మా ఇది" అన్నారాయన. అంతే అంతే! అంతకుమించి ఇంకేమీ అనలేదు.

బీభత్సంగా లేచిందామె. త్రాచులా లేచిందామె. ఏడ్చిఏడ్చి నీళ్లింకిపోయిన కళ్లు చండ్రప్రచండంగా నిప్పుల్ని కుమ్మరించాయి. ఆ చూపులనుంచి మేకులు- బాకులు- తుపాకీతూటాలు దూసుకువస్తున్నాయి. ఆమె అసహ్యంగా, జుగుప్సతో, మహావేగటుగా, ఒక విషజంతువును చూసినట్టుగా చీదరించుకుంటూ విసురుగా పేపరు ఆయనమీదికి విసిరేసింది.

"నీచుడా! నువ్వు మనిషివా? మృగానివా? న్యాయమూర్తివా? రాక్షసుడివా? ప్రేమజంటను విడదీస్తే అది పాపమనీ, ఆ ఉసురు శాపంగా నీకు తగుల్తుందనీ తెలీదా? ప్రేమపక్షుల్లో మగపక్షిని వేటగాడు బాణంవేసి కూలిస్తే ఆడపక్షి భోరుభోరున విలపించి, మంటల్లోదూకి చచ్చిపోయిన కథను నువ్వు చదవలేదా?"

"నావాడిని చంపేస్తే దాన్ని దిగమ్రింగి, నువ్వుతెచ్చే సోమరిపోతుని, దుక్కబలిసిన మోతుబరిని చేసుకుని, ఆ సంపన్నుడితో కులికి, నరగాలాడి గతాన్ని మరిచి, నీ హోదాని, స్టేటస్‌ని మురిపిస్తాననుకున్నావా? మనసొకరికిచ్చి, మనువొకర్ని ఆడి 'దేనిదారి దానిదే' అని సంబరపడిపోయేదాన్ననుకున్నావా?

డబ్బును కొలబద్దగా, హోదాని, అంతస్థుని తూనికరాళ్లుగా ఎంచుకునే నీకేమిటి తెలుస్తుంది మనసు విలువ, అదున్నమనిషి విలువ. ప్రేమను పూచికపుల్లకింద కొట్టిపారేసే మీకు, డబ్బుతో కాపురంచేసి, డబ్బునే పిల్లల్నిగా కనే నీకు ఎలా తెలుస్తుంది ప్రేమ విలువ? డబ్బుతోనే స్నేహంచేసే మీలో ఎలా నిలుస్తుంది ప్రేమ?

ప్రేమ... అది వరవళ్లుతొక్కే ప్రవాహం. ఈ జగాన్ని ఆజరామరంచేసే మంత్రశక్తి. రెండు హృదయాల్ని కలిపి శాశ్వతంచేసే రాగబంధం. నిఖిలలోకాన్ని కాంతివంతంచేసే అద్భుతసృష్టి. సకలజనావళికి ప్రాణవాయువు అందించే మహత్తరశక్తి. అది మనిషిని తీవ్రవరుస్తుంది. శక్తివంతంచేస్తుంది. త్యాగధనులుగా మలుస్తుంది. అంతగొప్పది ప్రేమ.

వెళ్లిపోముందు ఇక్కణ్నించి. నా కంటిముందు అసలు కనిపించొద్దు. నీకు పుట్టడమే ఒక శాపంగా ఎంచి, ఆ పాపానికి తగిన ప్రాయశ్చిత్తం చేసుకోనియ్యి. ఆయన చావుకి కారకురాలిగా నన్నునేను శిక్షించుకోనియ్యి. నువ్వు రొచ్చుగుంటలాంటి తీర్పరి సింహాసనమీద కూర్చుని, ఎంత అక్రమంగా, ఎంత అవినీతిగా తీర్పుఇస్తావో, నాకు నేనిచ్చుకునే తీర్పుద్వారా నిరూపిస్తాను. న్యాయదేవత విలువనిలబెడతాను. కళ్లు తెరిపిస్తాను.

వెళ్లు ముందిక్కణ్నించి. మరొక్కక్షణంకూడా నా కంటిముందు నిల్చోవద్దు. ఫోముందు. బయటికిఫో"

ఒక్కవూపులో అతివిసురుగా ఆయన్ని బయటకు తోసేసింది.

పాపం ఆ ముసలాయన చేతులుడికి పోయివున్నాడేమో, ఆ వరాకున అల్లంతదూరాన అరుగుమీదకి తుళ్ళిపడిపోయాడు. శిరస్సు నేలకు తగిలి ఫెళ్లుమన్నది.

ఆయన బయటపడ్డమే తరువాయి భళ్లున తలుపేసుకున్నదామె.

ఆ తలుపువేసే తీరుబట్టి వారు కీడు శంకించారు. లేవాలని తీవ్రప్రయత్నం చేశారు గాని ఆ షాక్‌నుంచి కోలుకోనందున లేవలేకపోయారు. అరుద్దామనుకున్నా కూడా గొంతు పూడ్చుకుపోయింది.

అంతే! అలా ఒక్క నిమిషం జరిగిందో లేదో-

ఎర్రని మంట నిప్పులు చిమ్ముకుంటూ అతి తీక్షణంగా, చండమారుత వేగంతో తలు




పునందుల్లోంచి దూసుకువచ్చి, ఫెళ్లున సాచి లెంపకాయకొట్టినట్టు ముఖాన వేడిగా గుద్దింది. భగ్గున మండింది.

ఈ హఠాత్సంఘటనకు జడ్జిగారు నిశ్చేష్టులైపోయారు. అతిప్రయత్నంమీద సత్తువంతా కూడదీసుకుని "అమ్మా... ప్రసూనా" అని దిక్కులు పిక్కటిల్లేటట్టు గావుకేకవేసి లేవబోయి మళ్లీ కిందపడిపోయారు.

ఆ చావుకేకకి ఇల్లుయిల్లంతా వణికిపోయింది. భూమి అదిరిపోయింది.

ఆకేకకి సిబ్బంది యావత్తూ పరుగెత్తుకొచ్చింది. క్షణాలమీద జరిగిపోయిన మరో ఘోరకలికి తల్లడిల్లిపోయారందరూ.

తలుపులు దబ దబ బాదారు. కాని అవి తెరుచుకోలేదు. లోపల గెడపెట్టి వుంది. అందరి సత్తువా ఉపయోగించి బలాన్ని కేంద్రీకరించినా అవి విడిపోలేదు.

అత్యంత అధునిక సదుపాయాలుగల భవనమది. అక్కడ రోకళ్లూ, గొడ్డళ్లూ వుండవు. వాటిని సంపాదించుకురావడానికి టైముపట్టింది.

ఈలోపల మంటలు తగ్గిపోయాయి. సన్నని మూలుగు ఆగిపోయింది.

బలవంతంగా తలుపులు విడగొట్టారు. అవి పెచ్చులుపెచ్చులుగా విడిపోయి తెరుచుకున్నాయి. గదిలో చీకటి. గదినిండా పొగ. ఒక్క పదినిమిషాల తర్వాత పొగ విడిపోయింది.

అక్కడ ఏం మిగిలివుంది చూడ్డానికి?

పిడుగుదెబ్బకు మాడిపోయినట్టు అప్పుడే వికసిస్తున్న ఒక ముద్దమందారం, ఓ భగ్నప్రేమికురాలు, కాడల్ని తెంపేసుకుని, రెమ్మల్ని రాల్చేసుకుని, ఆకుల్ని కోసేసుకుని వాలిపోయింది. నేలకూలిపోయింది. మాడి మసిబారి పొడిఅయిపోయింది. ఎర్రిపేర్రిన బొగ్గుల బొమ్మలావుందామె. చూపరుల కళ్లకు దిగ్భ్రమ కలిగిస్తూ అసలైన ప్రేమకు నిఖార్సయిన సాక్షిలా మిగిలివుందామె.

ఆ ఘోరదృశ్యం చూడలేక బండబారిన ఆయన రాతిగుండె నుంచి కూడా అశ్రుకణాలు చిందాయి. తన నిర్ణయం ఏవిపరీత పరిణామాలకు దారితీసిందో వారికి అర్థమైపోయింది. జరగాల్సింది అంతా జరిగిపోయింది. చేయి దాటిపోయింది. ఇప్పుడు విచారించి ప్రయోజనం లేదు. ముందు కర్తవ్యం ఆలోచించాలి.

చిమ్మచీకట్లు చెదిరిపోయాయి. వెలుగురేఖలు విచ్చుకున్నాయి. నిజం ముందు భయపడిన అబద్ధంలా కాంతి ముందు అంధకారం పటాపంచలైంది.

భూమిమీదకు కాంతి కిరణాల్ని సున్నితంగా తనతో తీసుకువస్తున్న బాలభానునితోపాటు చావుకేకలేస్తూ అంబులెన్సు, భీతావహం సృష్టిస్తూ, మరణ రోదనతో పోలీసుజీపు జనాన్ని చెల్లాచెదురు చేస్తూ వచ్చాయి.

ప్రాథమిక దర్యాప్తు, ఫొటోలు తీయటం లాంటి తతంగాలు పూర్తయిపోయిన తర్వాత అంబులెన్స్‌లో ఎక్కించడానికి రెండు శవాల్ని ఒక్క దగ్గరకు చేర్చారు.

ఇవన్నీ జరిగేసరికి ఎనిమిదిగంటలు కావస్తున్నది.

సరిగ్గా అదేసమయంలో విమానవేగంతో ఒకజీపు దూసుకువచ్చింది. డ్రైవర్‌సీట్లో వున్న వ్యక్తి జీపు ఆగీ ఆగకముందే ఒక్కగెంతు గెంతి మెరుపువేగంతో వరండామీదికి దూకాడు.

అతడు జడ్జిగారి ఒక్కగానొక్క కొడుకు నందకిశోర్.

పాటవాటి చెట్టు గొడ్డలివేటుకు నేలకూలినట్టు కొండమీది నుంచి బండ దొర్లినట్టు అడుగు పెడుతూనే ఆ శవాలమీద విరుచుకుపడిపోయాడు నందకిశోర్.

మరో పావుగంట తర్వాత శవాన్ని మోసుకుని పోస్టుమార్టమ్ కోసం అంబులెన్స్ వెళ్లిపోయింది.

న్యాయమూర్తి మందిరం నుంచి అరాచక మంటపానికి పోలీసువ్యాన్ పరుగెత్తింది. ఇపుడు ఇల్లు నిర్జీవంగా, నిస్పందడిగా వుంది. మనుషులు ప్రేతాత్మల్లా వున్నారు.

అప్పుడు అడిగాడు కొడుకు "ఎలా జరిగింది నాన్నా ఇది?"

అప్పుడు చెప్పాడు తండ్రి తరతరాల జన్మ వృత్తాంతాలు.

గునపంలా గుండెను గుచ్చుకుని, పురుగులా మెదడుని దొలిచి వెర్రిగా నవ్వాడు కొడుకు. పిచ్చిగా కంటతడిపెట్టాడు.

''ఒక్కసారి ఒక్కటంటే ఒక్కసారి, ఇది జరగడానికి ముందు నాకు మీరు చెప్పి వుండాల్సింది. అప్పుడు నానిర్ణయమేమిటో మీకు చెప్పేవాడిని. నా అభిప్రాయం కూడా.

అప్పుడు తను మొదటిసారిగా తెలుసుకున్నాడు- తనెక్కడ తప్పుచేశాడో, ఆమెకు ఏంకావాలో, తనేం ఇవ్వలేకపోయాడో. తన నేరం ఎత్తిచూపినట్టయింది; దెప్పిపొడిచినట్టయింది. తనకెంతో బాధ కలిగింది. అప్పుడు నిజంగా తన గుండెలోనే ముల్లుగుచ్చుకున్నట్టయింది. ఎంతో నొచ్చుకుంటూ అన్నాడు-

''ఈ ముల్లుతీయడానికి క్షణం పట్టలేదు గానీ ఆ ముల్లు తీయడానికి కొంతవ్యవధి కావాలి. ఆ వ్యవధి నాకు ఇవ్వు ప్రమీ''

తన మాటల్లో అర్థింపు వుంది. వేడికోలు వుంది.

ఆమె తప్పులేదు. తనకి సంవత్సరం వ్యవధి ఇచ్చింది. కాని ఆ వ్యవధిని తను ఉపయోగించుకోలేకపోయాడు.

''నిన్నెంతగా ప్రేమించానో నీకు చెప్పలేకపోయాను ప్రమీ! అద్దాలబీరువాలో గాజుబొమ్మగా నిన్ను దాచుకున్నాను. పుత్తడిపువ్వులా నిన్ను అపురూపంగా చూసుకున్నాను. ఇంకా రెక్కలు విచ్చుకోని లేతమొగ్గవనుకున్నానుగాని ఇన్ని కోర్కెలతో వూగిపోతావనుకోలేదు; వేగిపోతావనుకోలేదు. తప్పునేను చేశాను. శిక్ష నువ్వనుభవించావు. నా నేరానికి నిన్ను నువ్వే శపించుకున్నావు. బలిచేసుకున్నావు. బంగారు బతుకునే అంతంచేసుకున్నావు. ఇప్పుడు నాకేమిటిశిక్ష''

ఇంతలో అతనికి చెల్లెలు జ్ఞాపకం వచ్చింది. బతుకు చితకగా ఒక మూలకు ఒదిగిపోయి ఎవరిప్రేమకూ నోచుకోకుండా ఎదుగుతూ వచ్చింది. ఇపుడిపుడే తలఎత్తి ధైర్యంగా, ఠీవిగా మనో నిబ్బరంతో, తుళ్ళుతూ నవ్వుతూ కనిపిస్తోంది. నట్టింటిలో ఆ పాదాల వెలుగూ ఇప్పుడు ఆరిపోయింది. ఈ ప్రాంగణంలోని ఆ చిరుదీపం ఇప్పుడు మలిగిపోయింది.

'నువ్వెందుకమ్మా మాడిపోయావు. బొగ్గయి కాలిపోయావు. జీవితంకంటె ప్రేమ గొప్పదని నిరూపించడానికే కాలిపోయావాతల్లీ! నేనొచ్చే వరకైనా ఎందుకు ఆగలేకపోయావమ్మా? ముందుగా ఈ సంగతి నాకు చెప్పివుంటే తండ్రిని ఎదిరించి అయినా, పోరాడి అయినా నీ ప్రేమను నెగ్గించేవాడినే, సుఖాంతం చేసేవాడినే. అంత రహస్యంగా ఎందుకుంచావమ్మా! ఈ అన్నయ్యే నీకు పరాయివాడనుకున్నావాతల్లీ' అని లోలోపలే కుమిలిపోయాడు.

చాలా ఆలోచించిన తర్వాత ఒక అవగాహనకు వచ్చాడు. వెంటనే లేచి కాళ్ళూ చేతులూ, ముఖం కడుగుక్కుని బట్టలు మార్చుకున్నాడు. '' అలా వెళ్ళివస్తాను నాన్నా... మనసేమీ బాగుండలేదు. పోస్టుమార్టమ్ అయి శవాలు ఇల్లు చేరుకునేవేళకే వచ్చేస్తాను. మీరు ధైర్యంగా వుండండి'' అని జీపెక్కాడు.

'కొడుకుకాని అఘాయిత్యానికి తలపడడు కదా' అని ఆ తండ్రి అనుకున్నాడు. అంతలోనే 'మగవాడుకదా- ఆ మాత్రం ధైర్యంవుండకపోదు' అని సరిపెట్టుకున్నాడు.

★ ★ ★

జీపు తిన్నగా డాక్టర్ శ్రీనివాసరావుగారింటి ముందు ఆగింది.

ఆ ఇల్లు ఇపుడు బోసిగావుంది. నిర్మానుష్యంగా వుంది. లంకంతఇల్లు కళాకాంతులు లేకుండా వుంది. పలకరించేవారు, పరామర్శించేవారు వెళ్ళిపోవడంతో డాక్టరుగారు వంటరిగా దిగాలుగా వాలుకుర్చీలో దిండు అమర్చుకుని కూర్చుని వున్నారు. ఉన్న ఒక్క ఆశా రాలిపోవడంతో పక్షవాతంచేసిన మనిషిలా కుర్చీకి అంటుకుపోయివున్నారు. కంటి అద్దాలు ఎండకి మెరుస్తూ కంటికింద నీరు కనిపించనీయడంలేదు.

వారినలా చూడగానే నందకిషోర్ మనసు కకావికలమైపోయింది డిస్పెన్సరీలోనూ, ఇంటి వద్దా. హోదాగలవారితో నిత్యం వారు వయసుకు మించిన ఉత్సాహంతో విరామమెరుగని చిలిపికుర్రాడిలా, రోగుల్ని నవ్విస్తూ నవ్వుతూ ఉండేవారు. ఆ మేరునగధీరుడేనా ఇప్పుడీయన. నమ్మశక్యంకాకుండా వుంది. ఇరవైనాలుగ్గంటల్లో ఎంతమార్పు.

నెమ్మదిగా అడుగులో అడుగేసుకుంటూ. వారిని సమీపించాడు నందకిశోర్. ''నమస్కారం డాక్టరుగారూ'' అన్నాడు ఎంతో వినయంగా.

డాక్టర్‌గారు నెమ్మదిగా తలెత్తి కళ్ళువిప్పి




నందకిశోర్‌ని చూసారు.

యువకుడు! కల్లాకపటం తెలీని అమాయకత్వంతో, నిబ్బరంగా వున్నాడు. గుండ్రని ఆడ ముఖంతో చూడముద్దొస్తున్నాడు. అతడిని అలాచూస్తుండిపోయిన కొడుకు తిరిగొచ్చినట్టనిపించి-

"ఎవరుబాబూ నువ్వు?" అన్నారు ఎంతో మృదువుగా.

"నాపేరు నందకిశోర్. నేను జడ్జి శ్యామసుందరవరప్రసాదమూర్తిగారి అబ్బాయినండి. ఇంజనీర్ని. గవర్నమెంటులో ఉద్యోగంచేస్తున్నాను" అన్నాడు.

"విన్నానుబాబూ- నీపేరు విన్నాను. పైఅధికారుల గుండెల్లో నువ్వు సింహస్వప్నమనీ, నీ వ్యవహారాల్లో నువ్వు చాలా కఠినుడివనీ, కంట్రాక్టర్లకు నీపేరు చెబితే మందుమత్తువిరిగిపోతుందనీ పెద్దవాళ్ళనోటినుంచే విన్నాను" అని కాసేపాగి తిరిగి మరోసారి నందకిశోర్‌ని చూసి- "నిల్చుండిపోయావేం? అలా కూర్చోబాబూ" అన్నారు.

నందకిశోర్ దగ్గరలోవున్న ఒక కుర్చీని వారి ముందుకులాగి కూర్చున్నాడు.

"ఏం... బాబూ నువ్వు కూడా పరామర్శించడానికే వచ్చావా?"

"ఔనండీ... మీకు జరిగినలాంటి దుర్ఘటన మరెవ్వరికీ జరగకూడదు. విధి మిమ్మల్ని క్రూరంగా దెబ్బతీసింది. ఎవరికి అన్యాయంచేసారని విధి మీతో ఇంత అన్యాయంగా ఆడుకుంటుంది? ఈ గాయం ఎవ్వరూ మాన్పలేనిది. ఈలోటు మరొకరు తీర్చలేనిది. ఇంతకీ హంతకుడు ఎవరయినదీ తెలుసుకోగలిగారా?" వివరాలు తెలుసుకుందామని అడిగాడు.

"లేదుబాబూ లేదు. దానిమీద నాకు ధ్యాస లేదు. అది పోలీసువారి బాధ్యత. హంతకుడు ఫలానా అని తెలిసినా నేనేమీ చేయను. నాకాళ్ళు నిరంకుశంగా విరిచివేయబడ్డాయి. గుండె నిర్దాక్షిణ్యంగా కొరికివేయబడింది. ఇక నేనెవ్వరిని సాధించిమాత్రం ఏంప్రయోజనం. వారికి నష్టమేతప్ప నాకు ఒనగూడే లాభం ఏముంది? వాడు బతికివుండి వాడికి అపకారం జరిగితే అప్పుడు ఎంతకైనా తెగించివుండేవాడిని. నాపరువుప్రతిష్ట మొత్తం పణంగాపెట్టి అవతలివాడి అంతుచూసేవాడిని. కాని కూకటివేళ్ళతో నా వంశవృక్షమే కూలిపోయాక ఇక నేనెవర్నయినా ఎందుకు సాధించాలి? సాధించి నేను మిగుల్చుకునేదేమిటి?"

వారిలో నిరాశా నిస్పృహలు ఆవహించుకున్నాయి. యావత్తు ఉత్సాహము చచ్చుబడిపోయింది. ఆయన బతికున్న శవమే అయ్యారు.

ఒక్క పదినిమిషాల మౌనంతర్వాత తిరిగి డాక్టర్‌గారే అన్నారు- "ఈరోజునుంచీ నేను వైద్యవృత్తికి స్వస్తిచెబుతున్నాను. ఇహ స్టెతస్కోప్ ముట్టనని ప్రమాణంచేశాను"

నందకిశోర్ ఒక్కసారి స్థంభించిపోయాడు. నోటమాట పెగలడం కష్టమైపోయింది. "అదేమిటి డాక్టర్‌గారూ... మీవంటి ప్రతిభావంతులే శస్త్రసన్యాసంచేస్తే రోగులేంకావాలి? అన్యాయం మీకు జరిగింది... మీరు రోగుల మీద ఆ ప్రభావం చూపిస్తున్నారు. నేరంచేసినవాడిని వదిలేసి రోగులను సాధిస్తున్నారు. మీరెంతో ఉత్తములు, ఉదారులు. మీ నిర్ణయంగురించి పునరాలోచించమని ప్రార్థిస్తున్నాను"

డాక్టర్‌గారు చాలా తేలిగ్గా నవ్వేసారు. విరక్తిగా నిట్టూర్చారు. "నాగుండె పెకిలించివేయబడినప్పుడు ఎవరిగుండెనయినా నేనెలా సరిచేయగలను?"

ఇక రంగంలోకి దిగకతప్పదని నందకిశోర్ నిశ్చయించుకున్నాడు. నిశ్చయించుకున్నతర్వాత అన్నాడు- "మీకోవిషయంతెలుసోతెలీదో- నేను... ప్రమీల... భర్తని" ఆగిఆగి స్పష్టంగా చెప్పాడు. అలా చెప్తున్నప్పుడు దీని ప్రతిస్పందన ఎలావుంటుందో అనుకుంటూ చెప్పాడు.

ఇంత నిర్వేదంలోనూ డాక్టరుగారిలో చిన్న కదలికలాంటిది వచ్చి సంచలనం ఏర్పడింది. "అదిమాత్రం నాకు తెలీదు. అయితే ఈ హత్యలో నీకూ భాగంవుందాబాబూ" అన్నారు అనుమానంగా. అలావుండకూడదని వారి మనసు ఎందుకో ఆరాటపడుతున్నది.

నందకిశోర్ కంగారుపడ్డాడు. "లేదండి...

ఎంతమాత్రంలేదు. అసలు నాకు ఏమీతెలీదు. ఏమాత్రంతెలిసున్నా ఈ ఘోరం జరగనిచ్చేవాడినికాదు. రెండు నిండుప్రాణాల్ని బతికించేవాడినే; ఈ సమస్యను పరిష్కరించేవాడినే. నాకు తెలీకుండానే మొత్తం కథంతా జరిగిపోయింది'' ఈ విషయంలో అతనెంతో బాధపడుతున్నట్టు అర్థమైపోతుంది.

జరిగిన కథంతా డాక్టర్‌గారి కంటిముందు ఛాయామాత్రంగా గోచరించింది.

''అప్పటికీ నేను చెప్పాను బాబూ... జరిగిందేదో జరిగిపోయింది. పెళ్ళయిన పిల్లతో ప్రేమవ్యవహారాలు సాగించడం మంచిదికాదన్నాను. చాలా ప్రమాదాలకు దారితీస్తుందని కూడా చెప్పాను. వాడు నామాట లక్ష్యపెట్టలేదు. నీ భార్యకూడా ససేమిరా అని మొండికేసింది. నీ నిరాదరణే దానికి కారణంగా చెప్పింది. అయితే ఇక్కడొక యదార్థాన్ని అంగీకరించితీరాలి. నీ పెళ్లికిముందే వారి ప్రేమ మొలకెత్తి చిగురించింది. అది పుష్పించబోతున్న సమయానికి నీతో పెళ్లయింది. అంతే! అక్కడితో బంద్. మనసుమార్చుకుని కట్టినతాళికే కట్టుబడివుండాలనుకుందిట. మావాడైనా కొంత మనసువిరక్తి చేసుకుని ఒంటరివాడైపోయాడుగాని ప్రమీలమాత్రం మనసు రాయిచేసుకుని నీజంటకోసం తహతహలాడింది. అయితే నువ్వామెను నిరాదరణచేశావని బాధపడింది. అప్పటికే ప్రమీల ఎడబాటుతో మావాడు తాగుడుకు బానిసైపోయాడు. ఆ స్థితిచూసి జాలిపడి ఒకవంకా, నీ నిర్లక్ష్యం మరొకవంకా ప్రమీలను ఎడాపెడా ఊపేశాయి. కనీసం ఒక వ్యక్తి జీవితంలో ఆశలునింపవచ్చు, నింపిన ఆశలు పండించవచ్చు- అన్నకరణంతో చివరికి ప్రమీల మావాడివైపే మొగ్గింది. తన జీవితంలో తిరిగి చిగురిస్తున్న ఆనందాన్ని తననుండి శాశ్వతంగా దూరంచేయవద్దని బతిమలాడింది. తనకు మైనారిటీ తీరి నీకు విడాకులిచ్చినతర్వాత తామిద్దరూ పెళ్లిచేసుకుంటారంది. అదీకాక పెళ్లంటూచేసుకుంటే ప్రమీలనే చేసుకుంటానని, లేకుంటే జీవితాంతం బ్రహ్మచారిగానేవుండిపోతానని మావాడు భీష్మించుకు కూర్చున్నాడు. అలాగే వుండిపోయాడు కూడా. ఒక్కగానొక్క కొడుకు- ఆశలదీపం- కన్నతీపి- నా స్వార్థంకూడా ఒకరకంగా నేను మౌనంవహించడానికి కారణమైంది. ఆ కడుపుతీపే ఇన్ని అనర్థాలకు దారితీసింది. కాని ఇప్పుడు అనుకుని ప్రయోజనమేమిటి, అంతా అయిపోయింది. కథే ముగిసింది. తెరపడిపోయింది...''

నందకిశోర్‌కు తన తప్పిదం మెల్లమెల్లగా బోధపడుతోంది. ఇక ఆపుకోలేకపోయాడు- ''మీకీసంగతి తెలుసనుకుంటాను- ఇప్పుడు ప్రమీలకూడా లేదు'' ఇలాచెప్తున్నప్పుడు అతనికంటివెంట రెండు కన్నీటి చుక్కలు రాలాయి.

ఆ రెండు కన్నీటి చుక్కలూ డాక్టర్‌గారి గుండెల్లో రెండు తుపాకీగుళ్ళై పేలాయి. ''అయ్యో'' అని ఒకేఒక్క అరుపు అరిచారు. ఈసారి నిజంగానే డాక్టర్‌గారు చలించిపోయారు. ఆయన హృదయం గిలగిలకొట్టుకుంది. నమ్మలేనట్టుచూసారు.

''మీ అబ్బాయి రాజ్‌మోహన్ మరణంతర్వాత ప్రమీల ఈ విషాదసంఘటనను తట్టుకోలేకపోయింది. మీ అబ్బాయి మరణానికి తను బాధ్యతస్వీకరిస్తూ, దానికి నివృత్తిగా తను మేడమీదినుంచి దూకి ఆత్మహత్యచేసుకుంది''

''అయ్యోపాపం... చిన్నపిల్ల, అమాయకురాలు. ఎంత సాహసంచేసింది. వారిది అమరప్రేమ అని నిరూపించుకున్నారు. కాని నీకే అన్యాయంజరిగిపోయింది. నిన్నెలా అనునయించాలో నాకు తెలీడంలేదు బాబూ'' డాక్టరుగారు గుండెలోతుల్లోంచి సానుభూతిచూపారు.

నందకిశోర్ నిర్వికారంగా నవ్వాడు- ''ఇందులో నా బాధ్యతకూడావుంది డాక్టర్‌గారూ! ప్రమీలకు భర్తగా నేను పూర్తి తృప్తియివ్వలేకపోయాను. నా ప్రయోజకత్వం నిరూపించుకోలేకపోయాను. దెబ్బతిన్నాను... ఓడిపోయాను''

''నీవిషయంలో నేను చాలా దుఃఖిస్తున్నాను బాబూ, నిన్నెలా ఓదార్చాలో నాకు తెలీడంలేదు''

మరొక్క పదినిమిషాలు ఇద్దరిమధ్యా మౌనం పరదాలు పరిచింది. ఆమౌనాన్ని చీలుస్తూ డాక్టర్‌గారితో నందకిశోర్ అన్నాడు, ప్రతిమాట





లూ ఆగిఆగి నొక్కినొక్కిఅన్నాడు- "డాక్టర్‌గారూ! మిమ్మల్ని ఒక్కకోరిక కోరుకుంటాను... మీకు కోపంరాదుకదా?"

ఇంత నిర్వేదంలోనూ డాక్టర్‌గారు నవ్వేశారు- "నువ్వు నాకు పుట్టకపోయినా నా బిడ్డలాంటివాడివి. నీమీద నాకు కోపం ఏమిటిబాబూ? అడగాలనుకున్నదేదో అడుగు"

మరికొంతసేపు ఆలోచించి ఇక తటపటాయింపులకు స్వస్తిచెప్పాడు. దృఢనిశ్చయంతో, స్పష్టంగా ఏ మాటకు ఆ మాట విడదీసిచెప్పాడు- "నన్ను మీకొడుకు స్థానంలోవుండనిస్తారా. నన్ను మీరు కొడుకుగా చూసుకుంటారా?"

డాక్టర్‌గారి గుండెల్లో పిడుగులుపడ్డాయి. నోటమాటరాలేదు. కొంతసేపు తర్వాత తమాయించుకుని "అంతత్యాగం నువ్వు చెయ్యొద్దుబాబూ! నువ్వు చేసినా నేను భరించలేను. నాది కాని ఏవస్తువూ నాదీ అనుకునే మనస్తత్వం కాదునాది. నాది కానిదాన్ని నాదానిగా నేను భావించలేను- అది నా బలహీనత. కాకపోతే నా సమస్త ఆస్తికీ సర్వహక్కుదారుడిగా నిన్ను చేస్తాను. దానికి నాకెటువంటి అభ్యంతరంలేదు. దీన్ని నువ్వు మరోవిధంగా భావించకు... పూర్తి సమ్మతితోనే చెప్తున్నాను" చాలా సౌమ్యంగా చెప్పారు.

నందకిశోర్ వికారంగా నవ్వాడు- "ఆస్తికోసమే అయితే నేనింతదూరం రానవసరంలేదు డాక్టర్‌గారూ! ఇపుడు నాకున్న ఆస్తి తక్కువదికాదు. నా ఇంజనీర్ ఉద్యోగం దీనికి పదిరెట్లు తెచ్చిపెడుతుంది. శరీరంమీద కత్తిపెడితేగాని మీకు న్యాయంగా డబ్బురాదు. కాగితంమీద సంతకంపెట్టి మీకు రెట్టింపు అవినీతిగా నేను సంపాదించగలను"

"నువ్వు నన్ను అపార్థంచేసుకున్నావుబాబూ" ఎంతగానో నొచ్చుకున్నారాయన.

మళ్లీ కొంతసేపు ఆలోచించి గట్టినిశ్చయంతో మీదికి లేచాడు నందకిశోర్. "సరే... దీనికికూడా నేనే పరిష్కారంచెప్తాను. చెప్తాను కాదు... చేసి చూపిస్తాను"

అతను లేచాడు. ఒక్కొక్క అడుగూ బలంగావేసుకుంటూ ముందుకు నడిచాడు. ద్వారంవరకూ వెళ్లి అక్కడ ఆగాడు. ఒక కాలు ద్వారానికవతల, మరొక కాలు ఇవతలవేసి నిటారుగా నిలబడ్డాడు. రెండుచేతులూ ఫాంటుజేబుల్లోకి దూర్చాడు.

తర్వాత రెండుచేతులూ తీశాడు. అతని వెనకభాగం డాక్టర్‌గారికి స్పష్టంగా కనిపిస్తోంది. అతనలారెండు నిమిషాలు ఆగాడు. రెండు నిమిషాలుతర్వాత-

ఉన్నట్టుండి ఒక్కసారిగా పిస్టల్‌పేలిన శబ్దం వినిపించింది. తర్వాత పిస్టల్ కిందపడిపోయింది. అతను రెండుచేతులూ ఎత్తి ద్వారం రెండువైపులాచాచి గట్టిగా పట్టుకుని కిందపడిపోకుండా నిలబడటానికి ప్రయత్నిస్తున్నాడు. అయినా నిలువలేకపోతున్నాడు.

డాక్టర్‌గారు ఈ హఠాత్సంఘటనకు కొయ్యబారిపోయారు. నిలువెల్లా వణికిపోయారు.

నందకిశోర్ ద్వారాన్ని పట్టుకున్న రెండుచేతులూ అంగుళం అంగుళం జారుతున్నాయి. మనిషి అంచెలు అంచెలుగా కిందికి ఒరుగుతూ నేలకూలబోతున్నాడు. ఛాతీనుంచి రక్తం ధారలా కారిపోతోంది.

మరో రెండునిమిషాలతర్వాత, పట్టుచాలించేసి కిందికిజారిపోయాడు. వెల్లకిలాపడిపోయాడు.

డాక్టర్‌గారు కరెంటుషాకు కొట్టినట్టు లేచి నందకిశోర్‌వైపు పరుగెత్తారు. పడిపోతున్నవాడిని పట్టుకున్నారు.

"ఎంతపనిచేశావుబాబూ, చాలా తప్పుచేసావు నాయనా!"

నందకిశోర్ ఆయాసంతో మూలుగుతూ అన్నాడు- "ఒక్కసారి భార్యచేతిలో ఓడిపోయినవాడు జీవితంలో మరెందులోనూ నెగ్గలేడు డాక్టర్‌గారూ! చివరిసారిగా నేనొక్కకోరిక కోరుకుంటాను. దాన్ని నెరవేరుస్తానని వాగ్దానంచేస్తారా?" అన్నాడు రొప్పుతూ.

"తప్పకుండా!"

"డాక్టర్‌గారూ... కొడుకు మీది ప్రేమతో నాతండ్రి తప్పుచేశాడు. మీ కొడుకును మీకు లేకుండాచేసాడు. ఇప్పుడు అతనికొడుకుని నేను లేకుండా చేశాను. కాని... మీకు తెలియదు. కొడుకులా చూసుకోవడానికి అతనికి ఒక కూతురుండేది. ఇప్పుడు ఆ కూతురు కూడా లేదు. విఫల ప్రేమతో ఈరోజే ఒంటికి నిప్పంటించుకుని ఆత్మహత్య చేసు

కుంది. ఈ రెండు ఆత్మహత్యలు పదినిమిషాల వ్యత్యాసంలో ఒకేసారి జరిగాయి. అందుచేత డాక్టర్‌గారూ, వంశాంకురాలనేవిలేక, వున్నా పోగొట్టుకుని మీరిద్దరూ ఒకేస్థితిలో వున్నారు. మరి మా నాన్నగారి తరపున మిమ్మల్ని నేను వేడుకుంటున్నాను. ప్రార్థిస్తున్నాను. మా నాన్నగారిని మీరు క్షమించగలరా?'' చేతులు రెండూ జోడించి నమస్కరించాడు.

డాక్టరిగారి హృదయం ద్రవించిపోయింది. కళ్లు అశ్రుపూరితాలయ్యాయి. ''తప్పకుండా బాబూ... నా కోపాన్నీ దుఃఖాన్ని కూడా దిగమింగి అయినా మీ నాన్నగార్ని కాపాడతాను. ఈ విషయంలో ఆయనకెలాంటి ప్రమాదం సంభవించనివ్వను. నిండుమనసుతో నీకు వాగ్దానం చేస్తున్నాను. అభయమిస్తున్నాను - నన్ను విశ్వసించు''

నందకిషోర్‌కు కళ్లు చెమర్చాయి. తడితో మెరిశాయి. పెదాలమీద తృప్తి తొంగిచూసింది. వదనంలో వింతసంతోషం తొణికిసలాడింది. 'తనపై విపరీత ప్రేమచేత ఇంత విపత్తు కోరితెచ్చుకున్న తండ్రిమీద జాలి కలిగింది. హోదాకోసం, అంతస్తుకోసం, పలుకుబడికోసం కుటుంబాన్నే పణంగాపెట్టి జీవితజూదంలో ఘోరంగా ఓడిపోయారు. దారుణంగా దెబ్బతిన్నారు. ఆయనకు కొంతలో కొంతయినా న్యాయం కలగజేయడం కొడుకుగా తన కర్తవ్యం. తమ అందమైన భవిష్యత్తుమీదా, ఎన్నో తియ్యనైన ఆశలగూడులు కట్టుకుని, అవి చెల్లాచెదురై, నింగినుంచి నేలకు రాలిపోయాయి. రచించుకున్న రంగులచిత్రాలు నీటిబుడగల్లా పేలిపోయాయి. గాలిబుడగల్లా చిది



కపోయాయి. విలవిల్లాడిపోతున్న ప్రాణిగా దిక్కుతోచక దారికానక అల్లల్లాడిపోతున్న జీవిగా ఆయనకు కొంత ఊరట కలిగించడం కొడుకుగా తన బాధ్యత.

హాస్పిటల్లో ఆఖరిశ్వాస విడుస్తూ తండ్రిని ఓదార్చాడు. "నీకు అన్యాయం జరిగిపోయింది నాన్నా. నువు ఏకాకివైపోయావు. ముందూ వెనకా నీకు తోడెవ్వరూ లేకుండాపోయారు. ఇప్పుడు నీ కోసమే నువ్వు బతకాల్సివుంది. నీ తర్వాత నీ పేరు చెప్పుకుని నీ ఆస్తి పంచుకోడానికి ఎవ్వరూ లేరు నాన్నా. నువ్వు పెంచినందుకైనా వుగ్గుపాలలో ప్రేమను రంగరించి పంచిచ్చినందుకైనా, నీ రుణం తీర్చుకుని వుండాల్సింది. కాని విశ్వాసఘాతకుణ్ని కృతఘ్నుణ్ని నీకు చెప్పకుండానే వెళ్లిపోతున్నాను. నన్ను మన్నించు నాన్నా. నేనెలాగో నీ కొడుకును కాను. కాని కొడుక్కోసం ఎందుకు బెంగపెట్టుకుంటావ్. కాని కొడుకు లేడనుకో. పెంచిన ప్రేమ ఆశలవిత్తునాటి వాటి ఫలాల కోసం ఎదురుచూసి మోసపోయావు. నేను మోసగాణ్ని. నన్ను క్షమించు నాన్నా. నీ ప్రేమ అందనంతదూరం వెళ్లిపోతున్నాను నేను'

ఇలా చెప్పకలిగినందుకు నందకిశోర్ గుండెలో వెచ్చని ఆనందం చోటుచేసుకుంది. కాని ఈ మాటలతో జడ్జిగారి హృదయంలో అగాధం మరింత తొలుచుకుపోయింది. శూన్యం మరింత విస్తృతమైంది.

డాక్టరిగారింట్లో జరిగిన సంఘటన యావత్తూ వారు చెప్పగా జడ్జిగారు తెలుసుకుని వున్నారు.

మేజిస్ట్రేటు ముందు - 'తన భార్య మరణంతర్వాత బతుకుమీద విరక్తితో, కావాలని చేసుకున్న ఆత్మహత్య'గా మరణవాఙ్మూలం ఇచ్చి తనువు చాలించాడు. శాశ్వత నిద్రలోకి జారిపోయాడు. అందనంతదూరం వెళ్లిపోయాడు.

ఇరవైనాలుగు గంటల వ్యవధిలో రెండు హత్యలు, మూడు ఆత్మహత్యలు జరగడంతో ఇదో సంచలనవార్తగా దావానలమై వ్యాపించింది.

అయితే డాక్టరుగారి పలుకుబడిముందు, జడ్జిగారి హోదాముందు త్వరగానే ఇదంతా చప్పబడిపోయి నీరుగారిపోయింది.

★ ★ ★

తను కోడలిని నాశనం చేద్దామనుకోలేదు. అసలు ఆ ఉద్దేశమే తనకు లేదు. కాని ఆమె శాపకారణంగానే తన వంశం నిర్మూలనమైంది. తనను ఒంటరివాడినిచేసి ఇన్ని అనర్థాలకు కారణమైంది.

ఆ కోడలుపిల్ల ఈమెగాని కాదుకదా!

పోనీ కొడుకు పోతేపోయాడు. కూతురైనా మిగిలితే ఆమెనే కొడుగ్గా చూసుకుని,ఆమెకు పుట్టిన అంకురాన్ని తన బిడ్డగా చేసుకుని వంశాన్ని నిలబెడదామనుకున్నా ఇప్పుడా కూతురు కూడా లేదే. ఆమె కూడా శపించినట్లు తనను ఏకాకినిచేసి, బతుకు దుర్భరంచేసి కసిగా తప్పుకుపోయింది.

ఆ కూతురు ఈమెగాని కాదుకదా!

ఆ ఇద్దరూ ఈ ఒక్కరూపంలో తనను పీక్కుతినడానికి దయ్యమైరాలేదుకదా!

జడ్జీగారు కెవ్వున కేకేసి మెలికలు తిరిగిపోతూ కుర్చీవెనక్కి జారిపోయారు. కాళ్లూచేతులూ కొట్టుకుని కర్రలా విరుచుకుపడిపోయారు. ఒక్కపళంగా కుర్చీమీదినుండి నేలమీదకు దబ్బునపడి తెలివితప్పిపోయారు.

ఈ హఠాత్సంఘటనకు కోర్టుహాలంతా నివ్వెరపోయింది. నల్లకోట్లూ, తెల్లకమీజూలు కొయ్యబారిపోయాయి. ఆ షాక్‌నుంచి తేరుకుని సమీపించేలోపునే వారు కుర్చీమీదనుంచి కిందికి ఒక్కపెట్టున పడిపోవడం, తెలివితప్పిపోవడం చూస్తుండగానే జరిగిపోయాయి.

క్షణం ఆలస్యం చేయకుండా వారిని మృదువుగా ఎత్తిపట్టుకుని నెమ్మదిగా మోసుకుంటూ ఛాంబర్లోకి తీసుకువెళ్లారు. అక్కడ సోఫాలో పడుకోబెట్టి తలకింద దిళ్లువుంచి ఫాను స్పీడు పెంచారు.

ఈలోగా డాక్టర్‌కి ఫోనువెళ్లింది.

★ ★ ★

గతచరిత్ర యావత్తూ ఫ్లాష్ లా జడ్జీగారికి ఒక్కసారి కళ్లముందు పునరావృత్తమైంది. ఆ షాక్‌నుంచి వారు తేరుకోడానికి పావుగంట పట్టింది. శరీరమంతా చెమటలు పట్టేసింది విపరీతమైన భావోద్రేకంతో వూగిపోయారు.




"చూడు మిస్టర్ సుందరం ఇది పరిస్థితి. జడ్జిగారు వయసులో మనకంటె పెద్దవారు. వారిమీద మనం జాలిచూపించవచ్చు. లేదా వారి వయస్సుని మనం గౌరవించవచ్చు.

"ఇంత చేసీ నువ్వాపిల్లను ఎందుకంత ఘాటుగా ప్రేమిస్తున్నావో అర్థంకాదు. ఆమె ఒక వ్యభిచారిణి. పోనీ ఈ పిల్ల ఎగ్జంప్షన్ అనుకో. అమాయకురాలు, మంచిదీ- మోసపోయింది. ఎక్కడో నూటికో కేసుఇలాంటిది తగిలినంత మాత్రాన మొత్తం వ్యభిచారులందరూ మహానీతి మంతులంటేనే నొప్పుకోను. పోనీ వాదనకు అంగీకరించినా మమ్మల్నేం చేయమంటావు. చట్టం అలా వుంది. అమలు పర్చాల్సిన బాధ్యత మా మీదుంది. ఇందులో మేం స్వతంత్రించి చేయాల్సిందేంలేదుకదా! నువ్వు ఊకొట్టాలేగాని లక్షల రూపాయల కట్నంలో, అందంతో ఇంతకుమించిన అమ్మాయి, మచ్చలేనిది నీకు దొరుకుతుంది. పోనీ అభ్యుదయ భావాలతో త్యాగం చేయదలచుకుంటే ఈ పాటి పిల్ల మరొకర్తి నీకు దొరక్కపోదు. బాగా ఆలోచించు.

"తీగలాగితే డొంకంతా కదుల్తుంది. మొత్తం మా అందరి బతుకులూ బజారునపడటం అటుంచి, ముందు ఉద్యోగాలకు ఉద్వాసన. తర్వాత కటకటాల లెక్కింపు. ఆ పిమ్మట ఎంక్వైరీలు. నీవు తప్పించి మమ్మల్ని రక్షించగలనాథుడెవడూలేడు. ఆ విధంగా మా జీవితాల్ని కాపాడిన వాడివవుతావు. నీ పట్ల డిపార్టుమెంటు అంతా ఎంతో కృతజ్ఞతగా వుండి; ఎప్పుడు నువ్వొచ్చినా నీ పనులు చకచక జరిగిపోతాయి, ఎంతో మర్యాదగా మనలుకుంటుంది. ఇదీ నేను చెప్పేది.

"అయినా సరే కాదంటావా, చెప్తాను విను. జడ్జిగారు దీనినొక ఛాలెంజ్‌గా తీసుకుని మిగిలిన జడ్జీలకు, మాజిస్ట్రేటులకూ చెప్పి నీ కేసులు నాలుగు వరసగా ఏదో సెక్షన్ కారణం చెప్పి కొట్టివేయించేగలరు. అప్పుడు నీపనేమౌతుందో ఆలోచించు. పార్టీలు నిన్నొక అపశకునంగా చూస్తారు. నువ్వు ఎదటపడితేనే కీడుగా భావిస్తారు. కోర్టులో నిన్ను అందరూ అంటకుండా, ముట్టకుండా తప్పుకు తిరుగుతారు. జడ్జిగారినే ఖాతరు చేయనంతటి గొప్పవాడివి నువ్వని, గుమస్తాలు, బంట్రోతులు కూడా నయాపైన అంత విలువ కూడా సికవ్వరు. నీవని ఏదీ ఒక పట్టాన తెమలదు. అప్పుడు నువ్వెక్కడుంటావో, లాయరుగా నీ స్థానం ఎక్కడ వుంటుందో వూహించుకో.

"ఇక మా సంగతంటావా, ఈ క్షణాన ఏదో ఒక నేరం మోపిగాని, మోపకగాని నిన్ను మూసేయగలం. ఇరవైనాలుగ్గంటలు తిరక్కుండా మాఫీ చేయగలం. ఓటర్ల జాబితా నుంచే కాదు. జననమరణ రిజిష్టరులోంచి కూడా నీపేరు తీయించేయగలం. అసలు నువ్వంటూ ఒకశాల్తీ పుట్టనేలేదనగలం. నువ్వు మాకు అనుకూలంగా వుంటే నీ రికమండేషన్లన్నిటినీ అంగీకరించి నీప్రతిష్ఠ పెంచగలం. లేదా వందిని చూసినట్టు చూసి నిన్ను పాతాళంలో తొక్కేయగలం. బుద్ధిగా వుంటే పెద్దవార్ని గౌరవించినట్టూ వుంటుంది. డిపార్టుమెంటుకి మర్యాద ఇచ్చినట్టు వుంటుంది. అదీ సంగతి. ఏ సంగతీ నువ్వు బాగా ఆలోచించి రేపు చెప్పు. విష్‌యూగుడ్‌లక్'

జడ్జిగారికి షాక్ తగిలిందని తెలుసుకుని పరామర్శించడానికి వచ్చిన యస్.పి.గారు సంగతంతా తెలుసుకున్నమీదట. కుర్రప్లీడర్ని పిలిపించి తగువిధంగా వార్నింగ్ ఇచ్చారు. మృదువుగానే చెప్పి ఆపిమ్మట తగు మోతాదులో హెచ్చరించారు.

మరునాడు కోర్టుకు వచ్చిన జడ్జిగారు కార్లోంచి దిగి, తిన్నగా ఛాంబర్లోకి వెళ్లి, అక్కడ కాసేపు విశ్రాంతి తీసుకుని, ఆ తరువాత కోర్టు హాల్లోకి వచ్చారు. వారి వెంట సొంత డాక్టర్‌గారు కూడా వున్నారు.

జవాన్ల సాయంతో వరాలు కుంటుకుంటూ వేలాడుతూ వచ్చింది. రౌడీ దెబ్బలకు కండరాలు కదిలిపోయాయి. పోలీసు దెబ్బలకు నరాలు తెగిపోయాయి. జైల్లో లాఠీ దెబ్బలకు ఎముకలు విరిగిపోయాయి. ముక్కు కదిలి పగిలిపోయింది. కనుగుడ్డు ఒక దాంట్లో రక్తం గూడుకట్టుకుని ఇప్పుడా కన్నుకనిపించడంలేదు. ఆ భాగమంతా వుబ్బి నల్లగా కమిలిపోయింది. చర్మం తట్టుదేరింది. ఒక పక్క బుగ్గ పొంగి, ఎరుపు నలుపు కలిపిన రంగులో మాడిపోయి బీభత్సంగా వుంది. మీదిపెదవి



తెగిపోయి, కంది పెదవిచిట్లి పుండులా వుంది. మొత్తానికి ఆ ముఖం,ఆమె శరీరం యాసిడ్ పోసి కాల్చేసినట్టు పరమభయంకరంగా వుంది.

ఇప్పుడామె రేపోమాపో అన్నట్టుంది. కొన్ని వేల పిడికిళ్ల దెబ్బలు, కొన్ని వందల లాఠీ దెబ్బలు కొన్ని పదులబెల్టుదెబ్బలు చూసిన ఆమె శరీరం ఒక్కసారంటె ఒక్కసారి కూడా డాక్టర్ చేయి తాకిన సందర్భంలేదు. ఒళ్లంతా కవుకుదెబ్బలకు వాచివాచి వుబ్బిపోయి సగం కాలిన శవాన్ని తీసుకొచ్చి కోర్టులో నిలబెట్టిన ట్టుంది. మొత్తానికి ఆమె ఇక రేపోమాపో అన్నట్టుంది. అప్పుడే ముఖంలో చావు కళ తొంగిచూస్తూంది. ఆ దీపం కొడిగట్టుకుపోతు న్నది.

కెమేరాలు చుట్టూ తిరిగాయి. ఫ్లాష్‌లు తళుక్కుమన్నాయి. విలేకరులు ఉషారుగా తిరుగుతున్నారు. చేతిలో పాడ్లు తెరుచుకు న్నాయి. వేళ్లసందుల్లో కలాలు మూతలు విడ దీసుకున్నాయి.

"యస్... ప్రొసీడ్" అన్నారు జడ్జిగారు, గొంతు పెగలడంలేదు. గాలి వదిలిన బంతిలా నీరసించిపోయి వున్నారు. ఆ కళ్లలో పూర్వపు కాంతిలేదు. ఆ చూపుల్లో మునుపటి దర్పంలేదు. ఆ ముఖంలో మొదటిరోజు భేష జంలేదు.

సత్యసుందరంలేచి నిల్చున్నాడు. ఒక్కసారి హాలుచుట్టూ చూశాడు. హాలంతా నిశ్శబ్దంగా వుంది. పోలీసు బలగం మహాఆతురతగా వుంది. బెంచీల మీద కూర్చున్న ముద్దాయి తరఫువాళ్లు, సాటి అభాగినులు, చుట్టూ చేరిన ప్రేక్షకులు మహా ఉత్కంఠతో వున్నారు. అందరి చూపులూ అతని మీదనే ఫోకస్‌చేసి వున్నాయి. ఆ క్షణాన అతనోవిధాతగా, నిర్ణేతగా వారికి గోచరించాడు.

పోలీసు బలగం, కోర్టు సిబ్బంది, న్యాయ బృందం 'అతనేం చెప్తాడోనని ఆసక్తిగా ఎదు రుచూస్తున్నారు. అతడు చెప్పే మాటలమీద తమ నిర్ణయాలు ఆధారపడి వుంటాయి. అందుకోసం వారు గుండెలు బిగపట్టుకుని వినడానికి సిద్ధపడుతున్నారు.

అంతమందిని ఒక్కసారి చూసిన అతను అప్పటికే సగం చచ్చిపోయివున్నాడు. తనను తాను చంపుకోడానికి సిద్ధపడి వున్నాడు. చేత లుడిగిపోయి, ముఖం మాడిపోయి మెల్లగా ఈదుకుంటూ, ఈసురోమంటూ వెళ్లినట్టు జడ్జిగారి ముందుకు వెళ్లాడు. తన వకల్తానా మాను, ఇతర కాగితాల్ని వారి ముందు వుంచా డు.

"నేను వాదించాల్సింది ఇంతకుముందే వివరించడం జరిగింది. ఇప్పుడు నేను కొత్తగా చెప్పాల్సిందేమీలేదు. సో... నేనీకేసునుంచి ఉపసంహరించుకుంటున్నాను" అనేసి ముఖం పక్కకు తిప్పుకుని వచ్చి తన సీట్లో కూర్చుండిపోయాడు.

ఒక్కసారి ఫ్లాష్‌లు ఆగిపోయాయి. కెమేరా లు ఆగిపోయాయి. కలాలు ముడుచుకుపో యాయి. ఎక్కడివాళ్లక్కడ శిలాప్రతిమల్లాని ల్చుండిపోయి. ఆ ఒక్కక్షణం హాలులోనూ, ఆవరణ చుట్టూ అతిభయంకరమైన నిశ్శబ్దం రాజ్యం చేసింది. ఘోరకలిఒక్కటంటె ఒక్క ని మిషం విశ్వరూపం చూపించింది.

బెంచీలమీద కూర్చున్న గ్రామ జనం, తోటి అభాగినులు బెంచీ కింద టైంబాంబు పేలిన ట్టు ఠక్కున లేచినిల్చుండిపోయారు. విద్యార్థు లు, యువకులు, ప్రేక్షకులు, వారి వారి నాయ కులు 'ఔరా' అని ముక్కుమీద వేలేసుకున్నా రు. 'న్యాయం గూర్చి మాట్లాడే ఈ న్యాయవా దులే న్యాయానికి అసలుసిసలు శత్రువులు' అనుకున్నారు. న్యాయవ్యవస్థ మీదే వారికి రోతపుట్టింది. జుగుప్సకలిగింది. వ్యతిరేకత ఏర్పడింది. తమను తమదేశాన్ని ఈ న్యాయం రక్షించలేదు. అన్న నిర్ణయం నాటిపోయింది.

రెచ్చిపోయిన జనం నినాదాలు చేశారు. 'అన్యాయం, అక్రమం, అబద్ధం ఆమె నిర్దోషి. ఈ లాయర్ వంచకుడు. ఈ కృత్రిమ న్యాయం నశించాలి. పోలీసులు ముర్దాబాద్' అన్నారు. బయటనుండి అల్లరిమూక రాళ్లువిసిరింది న్యాయవాదులు, విలేకర్లు, కెమేరామన్లు తమ నుతాము రక్షించుకోడంలో పడిపోయారు. పరి స్థితి అదుపుతప్పింది. పోలీసులు గాల్లో తూటా లు పేల్చారు.

★ ★ ★

తిరిగి కట్టుదిట్టమైన పోలీసు బందోబస్తుతో




విచారణ మొదలైంది.

ఈసారి హాలు ప్రశాంతంగా వుంది. హాలంతా ఒక్కసారి ఊపిరిపీల్చుకుంది. అందరి ముఖాల్లో సంతోషం విచ్చుకుంది. అందరి పెదాలమీదా చిరుదరహాసం విన్యాసం చేసింది. కాగలకార్యం గంధర్వులే తీర్చినట్టయింది.

వాతావరణంలో వచ్చిన ఈ మార్పు చూసి ఎందుకో ఆమె కీడు శంకించింది. ఇప్పటి ఈ పరిస్థితి రాబోయే పరిణామానికి, ఏర్పడబోయే విపత్తుకు దిక్సూచిలా ఆమె కనులముందు కనిపించింది. అతిచిన్న దారపుపోగంత ఆశ యింతవరకూ మిగుల్చుకుంది. ఇప్పుడు దాన్ని కూడా తెంపేసుకుంది.

తను మూడోసారి, చివరిసారిగా మోసపో యిందన్నమాట. మొదటిసారి 'కళ్యాణవేదిక మీద మోసపోయింది. రెండోసారి 'రక్షణ మందిరం'లో మోసపోయింది. ఇప్పుడు ఆఖరి సారిగా 'న్యాయమంటపం'లో మోసపోతోంది.

అన్నివైపుల నుంచి అన్నిశక్తులూ మిన్నా గులై బుసలుకొడుతున్నాయి. కాలనాగులై కా టువేయడానికి పొంచివున్నాయి. ఇప్పుడు తనేం చేయాలి? ఇన్ని దుష్టశక్తుల మధ్యతనేం చేయగలుగుతుంది. ఏం చేసినా ఎలా నెగ్గుకు రాగలుగుతుంది.

ఇది కోర్టు... ఇది శ్మశానం! అది జైలు... అది నరకం! వారు పోలీసులు... వారే యమభ టులు, రాక్షసస్వరూపులు!

ఈ పాపం చూడలేక, ఈ నేరం మోయలేక, ఈ గాయం భరించలేక ఆమె కన్నులు మూత పడుతున్నాయి. శరీరం తూలి, తేలిపోతున్నది. ఆమె కంటిముందు సకలప్రపంచమూ కదిలి పోతున్నది. కలిసిపోయి, కరిగిపోయి, ము ద్దయి మాసిపోతున్నది. రెప్పలు బరువుతో మూతలుపడుతున్నాయి.

ప్రాసిక్యూషన్‌వారు హుషారుగా లేచారు. శివుడిచుట్టూ మూడుసార్లు తిరిగేసి తెలివిగా, ప్రపంచాన్ని జయించి వచ్చిన విఘ్నవీరుల్లా పోజుపెట్టారు. అవతలివారి బలహీనత మీద ఎదురుదెబ్బతీసి 'శకుని' మాయాజూదంలో నెగ్గిన సుయోధనునిలా బోరవిరిచారు.

"మిలార్డ్... స్వయంగా ఈ కేసును భుజాల మీద వేసుకున్న గౌరవనీయులైన లాయర్‌గారే పట్టు వదిలేశారంటే కేసు ఎంతటి బలహీన మైనదో తమకు ఈసరికి అర్థమైవుంటుంది.

"ఈమె జగమొండి. ఈ వ్యాపారంలో రాటు దేలిన నెరజాణ! ఈమె అధీనంలో కనీసంపా తిక మంది అమ్మాయిలైనా వుంటారు. అంత మంది అమాయక బతుకుల్నిచిదిమి బలిచేసి వారి ఉసురుపోసుకున్నాక ఇప్పుడు పాపం బద్ధలైంది- చాలా తెలివిగా సంవత్సరాల తర బడి పోలీసుల కళ్లుకప్పి ఇటు నుంచి బొంబా యికి. అటునుంచి విదేశాలకు ముఖ్యంగా అరబ్, గల్ఫ్‌దేశాలకు హోల్‌సేల్ ఎగుమతి వ్యాపారం అతి పకడ్బందిగా నిర్వహించిన ఘటికురాలు. ఈమె చేయరాని ఘోరంలేదు. ఈమెకు పాపమంటే అసలు తెలీదు. నీతి, న్యాయమంటే అసలు భయంలేదు. ఎందరో కన్నెపిల్లలను హరించి బజార్లో వేలంవేసింది. మరెందరో అమాయకుల్ని హత్యచే యించింది. ఎన్నోమంగళసూత్రాలు తెంపేసి, మరెన్నో నల్లపూసల్ని రాల్చేసింది.

"మరునాడు కొత్త సంవత్సరం అనగా ఎందరో ఉత్సాహవంతులైన యువకులు పాత సంవత్సరానికి వీడ్కోలు, నూతన సంవత్సరాని కి స్వాగతం చెప్పడానికి వేడుకలు జరుపుకు న్నారు. ఈమెనుండి అధికానందం ఆహ్వా నించారు. ఈమె తన కలుపుమొక్కల్లోని మేలి మి పుష్పాలు ఏరి వారివారి వినోదాలకు సర ఫరా చేసింది. ఈవిధంగా యువతరాన్ని పాడుచేస్తున్నందుకు ఖిన్నుడైన స్థానిక రిక్షా కార్మికనాయకుడు సూరిబాబు ఈమె ఆటలకు అడ్డుపడ్డాడు. విద్యార్థిలోకం, యువతరం, మత్తుపదార్థాలతో, చెడు అలవాట్లలో కొట్టుకు పోతున్నది చాలక వారిని ఈమె ఆరకంగా ప్రోత్సహిస్తున్నందుకు ఎదురునిలిచాడు. యు వతరాన్ని నిర్వీర్యం చేసే ఈమె అక్రమపద్ధతు లు అరికట్టడానికి ధీరోదాత్తంగా సాహసించా డు ఆ సూరిబాబు. యువకుడు, ఉత్సాహ వంతుడు, రిక్షా వారిగుండెల్లో నిత్యం వెలుగు తున్న దీపం- ఆ దీపాన్ని ఆరోజు ఈమె ఆర్పివేసింది. సరియైన సమయం చూసి ఆ సూరిబాబును ఆ రాత్రి తన రౌడీగాంగ్ చేత హత్యచేయించింది. రాత్రికి రాత్రి ఆ శవాన్ని

అక్కడనుంచి తరలించి సముద్రంలో పారవేయించింది. సాక్ష్యాధారాలతో ఈ కేసు తమ ముందు ఉంచబడింది. ఆ ఘన కార్యాన్ని స్వహస్తాలతో నిర్వహించి, తర్వాత పశ్చాత్తాపంతో డబ్బుకక్కుర్తికి ఈ ఘోరానికి పాల్పడ్డట్టు అంగీకరించి 'అప్రూవర్స్'గా మారిన సాక్షులు, ఈ అప్పిగాడు, అతనిద్దరి స్నేహితులు- మొత్తం కేసు తమ ముందున్నది.

“మొత్తం జాతినంతటినీ రోగగ్రస్తంతో నిర్వీర్యంచేస్తున్న ఒక దగాకోరు మోసకత్తె, జాతిద్రోహి, వంచకి నలభై ఎనిమిది సంవత్సరాల నూకరాజు అనే ఈమె శిక్షకై తమముందు నిలబడి వున్నది. ఈమెకు మరణశిక్ష విధించడం ద్వారా దేశాన్ని తద్వారా జాతిని రక్షించి ఇలాంటివారి బారినుంచి విముక్తి ప్రసాదించవలసినదిగా కోర్టువారిని వినమ్రపూర్వకంగా కోరుతున్నాను”

అందరూ తనవైపు చూస్తున్నారోలేదోనని ఒకసారి గమనించి, అందరి చూపులూ తన మీద వున్నాయని నిర్ధారణచేసుకుని అందరి చేతా శభాష్ అనిపించుకుంటూ తన ఆసనంలో కూర్చున్నారు పి.పి.గారు. హాలులో మారుమోగుతున్న చప్పట్లమధ్య తనను తానే అభినందించుకున్నారు.

ఇందులోని రహస్యం ఒక్క పోలీసువారికి మాత్రమే తెలుసు. కోర్టువారికి అందిన రిపోర్టులు సత్యసుందరం దగ్గరుండి ఇప్పించిన సాక్ష్యాలేగాని, ఆయన దగ్గరవుండి రాయించినవికావు. అవి ఎప్పటికప్పుడు మారిపోతూ వచ్చాయి. ఆయన పెట్టించిన సంతకాలు కూడా మార్పుకు అందనంతగా ఫోర్జరీ చేయబడ్డాయి. ఫలితంగా సాక్ష్యం అతను ఇప్పించినదే అయినా ఫలితాలు తలకిందులైపోయాయి. ఈ సందర్భంలో ఓ పావు లకారం వరకూ చేతులు మారింది.

ఇక జైల్లో వరాలుకు శిక్షణ తరగతులు నిర్వహించారు. లాయర్ వున్నప్పుడు సరిగా వుండి ఆయన వెళ్లిపోయిన తర్వాత తనమీద జరుగుతున్న ఈ పాశవిక దాడికి వరాలు ఆశ్చర్యపోయేది. ఈ సంగతి ప్లీడర్‌గారికి చెప్పవద్దని, అలా చెపితే ఈ దాడియింకా ఎక్కువవుతుందని జైలు జవానులు హెచ్చరించడంతో వరాలు ప్రాణభీతితో సత్యసుందరంకు చెప్పడం మానివేసింది.

ఇంతలో హాల్లో కలకలం బయల్దేరింది. జనంలో సందడి మొదలైంది. కోలాహలం ఆరంభమైంది.

వరాలు మీద మోపబడిన ఈ నేరాలుగాని, ఆపాదించబడిన ఈ ఘోరాలుగాని ఆమె విన్నట్టు కూడా కనిపించలేదు. ఆమెకు అర్థంకాని విషయం ఒక్కటే- సాటివారు చెప్పగా విన్నదేమంటే యాభయ్యో వందో జరిమానాగాని వారమోరెండువారాలో జైలు శిక్షగాని పడాల్సింది, వెంటనే తెమిలిపోవాల్సింది, చిలికి చిలికిగాలివానలా ఈ కేసు ఇంతలా ఎందుకు సాగింది.

ఇప్పుడివన్నీ ఆమె ఆలోచించే స్థితిలో లేదు. అన్నిపట్టుదలలూ చాలించేసుకుని ఒక్కొక్క అంగుళం జారిపోతూ కూలిపోతున్నది నిస్సత్తువుగా. ఇక ఈ లోకాన్ని చూడాల్సిన పనిలేనట్టు తలవాల్చేసుకుంది. కొనప్రాణంతో మనిషి చచ్చుబడిబోతున్నది. అపరిమితమైన భయంతో వొణికిపోతూ కాళ్లూ చేతులూ చల్లబడిపోతున్నాయి. అంతిమశ్వాస విడవడానికి సిద్ధంగా వుంది. చేతుల్లో పట్టువదిలేసి మనిషి డబ్బున కిందపడిపోయింది.

ఈ హఠాత్పరిణామానికి సత్యసుందరం నిశ్చేష్టుడైపోయాడు. కొయ్యబారిపోయాడు. ఒక్కవూపున లేచి ఒక్క అంగలో బోనులోపడివున్న వరాలును సమీపించాడు. ఆక్షణంలో ఏదో శక్తి అతణ్ని ఆవహించింది. మనిషంతా మలేరియా జ్వరం వచ్చినట్టు వూగిపోయాడు.

“మీరు మనుషులా రాక్షసులా? మీలో మానవత్వమనేది అణుమాత్రం కూడా లేదా? ఇంత చిన్నపిల్ల మీద అంతలేసి నేరాలు మోపడానికి మీకు 'సిగ్గు'అని కూడా అనిపించలేదా? మీమధ్య జంతువులు కూడా మనలడానికి సిగ్గుపడతాయి. కౄరమృగాలు కూడా మిమ్మల్ని వెలివేస్తాయి. పెద్దపులులు కొండచిలువలు మొసళ్లు కూడా మిమ్మల్ని చూసి భయపడతాయి. అలాంటి మీలో కలుపుకోవాలని వలపన్నారు మీరు.

“నేను అసలు దుర్మార్గుణ్ణి, హంతకుణ్ణి. ఈ నేరంనాది, ఈ పాపంనాది. నేను చేసిన దారుణానికి నువ్వు బలైపోయావు వరం! నా కారణంగా నువ్వు హింసించబడ్డావు. వందో యాభై




య్యో జరిమానాగాని, వారమో రెండు వారాలో శిక్షగాని పడివదిలిపోయేదానికి, ఈ కేసును ఇంతసాగదీసి ఇప్పుడు నీ చావుకు కారణమౌ తున్నాను. ఎంత శిక్షించినా ఈ పాపం తీర దు... నన్ను క్షమించొద్దు'' అంటూ అతను రోదించాడు.

వరాలు మెల్లగా బరువుగా కళ్లెత్తింది. అత ణ్ని మనకమనకగా చూసింది. పాలిపోయిన నవ్వు వచ్చీరాకుండా నవ్వబోయింది. నూతిలో గొంతులా హీనస్వరంతో అంది-

''చూడండి లాయర్‌గారూ... నేను ఏమీ తెలీనిదాన్ని నేను తప్పులుచేయలేదు- మీకు తెలును. పెద్ద చదువులు చదివారు. అన్నీ తెలిసున్నవారు తప్పులు చేయకూడదు. కాని చేస్తారు. ఎందువల్ల? బాగా చదువుకున్నందు వల్ల, మీ చదువు మీకు అబద్ధాలు మప్పు తుంది. అక్రమపద్ధతులు నేర్పుతుంది. తెలివి తేటల్లోంచే తప్పులుపుడతాయి. అమాయక త్వం నుంచి తప్పురమ్మన్నా రాదు. అయినా మీరేం చేస్తారు? మీకు చాతనయినంతవరకూ నన్ను రక్షించడానికి ప్రయత్నించారు. కాని చెయ్యలేకపోయారు. నన్ను వంగతీసినవారే మిమ్మల్నీ లొంగదీసారు. తెలీక నేను వారిగో తిలో పడ్డాను. తెలిసి మీరు వారి ఉచ్చులోపడ్డా రు. మీరు నాకు కావాలని హాని తలపెట్టలేదు. అలాంటప్పుడు మిమ్మల్ని నేను క్షమించే ప్రశ్నేలేదు.''

ఆమెలోని దీపం ఆరిపోతున్నదని స్పష్టంగా తెలిసిపోతున్నది. అతని కళ్లవెంట ధారాపా తంగా కన్నీరు వర్షిస్తోంది.

ఆమె శరీరం చల్లబడిపోయింది. తలవా ల్చేసింది. ప్రాణాలు మరిరాని దూరతీరాలకి వెళ్లిపోయాయి.

★ ★ ★ ★

మంటలు... మంటలు...

రక్తంలో ముంచితీసినట్లు మరింత ఎరుపె క్కి జ్వాలాయమానంగా మండిపోతున్న మంటలు.

ఒక మంచితనాన్ని ధ్వంసం చేసి, ఒక అమాయకత్వాన్ని నాశనంచేసి, ఒక సౌశీల్యా న్ని- సౌకుమార్యాన్ని చిదిమేసి, లాలిత్యాన్ని లావణ్యాన్ని తెంపేసి ఆనందతాండవం చేస్తు న్న వారినేంచేయని మంటలు. వెన్నెల బూడి దైపోవడానికి అది ముగింపు ఘట్టం.

పోలీసుల వధఘట్టన నిర్దాక్షిణ్యంగా మోగిన వేళ, ఒక అమాయకత్వం మరణించిన వేళ, కోర్టు వికృతంగా తీర్పు ఇవ్వబోయినవేళ, ఒక మంచితనం తనువుచాలించిన వేళ, ఆకులు రాలిపోయి రెమ్మలు ఒదిగిపోయి కసాయికోర లు నిరంకుశంగా పుప్పొడిలో గుచ్చుకునేవేళ, తళత్తళలు మెరిసే విచ్చుకత్తులు గుండెల్లో నిర్దాక్షిణ్యంగా దూసుకుని చెల్లున రక్తంచి మ్మించి కసిగా నవ్వుకున్నవేళ...

ఒక పూబోడినేల రాలిపోయింది-

వికసించబోతున్న ఒక పారిజాతం పాశవి కంగా నేలకూల్చబడింది-

ఒక కుసుమకోమలి అధ్యాయం మొదట్లోనే అంతమైపోయింది-

మంటలు... మంటలు నిజాన్ని దహిస్తు న్నాయి; వరాలు శవాన్ని దహిస్తున్నాయను కుంటున్నాయి.

ఆడదాన్ని చుట్టూకమ్మేసి నిస్సహాయవు ఆడదాని మీదినుంచి ఉద్రిక్తంగా పైపైకి ఎగ సిపోతున్న మంటలు.

అన్నీ అచేతనంగా చూస్తూ నిల్చుండిపో యాడు సత్యసుందరం. తన ఉత్సాహఉద్రేకా లు మంటల్లో కాలిపోగా, తన ప్రతిభాసామర్థ్యా లు విశ్వమంతా వెక్కిరించేలా వెన్ను చూపగా, నిలువెల్లా కృంగిపోతూ స్తబ్ధుగా వుండిపోయా డు. అణువణువూ దహించుకుపోతూ నిర్జీ వంగా నిలబడ్డాడు.

పెద్దరికం అతని ప్రతిభ మీద కాటువే సింది, బ్యూరోక్రసీ అతని ఉద్రేకం మీద నీళ్లు కుమ్మరించింది. భవిష్యత్తు భయపెట్టింది. అవకాశం అతని బతుకునుంచి తప్పుకున్నది.

ఆ మంటల చుట్టూ వలయాకారంలో నిల్చు న్నది చిన్నా పెద్దా ఆడామగా మునలీ ముతకా ఆ గ్రామ ప్రజానీకం- అక్కడ అన్ని వయసుల వారున్నారు; అన్ని కులాలవారున్నారు; సమస్త జాతులవారున్నారు; సకల మతాలవారున్నా రు; ఆ చావువారిని ఏకంచేయగా నేపథ్యంలో ఆమెకు చెప్తున్నది మౌనంగా కన్నీటి వీడ్కోలు. ★

# పఠన ముత్యాలు

★ నీలో దయ, సానుభూతుల్ని పెంచుకో. మనసు నిష్కల్మషంగా ఉంచుకో. నీకు తప్పక ఆత్మానందం లభిస్తుంది. నీవు కూడా విశ్వశాంతికి కారకుడవవుతావు.

— స్వామి శివానంద

★ ఒక మంచి పుస్తకాన్ని మొదటిసారిగా చదివినప్పుడు ఒక కొత్త స్నేహితుణ్ణి సంపాదించుకున్నట్టుగా ఉంటుంది. రెండవసారి చదివితే పాతస్నేహితుణ్ణి కలిసినంత ఆనందంగా ఉంటుంది.

— గ్లాడ్‌స్టన్

★ వేదాంతం అంటే ఏమిటి? అదొక జీవన విధానం, జీవిత కళ. మనం ఎలా నడుచుకోవాలో, ఎలా జీవించాలో తెలిపేదే వేదాంతం. గురిచూసి బాణం విడిస్తే అది లక్ష్యాన్ని చేరుతుంది. జీవితంలో 'గురి' చూపేదే వేదాంతం.

— సెనెకా

★ 'ధర్మం' అనే వస్తువును అమాంతంగా గుప్పెట్లో పట్టేసుకుందామని మానవులు ఆతృతపడుతుంటారు. కాని అది అంత తేలికగా లభ్యమయ్యే వస్తువుకాదు. జీవితపు అంత్యదశలో దుఃఖాలన్నీ ముగియవచ్చినప్పుడు వేదనాపూర్వకమైన హృదయంమీద ధర్మదేవత ఒంటరిగా వచ్చి నిలుస్తుంది.

— శరత్

★ గడిచిపోయిన కష్టాలను స్మరించుకో. అనుభవిస్తున్న సుఖాల తీయదనం పెరుగుతుంది.

- కాల్టన్

★ ఎన్నో కష్టాలు, నష్టాలు అనుభవించిన తరువాత కాని మానవునికి వినయం, వివేకం అబ్బవు.

— ఫ్రాంక్లిన్

★ ప్రపంచంలో రెండే రెండు విషయాలకు సిగ్గుపడాలి. ఒకటి వ్యసనం, రెండవది అజ్ఞానం. ఈ రెండింటినీ తొలగించుకుంటే ప్రపంచంలో ఎక్కడా, ఎందుకూ సిగ్గుపడాల్సిన అవసరం ఉండదు.

-ఎర్ల్.ఆఫ్.ఛెస్టర్‌ఫీల్డ్

★ నీమాటలవల్ల, చేతలవల్ల ఇతరులలో రాణింపు పొందడం కష్టం. ఎందుకంటే నువ్వు వారికంటే అధికుడవైనా అయ్యుంటావు లేదా అల్పుడవైనా అయ్యుంటావు. కనుక ప్రశంసలు, విమర్శలు లెక్కచెయ్యకు.

— గ్రెవెల్

సేకరణ: **నల్లబెల్లి శ్రీమన్నారాయణ**




★ "చతుర"లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక
కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక
పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచ
టంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా,
మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువగాకుండా ఉండాలి. వ్రాతప్రతిలో వారి వారి
దస్తూరినిబట్టి,ఒక పేజీకి ఎన్ని పదాలు వస్తున్నాయనేదానినిబట్టి మొత్తం నవల పేజీలకు
ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవు
తాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో,
అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికగాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటు తగుపోస్టేజీని
జతపరచాలి. వ్రాత ప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా
బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ
విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలోనే పంపబడుతుంది.

ఎడిటర్

# చతుర

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482.



# చతుర ఫీచర్

ముత్యాలు కేవలం మనుషులకే అలంకారప్రాయంగా మిగిలిపోక మన నానుడిలోనూ కలిసిపోయాయి. ముత్యాలవంటి మాటలు, ముత్యాలవంటి బిడ్డలు, ముత్యాలవంటి పలువరున, ముత్యాల ముగ్గులు- ఇలా భాషలో కూడా స్థిరపడిపోయాయి. స్వచ్ఛంగా, తెల్లగా, నున్నితంగా వింతకాంతితో మెరిసే ఈ ముత్యాలకు వజ్రాలు, కెంపులు, పగడాలు, పచ్చలు మొదలైన నవరత్నాలలో ఒక ప్రత్యేక స్థానం ఉంది.

వీటిని ఆభరణాల్లో అలంకారంగానేగాక ఆయుర్వేద, యునాని మందుల తయారీలో కూడా వాడతారు.

స్వాతికార్తిలో ముత్యపు చిప్పల్లోపడ్డ వాన చినుకులే ముత్యాలుగా మారతాయనీ, దేవతల కన్నీళ్లే ముత్యాలనీ ఇలా కొన్ని నమ్మకాలు వాడుకలో ఉన్నా అవి కేవలం కవుల ఊహలే. నిజానికి ముత్యాలు దేవతల కన్నీటి చుక్కలనేకన్నా నీటిలో పెరిగే ఓ చిన్నప్రాణి విషాదాశ్రువులుగా చెప్పుకోవడం సబబేమో!

ముత్యపు చిప్పలో పొరపాటున ఇసుకరేణువుల్లాంటి చిన్న కణాలు ఏవైనా ప్రవేశిస్తే, ఆ ముత్యపుచిప్పలో వున్న ప్రాణి అసౌకర్యానికి లోనవుతుంది. అపుడు దాని శరీరంనుండి 'నెకర్' అనే కాంతివంతమైన ద్రవాన్ని స్రవిస్తుంది ముత్యపు చిప్పలో అలా ప్రవేశించిన ఈ చిన్న పదార్థాన్నే 'న్యూక్లియస్' అంటారు. ఈ 'న్యూక్లియస్' మీద 'నెకర్' పొరలుపొరలుగా పేరుకొని క్రమంగా ముత్యం తయారవుతుంది. ఇలా రూపొందే సహజముత్యాన్నే 'నేచురల్ పర్ల్' అంటారు. వీటికి పర్షియాదేశం ఒకప్పుడు ప్రసిద్ధి. వీటినే 'ఓరియంట్ పర్ల్స్' అనికూడా అంటారు.



# మురిపించే ముత్యాలు



ముత్యపు చిప్పలు విరివిగా ఉండే పర్షియా, అరబ్ దేశాల సముద్రతీర ప్రాంతాల్లోనే ఒక దశలో పెట్రోలు కూడా విరివిగా లభించనారంభించడంతో ఆ పెట్రోల్ ఈ ముత్యాల పరిశ్రమను దెబ్బతీసింది. పెట్రోలుకు గిరాకీ పెరిగి పెట్రోలు పరిశ్రమ వృద్ధిచెందినకొద్దీ తీరప్రాంతాల్లో నీటి కాలుష్యం ఎక్కువై పోయింది. దీంతో ముత్యపు చిప్పలు క్రమంగా అంతరించిపోయాయి. ఆవిధంగా సహజంగా లభించే 'నాచురల్ పర్ల్స్' తగ్గిపోవడంతో కృత్రిమంగా 'కల్చర్డ్ పర్ల్స్'ను తయారుచేయనారంభించారు. ప్రస్తుతం నాచురల్ పర్ల్స్ పూర్వకాలపు ఆభరణాల్లోనూ, మ్యూజియమ్‌లలోనూ మాత్రమే ఉన్నాయి. మార్కెట్లో మనకు లభ్యమవుతున్నవి జపాన్, చైనా దేశాల్లో తయారయిన 'కల్చర్డ్ పర్ల్స్' మాత్రమే.

1888లో జపాన్‌దేశానికి చెందిన కొకిచిమికిమోటో అనే ఓ వ్యాపారి ముత్యపు చిప్పలో ఓ చిన్న ఆల్చిప్ప ముక్కను ప్రవేశపెట్టి, ముత్యం తయారవుతుందేమో నని ప్రయోగాలు మొదలుపెట్టాడు. 1893లో అతని శ్రమ ఫలించి అయిదు ముత్యాలు ఆవిధంగా తయారయ్యాయి. దాంతో అవి ''మికిమోటో ముత్యాలు''గా ప్రపంచప్రసిద్ధిచెంది అతను కోటీశ్వరుడయ్యాడు. 1913లో 'హకిచినిషికావ' అనే శాస్త్రజ్ఞుడు కల్చర్డ్ పర్ల్స్‌ను తయారుచేయడంలో అనేక సాంకేతిక విషయాలను ప్రయోగపూర్వకంగా రుజువుచేశాడు. దానితో 1920 నుండి ప్రపంచపు ముత్యాల వ్యాపారం పూర్తిగా 'కల్చర్డ్ పర్ల్స్' మయంగా మారింది.

'నాచురల్ పర్ల్స్‌కూ, కల్చర్డ్ పర్ల్స్‌కూ తేడా కేవలం న్యూక్లియస్ ముత్యపు చిప్పలో ప్రవేశించడంలోనే ఉంటుంది. న్యూక్లియస్ ముత్యపుచిప్పలో ప్రవేశించాక ముత్యం తయారయ్యేవిధానం మాత్రం రెండింటిలోనూ ఒకేపద్ధతి. నాచురల్



పర్ల్స్‌లో ఇసుకరేణువు లేదా చిన్న ఆల్చిప్ప ముక్కవంటిది ముత్యపు చిప్పల్లో అనుకోకుండా ఆకస్మికంగా ప్రవేశిస్తుంది. కల్చర్డ్ పర్ల్స్ విషయంలో న్యూక్లియస్‌ను ముత్యపు చిప్పలోనికి ప్రత్యేకంగా ప్రవేశపెడతారు. దీనికితోడు ముత్యపు చిప్పల ను ప్రత్యేకంగా పెంచుతూ కనిపెట్టి ఉంటారు.

కల్చర్డ్ పర్ల్స్ తయారుచేయడానికి ఆరోగ్యవంతమయిన, దాదాపు 20 గ్రాములు బరువుండే ముత్యపు చిప్పలోనికి 'న్యూక్లియస్'ను ప్రవేశపెడతారు. ఈ పనిని చాలా జాగ్రత్తగా ప్రత్యేకమైన ప్రయోగశాలలో నిపుణులైన సర్జన్స్‌వంటివారు మాత్రమే చేయగలరు. తరువాత వాటిని ప్రత్యేకమైన ఫామ్‌లో పెంచుతారు. కొన్ని సంవత్సరాల్లో న్యూక్లియస్‌మీద నెకర్ వేలాది పొరలుగా ఏర్పడి క్రమంగా ముత్యం తయారవుతుంది. నెకర్ పొరలు ఎంత ఎక్కువగా ఉంటే ముత్యం అంత కాంతివంతంగా ఉంటుంది. ఒక ముత్యపు చిప్పలో ఒకే న్యూక్లియస్‌ను ప్రవేశపెడితే పెద్ద ముత్యం తయారవుతుంది. మూడు లేదా నాలుగు న్యూక్లియస్‌లు ప్రవేశపెడితే చిన్నచిన్న ముత్యాలు తయారవుతాయి.

న్యూక్లియస్ ఆకారాన్నిబట్టి రూపొందే ముత్యం ఆకారం ఉంటుంది. ఉదాహరణకు 'బటన్‌పర్ల్' అనేరకం ముత్యాన్ని తయారుచేయాలంటే అర్ధచంద్రాకారపు న్యూక్లియస్‌ను ప్రవేశపెట్టాలి.

ముత్యపు చిప్పల్లో అనేకరకాలు ఉంటాయి. ముత్యాలరంగు అవి తయారయిన ముత్యపు చిప్పలమీద ఆధారపడి ఉంటుంది. బ్లాక్‌లిప్ పర్ల్ ఆయిస్టర్ జాతికి చెందిన ముత్యపు చిప్పల్లో 'బ్లాక్ పర్ల్స్' తయారవుతాయి. అరుదుగా లభించే వీటి ఖరీదు చాలా ఎక్కువ.

ప్రపంచ ప్రసిద్ధి చెందిన జపాన్ ముత్యాలు 'అకోయ' అనే రకపు ముత్యపు చిప్పల్లో తయారుచేస్తారు. ఈ ముత్యాల చుట్టుకొలత 3 నుండి 10 మిల్లీ మీటర్లదాకా ఉంటుంది.

'వైట్ బట్టర్‌ఫ్లై' అనే రకం ముత్యపు చిప్పల్లో తయారయ్యే ముత్యాలను 'సౌత్ సీపర్ల్స్' అంటారు. వీటి చుట్టుకొలత 10 నుండి 17 మిల్లీ మీటర్లదాకా ఉంటుంది. వీటి ధరకూడా ఎక్కువే. ఇవి ముఖ్యంగా ఆస్ట్రేలియా దేశంలో తయారు అవుతాయి.


ముత్యపు చిప్పలోనికి 'న్యూక్లియస్'ను ప్రవేశపెట్టే



ముత్యాల నాణ్యతను, సైజునుబట్టి వేరు వేస్తారు.

చెరువుల్లో పెరిగే 'పాండ్ బట్టర్‌ఫ్లై' ముత్యపు చిప్పల్లో బియ్యపుగింజ ఆకారంలో ఉండే 'రైస్ పర్ల్స్'ను తయారుచేస్తారు. వీటి తయారీ జపాన్‌లో ఎక్కువ.

'కల్చర్డ్ పర్ల్స్' ఉత్పాదనలో జపాన్‌దేశం అగ్రగామి. ప్రస్తుతం ఇతర దేశాల్లో కూడా జపాన్ సహకారంతో 'కల్చర్డ్ పర్ల్స్ ప్రాజెక్టు' లను నిర్వహిస్తున్నారు. మన దేశంలో తమిళనాడులోని రామేశ్వరానికి సమీపంలోగల మండపం వద్ద ఇలాంటి కేంద్రాన్ని ప్రారంభించారు. అయితే దీన్ని జపాన్‌వారి సహాయంతో కాకుండా మన శాస్త్రజ్ఞులు జరిపిన పరిశోధనల ఆధారంతోనే నిర్వహిస్తున్నారు.



ముత్యాల ఆభరణాలను తయారుచేసును నిపుణులైన హైదరాబాదు పనివారు.

పూర్వం నుండి దక్కన్ ప్రాంతపు రాజులు, నవాబులు ముత్యాలను అమితంగా ఇష్టపడుతూ వాటి వ్యాపారాన్ని ప్రోత్సహించారు. అందువల్ల దక్కన్ ముత్యాలకు మనదేశంలో ఓ ప్రత్యేకస్థానం ఉంది. గోల్కొండ నవాబుల సంస్కృతి, అభిరుచి ముత్యాల వ్యాపారాన్ని మరింత వృద్ధిలోకి తెచ్చాయి. అప్పటి నవాబులు, సంపన్నులు ముత్యాల పనివారికి ప్రత్యేకమైన నమూనాలు, సలహాలు ఇచ్చి నగలు చేయించుకొనేవారు. ముత్యాలతో అందంగా అలంకరించిన దుస్తులు, టోపీలు, చెప్పులు, చేతిసంచులు ఇష్టంగా వాడేవారు. అప్పట్లో మధ్యతూర్పు దేశాల నుండి 'బస్రేకిమోతి' అనే మేలి ముత్యాలు దిగుమతి అవుతుండేవి.

దాదాపు ఎనభైఏళ్లక్రితం జైపూర్, బికనీర్‌లకు చెందిన మార్వాడీలు హైదరాబాదులో ముత్యాల వ్యాపారానికున్న గిరాకీని గుర్తించి, దానికిగల మంచి భవిష్యత్తును ఊహించి ఇక్కడికి వచ్చి స్థిరపడిపోయారు. దాంతో హైదరాబాదు ముత్యాల వ్యాపారానికి కేంద్రంగా వెలుగులోకి వచ్చింది. 1950 నుండి జపాన్ ముత్యాలు హైదరాబాదు ముత్యాల వ్యాపారంలో ప్రముఖస్థానాన్నాక్రమించాయి.

హైదరాబాద్‌లోని చార్‌మీనార్ ప్రాంతం ముత్యాలకు సుప్రసిద్ధమైంది. కేవలం ముత్యాలు మాత్రమే అమ్మేషాపులు ఆ ప్రాంతంలో దాదాపు యాభైదాకా ఉన్నాయి. ముత్యాలను శుభ్రపరచడంలోనూ, పాలిష్‌చేయడంలోనూ వంశపారంపర్యంగా సంక్రమించిన నైపుణ్యం, అనుభవంగల పనివారు ఇక్కడ ఉండటం, వారు ఆ పనులు చౌకగా చేసిపెట్టడం, హైదరాబాదులో ముత్యాలవర్తకం వృద్ధిపొందడానికి ముఖ్యకారణం. అలాగే తరతరాలుగా ముత్యాలవ్యాపారం చేస్తూ వాటి నాణ్యతను,



ముత్యాల నాణ్యతను పరీక్షిస్తున్న కొనుగోలుదార్లు.

విలువను చక్కగా గుర్తించగల అనుభవం, నైపుణ్యం ఉన్న మార్వాడీ వ్యాపారస్తులు ఇక్కడే ఉండటం మరోకారణం. బొంబాయి, మద్రాసు వంటి నగరాల్లో ముత్యాలు లభించే షాపులు ఉన్నా అక్కడ ఇతర ఆభరణాలతోబాటుగానే ముత్యాలుకూడా అమ్ముతారు. ఒక్క హైదరాబాదులో మాత్రమే కేవలం ముత్యాలకు ప్రత్యేకించి షాపులున్నాయి. ఈ కారణాలన్నింటివల్ల హైదరాబాదు ముత్యాలు ఓ ప్రత్యేకతను సంతరించుకున్నాయి.

పాలీష్‌చెయ్యని ముడిముత్యాలు చైనా, జపాన్ దేశాల నుండి బొంబాయికి దిగుమతై అక్కడినుండి హైదరాబాదుకు వస్తాయి. వాటిని 'రావర్ల్స్, అంటారు. 'రావర్ల్స్'ను నూలునంచులలోవేసి పెద్ద ఇత్తడిగిన్నెలో మరుగుతున్న నీళ్లలోవేసి, రెండురోజులపాటు ఉడకబెడతారు. తరువాత వాటికి కన్నాలుచేసి హైడ్రోజన్‌పెరాక్సైడ్‌తోపాటు సీసాలలోనేసి రెండుమూడు రోజులు ఎండలోపెడతారు. తరువాత పాలీష్ చేసి సైజును, ఆకారాన్నిబట్టి వేరుచేసి హారాలుగాగుచ్చి భద్రపరుస్తారు.

ముత్యాలుకొనేవారికి కనబడేవి ఖరీదయిన షాపులు, అద్దాల పెట్టెల్లో అందంగా అమర్చిన ముత్యాలహారాలు, సోఫాలు, షాండ్లియర్‌లు మాత్రమే. కాని ఆ అద్దాల గదులవెనుక, ఖరీదయిన ముత్యాల మెరుపువెనక రోజుకు 8 నుండి 10 గంటలు చెక్కపీటలముందు కూర్చొని సన్నటి, నాజూకైన ముత్యాలకు పాలీష్‌చేస్తూ, కన్నాలుచేస్తూ కళ్లుపోయేలా శ్రమించే నిపుణులైన పనివారందరో ఉన్నారు. వీరిలో చాలామంది స్త్రీలే. వీరి సంపాదన రోజుకు ఎనిమిది, పది రూపాయలకుమించదు. నెల జీతం మీద పనిచేసేవారికి రూ. 300 నుండి రూ. 500 దాకా ఇస్తారు. వీరిలో మంచి నైపుణ్యం ఉన్న కొద్దిమంది పనివారు మాత్రమే నెలకో వెయ్యిదాకా సంపాదిస్తారు.

ప్రస్తుతం మార్కెట్లో ఉన్నది 'కల్చర్డ్‌పర్ల్స్' మాత్రమే. అయినా 'కల్చర్డ్



నాణ్యతను, సైజును, రంగునుబట్టి వేరుచేసి, ఎగుమతికి సిద్ధపరచిన ముత్యాలు.



ముస్లిములకు ప్రీతిపాత్రమైన 'సత్లడీ'

పర్ల్స్‌ఫామ్'లో పెరిగే ముత్యపుచిప్పల్లో తయారయిన వాటిని 'నాచురల్ పర్ల్స్' అనీ, ప్రయోగశాలల్లో రసాయనిక పదార్థాలతో తయారయే కృత్రిమ ముత్యాలను 'కల్చర్డ్‌పర్ల్స్'అని వ్యాపారస్తులు వ్యవహరిస్తూ ఉంటారు. నాణ్యతలోనూ, ధరలోనూ ఈరెండింటికీ చాలా వ్యత్యాసం ఉంటుంది. మునిపంటితో కొరికి చూసి అవి మంచివయినది, నకిలీవయినది 'గుర్తించవచ్చు. మంచిముత్యాలు గట్టిగా, రాయిలా ఉంటాయి. కృత్రిమ ముత్యాలు కొద్దిగా మెత్తగా, తేలిగ్గా ఉంటాయి. మంచిముత్యాల ఆకారం ఒక పద్ధతిలో ఉండదు. రంధ్రాలు చిన్నవిగా ఉంటాయి. కృత్రిమ ముత్యాలు గుండ్రంగా ఉండి, రంధ్రాలు పెద్దవిగా ఉంటాయి. ముత్యాల కాంతిని లైట్ల వెలుగులో చూడకూడదు. వాటిని ఎప్పుడూ సహజమైన వెలుగులో పరిశీలించడమే మంచిది. కాంతిని, సైజును, ఆకారాన్ని బట్టే ధర ఉంటుంది. సైజుకంటే కాంతికే ప్రాముఖ్యతనివ్వాలి. లేతగులాబి ఛాయ ఉన్న ముత్యాలు ఖరీదెక్కువ. 'పింక్‌పర్ల్స్' 'బ్లూపర్ల్స్' వంటివి కొనేటప్పుడు వాటిరంగు జాగ్రత్తగా గమనించాలి. ముత్యాలను 'ప్రాసెస్' చేసేటప్పుడు కూడా రంగు కలిపి నకిలీ 'పింక్‌పర్ల్స్' తయారుచేయవచ్చు. నకిలీవి రంగు ముదురుగా ఉండి, కొద్దిరోజులకే రంగు వెలిసిపోతుంది. కేవలం ముత్యాలు మాత్రమే అమ్మే షాపుల్లోనే ముత్యాలు కొనడం మంచిది.

ఎంత ఖరీదయిన ముత్యాలయినా సరే కొన్న తరువాత కొన్ని జాగ్రత్తలు తీసుకోవాలి. ముత్యాలకు గాలి తగులుతూ ఉండటం చాలాముఖ్యం. గాలి చొరని పెట్టెల్లో వాటిని భద్రపరచడం వల్ల కాంతిని కోల్పోయి పాడవుతాయి. ఘాటయిన పరిమళద్రవ్యాలు, ఆల్కహాలు, పెట్రోలు వంటి వాటికి దూరంగా ఉంచాలి. వేడి





'మికిమోటో'



ఎక్కువ తగులకూడదు. చెమట ముత్యాల కాంతిని తగ్గిస్తుంది. ముత్యాల నగలు ఒకసారి వేసుకొని తీసేసిన తరువాత శుభ్రమైన మెత్తటి నూలుబట్టతో తుడిచి నూలుసంచిలో భద్రపరచాలి. ముత్యాలు బంగారులో చుట్టడంవల్ల తొందరగా అరిగిపోయే ప్రమాదం ఉంది. వాటిని పట్టు లేదా నైలాన్‌దారంతో గుచ్చుకొని అప్పుడప్పుడు మార్చుకుంటూ ఉండటం మంచిది.

--స్వర్ణలత

---

# వచ్చేనెల చతుర లో



"ఖర్మకాదు... అది మనహక్కు. మన వెనకున్న జనం దగ్గర ధనం ఉంది. ప్రజలంతా నావాళ్ళు అనుకున్నట్లే వాళ్ళ ఆస్తి అంతా మనదే అనుకోవడం ప్రాథమిక రాజకీయ లక్షణం. జనం దగ్గర డబ్బుందికదా అని సూటిగా అడిగితే ఇవ్వరు. దానికి నేర్పూ, ఓర్పూ కావాలి. నువ్వు కాస్త ఓర్పు వహిస్తే, దానికి నా నేర్పుని జతచేసి పదిహేనురోజుల్లో నీ మెళ్లో నెక్లెస్ దించుతా... సరేనా?'' అన్నాడతను. ఆనందంతో ఉప్పొంగిపోయిందామె.

తన జేబులోంచి చిల్లిగవ్వకూడా బయటికి తియ్యకుండా సమయంచూసి పదవిని వాడుకుని కోరికలు తీర్చుకోవటం అతని పొలిటికల్ ఫిలాసఫీ. ఎవరతను? ఎవరామె??

ఇంతకీ ఆమె కోరిక తీరిందా?

అతను ఇచ్చినమాట నిలబెట్టుకున్నాడా? అదెలా జరిగింది??

అతిరథమహారథులున్న ఈ రాజకీయ రణరంగంలో పన్నుతున్న చక్రవ్యూహాలూ, వాటిని భేదించే ప్రతిద్వంద్వుల ప్రయత్నాలు ఎలాంటివి?

**వయ్యస్సారెస్ తాజా నవల 'చక్రవ్యూహం' జనవరి 'చతుర'లో చదవండి!**

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.